

# యుద్ధోన్మాది అమెరికా సామ్రాజ్య వాదం



2008
ఫిబ్రవరి
270

సంపాదకుడు
**సి.ప్రసాద్**

మేనేజర్
**ఎస్. రవికుమార్**
5-1307,
దొరసానిపల్లె రోడ్,
ప్రొద్దుటూరు,
కడప జిల్లా - 516 360.

సంపాదకవర్గం
**పాణి**
**కృష్ణాబాయి**
**వి.చెంచయ్య**
**మోహన్**
**షరీఫ్**

రచనలు పంపవలసిన చిరునామా :
**టి. కృష్ణాబాయి**
9-19-3
CBM కాంపౌండ్
విశాఖపట్నం - 530 003.

కవర్ డిజైన్ : **జుగాష్ విలి**



# సంపాదక లేఖ

హిందూ దేవుళ్ళని కించపరిచాడని
యమ్.ఎఫ్. హుసేన్ పెయింటింగ్స్ ధ్వంసం
గుళ్ళో బూతు బొమ్మల మాటేమిటినంటే
మా దేవుళ్ళను మేం మాత్రమే తిట్టవచ్చు, కొలుచుకోవచ్చనే జవాబు

సరోవర్ డ్యాం నిర్వాసితుల పక్షాన 'మోడి' ప్రభుత్వాన్ని ప్రశ్నించినందుకు
అమీర్‌ఖాన్ సినిమాలపై దాడి
హిందూత్వ ప్రత్యక్ష ప్రయోగాశాలైన
గుజరాత్‌లో 'ఫనా' నిషేదం

రాజపుత్ రాజు తనకుమార్తెను అక్బరు చక్రవర్తికిచ్చి పెళ్ళి జరిపించింది ఒక చరిత్ర
వారిమధ్య యుద్ధరహిత ఒప్పందం కూడా చరిత్రే
ఆ మహారాణి పేరు జోధా అవునో కాదో రుజువుల్లేవు
అయినప్పటికి జోధా అక్బర్ సినిమాపై దాడి, నిషేదం.
దాడి చేసేది, నిషేదించేది సంఘ్‌పరివారమే
దాడికి గురయ్యేది ముస్లింలు, క్రిస్టియన్లు
ముస్లిం పేరు గల సినిమాలు, ఆర్ట్‌లు
అన్నింటికి కారణం ఒకటే హిందువుల మనోభావాలు దెబ్బతిన్నాయనే సాకు
అన్నింటి లక్ష్యం ఒక్కటే
ఇక్కడి మైనారిటీలు దిగువశ్రేణి పౌరులుగా వుండాలనేదే ధ్యేయం
సెక్యులరిస్టులు యుద్ధం జేయకుండానే ఓటమిని అంగీకరించిన ఫలితమే
మైనారిటీల ఆలోచనలపై స్వయం ప్రకటిత నిషేదం
వాళ్ళ ఉనికి ప్రశ్నార్ధకం,
వాళ్ళ రక్తధారలు, హిందూత్వ వాదుల అధికారానికి రహదారులు
ఇది ఫాసిజానికి రాచబాట

ఈ సంచికవెల : 10 రూ.
సంవత్సర చందా : 100 రూ.
జీవితచందా : 1000 రూ.

చందాలు, బకాయిలు మనియార్డర్, డి.డి.ల రూపంలో మేనేజర్‌కు పంపించండి. డి.డి.లను ఎస్. రవికుమార్, ప్రొద్దుటూరు పేర తీయండి.

## ఈ సంచికలో...



ఇంకా ... స్వీకారం 31వ పేజీలో



❖ ఎం.ఎ. బాసిత్

# ఈద్ నమాజ్

ఆ రోజు బక్రీదు పండుగ. పిల్లాజెల్లాతో ఇల్లంతా సందడిగా ఉన్నది. ఆదరాబాదరాగా మమ్మదంకూసు మస్జిద్‌కు పోదామని తయారవుతాండు. పండుగ పూట అమ్మా బాపులను జూసి పోదామని చంటి పిల్లలను వెంటబెట్టుకొని బిడ్డ వాతలబీ వచ్చింది. తెల్లారగట్ల చీకట్లనే నిద్ర లేచిన అమీర్‌బి, బిడ్డ వాలిబీని లేపుకొని అల్లంత దూరాన ఉన్న మోటబావిల కెల్లి నీళ్ల తోడుకొచ్చింది. ఎర్రమన్ను నానబెట్టి అలుక్కు సిద్ధం చేసుకొని ఏగిలిబారక ముందె ఇంటి మూడు చుట్లు ఊడ్చుకొచ్చింది. వాకిట్ల దుమ్ము లేవకుండా పెండ కలపని నీళ్ళు చల్లింది. అక్కడక్కడ ఎర్రమన్ను నీళ్ల చిలకరించింది.

దూరం నుంచే సాయెబుల ఇళ్లని గుర్తుపట్టేటట్టుగ ఇంటి ముంగిట యాప చెట్టు మీద ఆకుపచ్చ జెండా రెపరెపలాడుతోంది. ఎంత 'ఏపుసం' జేసి ఆరుగాలం కష్టపడ్డా తీరని ఎతలు, మారని బతుకు.

గట్టిగా గాడ్పొస్తే కొట్టుకపోయె గుడిసె పైకప్పు. ఇల్లన్నా గట్టిది కట్టుకోకపోతి. కమస్కం గుడిసెమీద గూన పెంకులన్న ఎయ్యకపోతి. ఎప్పుడు - ఏదో ఓ ఖర్చు. సంసారం పాడువడ. అన్నదాంట్లకె పోబట్టె. గీదీంట్లనె ఒ అండెంల తడక సాటుకు వంట చేసుకునుడాయె. అండ్లకెల్లి ఆమీర్‌బి ఇగ ఎల్లలేదు. అగ ఎల్లలేదు ఏం పనిలో ఉందో ఈ ఆడమనిషి తెల్లారక ముందటె నుంచి ఏదో ఓ పనిల తలమున్కలైతాంది. ఇగిప్పుడు లోపటె నుంచి అలుకుడు షురూ చేసి నట్లున్నది. మమ్మదంకూసు ఆలోచన్లలోకి జారిపోతాండు.

"కొత్త అంగీ, లాగు కుట్టించుకోరాదు?" పండుగపూట నమాజుకు పోయెటోడని కావచ్చు నెల రోజుల నుంచి అమీర్‌బి ఒక్క తీరుగ పోరుబెట్టింది.

గందుకే పోయిన ఆదివారం సర్కాల అంగట్ల తల్లీ బిడ్డలకు చీర, రైక గుడ్డలు, వాలిబీ బిడ్డలిద్దరికీ తలో డ్రెస్సు, బాలాదూర్‌గ తిరుగుతున్న కొడుకు రహీమ్‌కు తగినట్టివి ఓ జత గుడ్డలతో పాటుగ తన కోసం కూడా అంగి బట్ట, లుంగి గుడ్డ కొనుక్కొచ్చి పడేసిండు. దాంతో ప్రతిసారి ఆనవాలుగ జరిగే చర్చకు తెరలేసింది.

"తోటి సాయెబుల మాదిరిగ పొడుగులాగు అసొంటిది కుట్టించుకోరాదు?" అర్రల కెల్లి చేతులు తుడుసుకుంట బయటికొచ్చిన అమీర్‌బి ఏదో యధాలాపంగనే అయినా, మొగుడు పొడుగు లాగు తొడుక్కుంటే చూడాలనె కాంక్షతోటి అన్నది. పెండ్లైన కాణ్నుంచి ఈమెది ఇదే నస. అయినా మమ్మదంకూసుకు చెవి మీద పేను పారినట్లైయినా అనిపించదు.

"ఏదో ఎవుసం జేసుక బతికె నాలాంటి పల్లెటూరి బైతుకు పైజామాల్లాంటె పొడుగులాగు లేం నాకా?" అవేవో తనకు తగని వన్నట్లు ఆమె మాటల్ని పట్టించుకునేటోడు కాదు.

"అది కాదయ్యా మొగడ, మోకాళ్ళ కింది దాక బట్ట ఉంటేనె నియ్యత్ జెడ పోదంటరూ కద?" అమీర్‌బికి అనుమానం తీరక మరో ప్రశ్న అంటించింది.

"అసలు నియ్యత్ నక్కంగుండడానికి, పొడుగు లాగుకు సంబంధమేంది... అమీనా మనసు మంచి గుండాలె గని, గివన్ని ఎందుకు?"

"నీకు గనుక ఉంది మంచి మనసు గని, నమాజ్ సదివేదాంకనన్న తహారత్ (శరీరాన్ని అపరిశుభ్రం కాకుండాను, కాకూడని శరీర భాగాలు బహిర్గతం కాకుండాను ఉంచుకోవడం) ఉంచుకోవాలె గద? మోకాళ్ళకింది దాక బట్ట లేకపోతే తహారత్ తెగిపోద్దంటారు గద?"

"అవ్ దానికి లుంగి కట్టె వచ్చే ఇబ్బందేంది! లుంగీ అయితే కిందికి విడువవచ్చు, మీదికి మడువా వచ్చు, కదా!

"...................................."

"పొలంల దిగినపుడు బురద అంటుకుండ కాశబోసినట్లు గోసి పెట్టుకోవచ్చు. ఏ పని బడితే ఆ పని ఏ ఇబ్బంది లేకుండ చేసుకోవచ్చు. నాట్లేసెటప్పుడు, పిడుసలు పంచేటప్పుడు గోసిపెట్టి నడుం బిగిస్తే ఎకరాల కెకరాలు ఇరుసాలు, మరుసాలు ఎంతగనం దున్నినా అలసటే రాదు" తనలో తానే అనుకున్నట్లు పైకే అనేసిండు. ఇవే తన పనికి అనువైన దుస్తులని మమ్మదంకూసు ఉద్దేశం.

ముచ్చట బెట్టుకుంట, ఆలోచించుకుంట కండ్లల్ల 'సుర్మా' పెట్టుకునేసరికి ఓ కనురెప్పకు సన్నని కాటుక రేఖలాంటి గీత, ఇంకో కనురెప్పకు మందంగా నల్లటి చార లాంటిది అంటింది. ఇంతల సందుగుల దాచిపెట్టిన అతర్ సీసాను దూదిల చుట్టుకొని తెచ్చి ఇచ్చింది అమీర్‌బి. పొద్దెక్కుతున్న దనే హైరానా ఒక పక్క, పండుగ పూటైనా సెంటు పూసుకోవాలనె రివాజు మరో పక్క అతలాకుతలం చేస్తాంటే.. లటుక్కున సీసా మూతపీకి, కచ్చా పక్కా దూది తడిపి, తొడుక్కున్న కొత్త అంగికి అక్కడింత, ఇక్కడింత ఆగమాగం పూసుకున్నడు. కిందికో, మీదికో మొత్తం మీద తయారైండు..

"నమాజ్ సదివి అచ్చెటాల్లకు యాటకూర తయారైతది గద?" అని అమీర్‌బికి చెప్పుకుంట మస్జిద్ దిక్కు బయలెల్లిండు.

ఇంటి ముంగిట పాతిన గుంజకు కట్టేసిన రొండు బక్కెద్దులు తన దిక్కే అదేపనిగ జూస్తున్నయ్. అయ్యో! వాటి సంగతి ఎట్ల? వాటికి కాసింత కుడితి, ఇంతంత గడ్డో, గాదమో పెట్టమని అమీర్‌బికి చెప్పనని లోపలి దిక్కు జూసిండు.

ఇంతల ఇంటి ముందటె మైబెల్లి "ఏమైంది అంకూస్ భయ్? బయల్దేర్తానవా, లేదా? యాళ్ళ దాటుతాంది గాదు? తొందర బెట్టపట్టిండు.

"అవ్ భయ్, చలో చలో... రంజాన్ పండుగకైతె ఇంకో గంటైనా యాళ్ల ఉండేది. గీ బక్రీద్ పండుగకు తొమ్మిది గొట్టక ముందె 'అల్లాహు అక్బర్' అనాల్నాయె. పట్నంల గిట్లనైతె ఎనిమిదిన్నర కాకముందె నమాజ్ షురూ జేస్తరట గద?" అనుకుంట మైబెల్లితో పాటు మస్జిద్‌కు నడవబట్టిండు. యాళ్ల దాటున్నదనే పరేషాన్ల 'అంబా' అంటున్న బక్కెద్దుల పిలుపుల్ని మమ్మదంకూసు పట్టించుకోలేదు.

ఈద్‌పూట నమాజ్ సదివించె జాగ - ఈద్గా లాంటి సొలత్ ఊరోళ్ళు చేసుకోలేదు. ఊళ్ళో 'పద్దతులు' తెల్సిన పెద్దలెవ్వరు లేరు. ఎవలు గట్టించిండో, తెల్వదుగాని, బీటలు వారి ఎప్పుడు కూలి పోతదో తెల్వని పాత మస్జిద్‌లనే యెన్కటి జమానల తవ్వకాల్ల బయటపడ్డ ఇసొంటి మస్జిద్ కాడికె, సుట్టుపక్కల నాల్గు ఊర్లల్ల నుంచి సాయెబులు ప్రతీ పండక్కి చేరుకుంటారు.

ఇమాంసాబు జెప్పె నాలుగు మంచి మాటలేవైనా తప్పిపోతయేమోనని మమ్మదంకూసుకు ఒకటే ఆదుర్దా. రొప్పుకుంట, రోజుకుంట ఉరుకులు, పరుగుల మీద మసీదు కాడికి వస్తాండు.

"అసలే తను యాడాదికి రెండుసార్లే నమాజ్ సదివేది. దాన్ని కూడా అందుకోకపోతె ఎట్ల? దక్కవలసిన సవాబ్ (పుణ్యం) దక్కకపోతె మానె, గని తోటి సాయెబులల్ల నామోషిగ ఉంటదాయె". మనసుల మెదులుతున్న ఆలోచనల నుండి బయటికి వస్తూ.... దబ్బ దబ్బ మస్జిద్ చబూతర్ ఎక్కి దుబ్బల నడిచి వచ్చిన కాళ్ళను కడుక్కోవటానికి చుట్టు పక్కల నీళ్లకోసం చూసిండు.

అక్కడ్నే, మస్జిద్ అరుగుమీదనె నాలుగైదు బిందెల నిండా నీళ్ళు, పక్కన రెండు గుండు చెంబులు కనబడ్తానయ్. మమ్మదంకూసు బిందె పక్కన కూర్చుని, ఓ గుండు చెంబు నిండుగా నీళ్ళు తీస్కొని, కుడి చేతిలోని గుప్పెడు నీళ్ళు పుక్కిట పడుతూ, పుక్కిలిస్తూ, ముక్కు చీదుతూ ముఖాన్ని శుభ్రం చేసుకున్నాడు. మో చేతుల కూసల దాక నీళ్ళతో తుడుచుకొని మధ్య మధ్య అటోళ్లను, ఇటోళ్లను జూసుకుంట, తలవెంట్రుకల కుదుళ్ళ నుంచి వేళ్ళను పోనిచ్చి, ఆఖర్కి చీలమండల దాక పాదాలను శుభ్రంగా కడుక్కొని మొత్తం మీద వజూ (ముఖాన్ని, కాళ్ళు చేతుల్ని ఓ పద్ధతి ప్రకారం కడుక్కోవటం) అయ్యిందనిపించిండు.

గుంబజ్ దాటి లోపలికి అడుగు బెట్టంగనె 'జన్నతుల్ ఫిర్‌దౌస్' పరిమళం గుప్పుమంది. అందరిలాగా తలమీద తనకు టోపి లేదని నాల్కకరుచుకొని, వెంటనే భుజాన వేసుకున్న తువ్వాలనే దుబాయ్ సేఠ్ లాగ తలమీద

కట్టుకున్నాడు. అందరి దిక్కు జూసి అందరికి కలిసి ఒక్కటే సలాం దెబ్బ తీసిండు. ఇంకా పక్క ఊర్లల్ల నుంచి సాయెబులు బుగలెన్క, బుగలు పడుకుంట, లేసుకుంట వచ్చి చేర్తాండ్లు.

"తన కొడుకే ఊరు మీదపడి యాడ తిరుగుతాండో? ఇంక రాకపాయె. అమినా తన కొడుక్కు సదువురాక మసీదు దిక్కు రాకపాయె. మరి అమీర్ బీ వాళ్ల ఆపా కొడుకు, గా పట్నంల సదువుకున్న పోరడు బషీరు పోయినసారి బక్రీదు పండుగప్పుడు ఏవో సభలు జర్గుతాయని పండక్కి ఇటు రాకనెపాయె. పండుగ పూట తండ్రికి పూదుఎయ్య రాలేదని భాభీ ఒక్కటే ఏడుపు. ఎవల్తోటైనా గది గట్లెట్ల, గిది గిట్లెట్ల అని గా పోరడు విడమరిసి ఒకటే బైస్ జేస్తడని ఎవలో అనంగా ఇనింటి. తన కొకుకంటె తెల్వక ఖరాబు అయ్యిండనుకుందాం.... మరి గా పోరడు?" మమ్మదంకూసు స్వగతంలో అనుకున్నడు.

ఆ ముచ్చటా, ఈ ముచ్చటా మాట్లాడుకుంట ఇమాంసాబ్ నెమ్మదిగ మజ్హబ్ ముచ్చట్లలోకి దించుతాండు. మమ్మదంకూసుకు ఓ ముచ్చట అర్థమైతోంది. ఓటె కాదు ఎప్పుడు విన్నా, మళ్ళీ ఏదో కొత్తగానె ఉంటది. ఇమాంసాబ్ కూడా బార్ బార్ ఇవే ముచ్చట్లు చెప్పినా మళ్ళా ఏదో కొత్తగానె ఉంటది. ఇమాంసాబ్ కూడా బార్ బార్ ఇవే ముచ్చట్లు చెప్పినా మళ్లా ఉత్సాహంగానె చెప్తాంటడు. వినేటోళ్ళు వింటూంటరు. మమ్మదంకూసు అటూ ఇటూ జూసుకుంట, అట్లనె మసీదు గోడల దిక్కు దృష్టి సారించిండు. గోడలన్ని ఎక్కడ బడితె అక్కడ పగుళ్లతో బీటలు వారినయ్. పగుళ్ల సందుల్ల అక్కడక్కడ మస్తాన్ దర్బార్ అగర్ బత్తీలను గుప్పెడు, గుప్పెడు ముట్టించి చెక్కిండ్లు. గప్పు గప్పున సుగంధాన్ని వెదజల్లుతూ పొగ మేఘాలు ఎగిసి మస్జీద్ అంతా పండుగ వాతావరణాన్ని ప్రతిబింబిస్తోంది. బహుశా ఈ మేఘాల తేరు మీదనె ఇక్కడున్నోళ్లందర్నీ జన్నత్‌కు (స్వర్గానికి) తీసుకెళ్ళి - అంతా తిప్పి చూపిస్తారా ఏంది? మమ్మదంకూసు ఒక్కసారిగా విభ్రమకు గురి అయ్యిండు.

ఇంతల ఎవరో "ఫజర్ నమాజ్ ఇంటి కాడ సదువుకొని వచ్చిండ్లా?" అదేదో అత్యవసరమన్నట్లు అడుగుతాండ్లు.

"గప్పుడు గా ముచ్చట ఎందుకు?" ఇంకో సాయెబు సణిగిండు.

"అదిగాదు భయ్, గది సదవక పోతే ఈద్ నమాజ్ ఖుబూల్ కాదంటరు తెల్సా"?

"అట్లానా బామిసాబ్, మరైతే ఎట్ల? గది నేను సదవనే లేదుకద?" మమ్మదంకూసు మనసుల భయం జొరబడింది.

"నీలాగే గదాన్ని శానామంది సద్వలేదుగాని, బేఫుజూల్‌గ పరేషాన్ గాకు". మరేం ఫరవాలేదన్నట్లు ఇంకో గడ్డపాయన సముదాయించిండు.

"మరైతే గట్ల సదవనోళ్ళందరి ఈద్‌నమాజ్ ఖుబూల్ కానట్లేకదా?"

"గదేం లేదు. గదానికి ఓ ఉపాయం ఉన్నది భయ్. ఖజా నమాజ్ సదివేస్తే అయిపాయె". ఇమాంసాబ్ భరోసా ఇచ్చిండు.

"ఈ ఖజా నమాజ్ ఏంది భయ్?"

"ఆలస్యంగ జదువుకునె నమాజ్, పొద్దుగాల్ల ఫజర్‌ల నమాజ్ సదూకోని వాండ్లు, గిపుడు ఖజా నమాజ్ సదూకోవచ్చు. ఐదు నిమిషాలు టైం ఇస్తున్నాను. జల్దీ సదువుకోండ్లి". అందర్కి ఆఖరి మాటగా ఇమాంసాబు జెప్పిండు.

ఇమాంసాబ్ ఇంతగనం జెప్పినా... ఎవరో ఒకరిద్దరు తప్ప, అంతకుమించి ఎక్కువ మంది ఖజా జోలికి పోలేదు. మమ్మదంకూసు ఇంటె ముంగిటె మైబెల్లి కూడా ఖజా సద్వలేదు. అట్ల ఇంటికాడ ఫజర్ నమాజ్ సద్వని చాలామంది. ఖజానమాజ్ సదువుత లేరని మమ్మదంకూసుకు తెలుస్తనే ఉన్నది.

ఇంతల "టైం దాటిపోతాంది. సద్విన కాడికి సాలుగని.. లేండ్రి భయ్, అసర్ సంగతి కానీయండ్రి భయ్!" ఇంకో దిక్కు తొందర బెట్టటోళ్లు ఎక్కువైండ్రు.

"అట్లైతే ఇగ లేండ్రి. ఈద్ నమాజ్ సదువుదం. చలో ఉఠో" ఇమాంసాబ్ ఏలాన్ చేసిండు.

వంగి లేవడానికి, కూర్చున్నంక నేల మీద ముఖం బోర్లించి సజ్దా చెయ్యడానికి సరిపడేటంత జాగ ముందు వెనకాల వదిలేసి, ఎన్ని అడ్డువరుసలు వీలైతే అన్ని వరుసలు జమాయించండ్లని ఇమాంసాబ్ సూచనలిస్తాండు. ముఖ్యంగ ఒగల భుజాలు, ఒగలకు తగిలేలాగ దగ్గర, దగ్గర నిలబడాలని ఖాస్‌కర్ చెప్పిండు. భుజాల నడుమ కాసింత సందు ఉన్నా, అండ్ల సైతాన్ వచ్చి సొరబడ్తడని హెచ్చరిక జేసిండు. మొత్తం మీద సాయెబులంతా పెద్దా చిన్నా తేడాలు లేకుండా పక్కపక్కనె నిలబడ్డరు. "ఇట్ల నిలబడ్తె ఒగలకెల్లి, ఒగలకు ఆత్మీయత ప్రవహిస్తదని" పక్కనున్న గడ్డపాయన, ఇరికిరికి నిలబడ్డ మమ్మదంకూసుతోటి చెప్తాండు.

"అది సరేగాని, ఈద్ నమాజ్ షురూ చేసేముందు ఇచ్చేటటువంటి, ఆ పొట్టి అజా ఎవలు ఇస్తరు?" ఇమాం అదో వంతు మిగిలి ఉన్నట్లు అందరి ముఖాలు జూడబట్టిండు.

మస్జిద్ పాతదే అయినా, ఆ ఊళ్లో ప్రతి రోజు నమాజ్ చదివే దిక్కేలేదు. ఇగ అజా ఇవ్వడానికి ఫలానా మనిషి అంటూ ఎవలు ఉంటరు? ఊళ్లె వయసు పోరగాల్లు పెద్దగా ఎవరు ఉండనే ఉండరైరి. ముసలోల్లు, ముడగోల్లు ఎవలైన ఉన్నా పొద్దస్తమానం ఎవల గోస వాళ్ళదే నాయె. చిన్న పిల్ల గాండ్లకు ఖాస్‌కర్ దిన్ తాలీమ్ అంటూ ఊళ్ళో చెప్పెటోళ్ళెవరున్నారు? పట్నాలల్ల అయితే మదర్సాలుంటయ్. మౌల్వీసాబ్‌లుంటరు. అసొంటి సదువు ఇక్కడ యాడున్నది? ఈడ ఎట్ల తెల్లార్తదో గట్లనే పొద్దుగుంకుడాయె. ఎక్కడేసిన గొంగళి గక్కడ్నే ఉండుడాయె". మమ్మదంకూసుకు తన బతుకులాగె, తన ఊరు తీరు గూడ ఉన్నదనిపించింది.

ఇంతల పట్నంల సదువుకొని ఆ సరికే వచ్చిన వయసు పిల్లగాడు, బషీరు దిక్కు అందరి చూపులు మల్లినయ్.

తప్పేటట్టు లేదని బషీరు, ఆ చిన్నపాటి అజాఁ ఇచ్చేస్తే, ఓ పనై పోతదని బయటికి వచ్చి, చబూతర్ మీద నిలబడి, పడమటి దిక్కు తిరిగిండు. రెండు చెవులల్ల బొటనవేళ్లు జొనిపిచ్చిండు. "అస్సలాతు ఈదుజ్జుహా... మాసిత్తతు తక్బీరాత్... యారహ్మముఖ్మల్లాహ్!" చెవుల్ల జొనిపించిన చేతులు కదిలించుకుంట మూడుసార్లు బిగ్గరగా అవాజ్ చేస్తూ పిలుపు ఇచ్చిండు.

"అరె పొలగాడు అజాఁ బాగనె ఇచ్చిండు, భయ్!" ఒగలిద్దరు కితాబు లిచ్చిండ్లు.

"గింత మంచిగ అరబ్బి పలుకులు పలికే పోరడు, వాని బాపుకు పూద్దాన్‌ల పూదెయ్యడానికి పోయినసారి బక్రీదుకు ఎందుకురాలేదబ్బా!.... దేన్నైనా తర్కించి, తర్కించి చూడాలన్నది గీ పోరడు అంటడని సుట్టపోలల్ల అందరు అనుకుంటరు. మట్టిల పుట్టి, మట్టిల సచ్చె తన అసొంటి గామిదోనికి గివన్ని ఎట్ల సమజైతవి?" మమ్మదంకూసు మళ్లా ఆలోచన్ల పడ్డడు...

బషీరు మెల్లమెల్లగా సఫే (వరుసలు) దాటుకుంట, ఇంతకు ముందటె జాగలకు రావాల్నని కోషిష్ చేస్తాండు. వరుసల్లో అందరు ఇరికిరికి నిలబడిండ్లు. ఎట్లా దాటాల్నా అని అటు ఇటు చూస్తాంటె కిక్కిరిసి ఉన్న ఓ సఫ్‌లో చేతులు వేలాడేసుకొని నియ్యత్ చేసుకోవడానికి సిద్దంగ ఉన్న మమ్మదంకూసు కనిపించిండు.

"సలామలేకుం ఖాల్బా" అప్రయత్నంగానె సలాం జేసిండు.

"వాలేకుం సలాం బేటా" మమ్మదంకూసు జవాబిచ్చుకుంట, "యాడ్నో ఓ కాడ ఇరుకరాదు బిడ్డా" అన్నడు.

"ఏదో ఆలోచిస్తావున్నట్లున్నవ్, ఏంది ఖాల్బా?" పరధ్యానంగా ఉన్న మమ్మదంకూసును పనిలో పనిగా అడిగిండు బషీరు.

"క్యా కర్నా బషీర్ మియా, ఏదో పొట్టకూటి కోసం, ఎద్దు ముడ్డి పొడిచేటోళ్లం, మాకేం ఆలోచన లుంటయ్ బాబూ, గవి తప్ప?"

పండుగ పూట నమాజ్ కచ్చి గూడ గీ మనిషి పొట్ట కూడు, ఎద్దు ముడ్డి అంటడేంది! గివే ఆలోచిస్తూ ఉన్నాడా, ఈ మనిషి బషీర్ మొదట్లో అబ్బాజాన్ ఎప్పుడూ గానం చెసే నజీర్ షాయర్ మెదిలింది.

జబ్ తలక్ రోటీకా టుక్డా హోనా దస్తర్ ఖాన్ పర్
నై నమాజోమ్మే లగే దిల్ ఔర్ నకుచ్ ఖుర్ ఆన్ పర్
రాత్ దిన్ రోటీ చఢీ రహ్తీహై సబ్ కి ధ్యాన్ పర్

ఇక్ చపాతీకె వరభమ్మె

(దస్తర్ ఖాన్ (అన్నం తినేటప్పుడు బల్ల మీద పరుచుకొనె గుడ్డ) మీద రొట్టెముక్క లేనంత సేపు నమాజ్ మీద, ఖురాన్ మీద మనసు లగ్నం కాదు. అందరి ధ్యాస చపాతి రెండు పొరల్లోనే....)

ఇప్పటి దాక మమ్మదంకూసు మెదట్ల తిరిగిన ఆలోచనలు, ఇప్పుడు బషీరును కూడా వెంబడిస్తానయ్.

ముంగటి సఫ్ కాడికి చేరటం కష్టం అయ్యేటట్టున్నది. సరే యాడ్నో ఓ కాడ ఇరుకులె ఓ పనైపోద్దని బషీర్ ఆడనె సర్దుకున్నడు.

ఇంతల "ఇగ ఇయ్యాల్టి ఈద్ నమాజ్ ఎట్ల సదువాల్నో కూడా ఇనుండి" ఇమాంసాబ్ 'నమాజ్ క తర్కీబ్' చెప్పబట్టిండు.

"రోజటి నమాజ్‌కు, ఇయ్యాల్టి ఈద్ నమాజ్‌కు తేడా ఏందంటె; ఇండ్లగా పిల్లగాడు అజాంలో చెప్పిన తరీఖల ఇంకో ఆరుసార్లు ఎక్కువగా 'అల్లాహు అక్బర్' అని మధ్య, మధ్యల అనాలె. మొదటి రకాతులో రుకూ (వంగడానికి)కు ముందు మూడుసార్లు, రెండో రకాతుల అంజె ద్వితీయార్ధంలో సీజ్దా(మోకాళ్ళ మీద కూచోవడం) జేసి లేసిం తర్వాత ఇంకో మూడుసార్లు అనాలె. గంతె. ఇంగ ఆ తర్వాత షరా మామూలే".

ఇట్ల పద్ధతంతా వివరించిన తర్వాత, ఇమాం తనకు కెటాయించిన గోల్ గుంబజ్ లాంటి సొరుగుల పరిచిన జానిమాస్ (నమాజ్ చదవటానికి పరుచుకొనె తివాచీ) మీద నిలబడుతండు. మళ్ళా వెనక్కి తిరిగి "ఇంకో ముచ్చట; రెండు రకాతుల వాజిబ్ నమాజ్ ఈ పండుగ సందర్భంగా, ఇమాం వెనుక నిలబడి, కాబా (పడమర) దిక్కు మొఖం జేసి చదువుతానమని, నియ్యత్ జేసుకోండ్రి". అని చెప్పి తను కూడా పడమటి దిక్కు తిరిగి "బిస్మిల్లా హిర్రమాన్ నిర్రహీం" అంటూ అందరి తరపున నియ్యత్ జేసుకున్నడు.

వరుసల్లల్ల నిలబడ్డోల్లంత నమాజ్‌కు సిద్ధమైపోయిండ్లు. వచ్చిన కాడికి అందరు నోట్లె నోట్లె నియ్యత్ జేసుకుంటాండ్లు. రానోళ్లు తెల్సిన కాడికి జేసుకున్నట్లు చేస్తాండ్లు.

'అల్లాహ్ అక్బర్' అనుకుంట ఇమాం నాభి మీద చేతులు కట్టుకొని సూరమె ఫాతెహా, అటెంకల ఇంకో పొడుగాటి సూర, అరబ్బీల దీర్ఘం తీస్తు చదువుతాండు. ఇంత గింజుకున్న అర్థంగాని భాష, మనసుకెక్కత లేదు. మనసెటో మళ్ళుతాంది. ఇంటి కాడ పశువులకు తవుడు, కుడితి పెట్టని సంగతి యాది కొచ్చింది. నమాజ్‌కు వచ్చే తొందర్ల వాటి సంగతి పట్టించుకోలేదు. కనీసం అమీర్‌బి తోటైనా వాట్ని అర్సుకొమ్మని జెప్పి రాకపోతినని మమ్మదంకూసు ఒకటే బాధ పడ్తాండు.

మమ్మదంకూసుకు రెండెకరాల పొలం, రెండకరాల చెల్క, ఓ రెండు బక్కెద్దులు, ఒంటె చేతి ఎవుసం ఉన్నయి. ఆయన దిగులంతా ఆ రెండెద్దుల మీదె. "అమీర్‌బి ఎటుబోతె అటె. ఎక్కడ ఆడోళ్ళు కన్పిస్తె ఆడ్నే కూలబడ్తది. ముచ్చట మీద ముచ్చట బెడ్తది. ముచ్చట సంబురాన మొగుణ్ని మర్చిపోతే మానె, కని పశువుల్ని మర్చిపోతదో ఏమో! ఎట్ల? నోరు లేని పశువులకు నీళ్లెవరు పెట్టాలె? నిప్పులెవరు పెట్టాలె? కులపోళ్లు అంతా కలిసి కోడి కుయ్యక ముందే లేసి యాటను కోసుకుంటిమి. మనిషో పోగు తెచ్చుకుంటిమి. అమీర్‌బి కూర పొయ్యిమీద ఏసిందో లేదో? నీ యమ్మ గిప్పుడే ఆకలి షురూ కాబట్టె. రంజాన్ పండుగప్పుడైతె షీర్ కుర్మ మస్తు తాగి నమాజ్ కొస్తుంటి. ఆకలి సల్లారేది. గీ బక్రీదు పండుగకే, నమాజ్ కంటె ముందు ఏం తినొద్దాయె. తాగొద్దాయె. నమాజైపోయి, ఖుత్బగిట్ల ఖతమయ్యేటాల్లకి ఏ యాళ్లైతదో ఏమో! ఈ ఏడాది అసలే వర్షాల్లేక పొలాలు ఎండిపాయె. ఇగ చెల్కల మక్కుజొన్న ఏసుడు అయ్యద్దా కాదో? వర్షాకాలం అన్నమాటే కాని వర్షాలే పడవాయె. ఎట్లైతే, అట్లైయితది. ఏం జేస్తంగని, ఇంటికి పొయెసరికి అమీర్‌బి బగారా ఖానా వండుతదో లేదో! ఇంట్ల బిడ్డ వాలీబీ ఉన్నా, పాపం సంటి పిల్లల తల్లి, దాని పిల్లల్ని అది సవరిచ్చుకోటానికే బేచైన్ అయితాంది కావచ్చు. రహీమ్ గాడు ఇంట్ల ఉండుడే లేదాయె. పోరంబోకులాగ యాడ తిరుగుతాండో ఏమో? పండుగ పూటన్న పోరడు మసీదు మొఖాన రాకపాయె. మందేవనుకుంటరో నన్న ధ్యాసే లేకపాయె. తిండి యాల్ల కన్న ఇంటి మొఖం జూస్తడో! ఇంతకి అమీర్‌బికి బగారాఖానా సరిగ్గ వండచ్చిందో, లేదో! వాళ్ళ ఆప దగ్గరి కన్నాపోయి మంచిగ వండుడు నేర్చుకొమ్మంటె అస్సలు చెవికెక్కించుకోదు. ఏమో, కిందికో, మీదికో వండక పోతదా? ఇంటికి పొంగానె ఫాతెహా (అల్లాకు నివేదన) ఇయ్యాల్నాయె. అట్లనో, ఇట్లనో తిప్పల బడి ఫాతెహా మందం మాగ నేర్చుకున్నడు. ఫక్కీరోల్లకు కాసింత కూర, బగారాఖానా తీసి పక్కన బెట్టాలె. కల్గినోళ్లయితే ఒక్కో ఇంట్ల ఒక్కో పొట్టేల్ని కోసి జకాత్ చేసి హలాల్ మాంసాన్ని తలింత ఫకీరోల్లకు, చుట్టాలకు పక్కాలకు ఎవల హిస్సా వాళ్ళకు ఇద్దురు. మన బతుకే ఇలా ఎందుకు హీనమై పోయిందో సమజ్ అయితలేదు. ఏదో మనకు శాతనైన కాడికి మనం చేస్తం. ఎవల ఓపాన శక్తి వాళ్లది. శాత కానప్పుడు యాడికి పోయి సచ్చేది? పంటలు సక్కగ పండినా ఏదో ఒకటి చేద్దును. మందులకు పెట్టుబడి శాత కాక ఎంత మంది పురుగుల మందు తాగి సావలేదు. అమ్మో! ఓ పూట తిని, ఓ పూట ఉపాస మున్నా మానె. ఏవో ఇన్ని తిండి గింజలు పండితె అంతేసాలు. అత్యాశకు పోతె పోరగాండ్లకు కరువైపోత. ఏదో అల్లా ఇచ్చిన కాడికి...సాలు. పాపం! నోరు లేని పశువులు! ఎట్లున్నయో, ఏమో! నీళ్ళన్నా పెట్టిందో అమీర్‌బి? పుట్టెడు పని చేసే జీవాలకు అరుసుకునే దిక్కు లేకపాయె. ఇంటికాడ ఓ మనిషి ఉన్నమాటేగాని ఉన్న సందం కాదు. లేని సందం కాదు.

ఇట్ల మమ్మదంకూసు మనసుల ఆలోచనలు మెదులు తాంటె ఇమాంసాబు హఠాత్తుగ "అల్లాహు అక్బర్" అన్నడు.

అట్లంటే ఏ జెయ్యాల్నో మమ్మదంకూసుకు వెంటనే తట్టలేదు. పక్కనున్నోల్ల ల్లాగ చేద్దామంటే... ఒగడు వంగుతాండు. ఒగడు లేత్తాండు. ఒకడు కూలబడ్తాండు. ఒకయన తలమీది టోపి, సీజ్దాజేసి లేత్తాంటె పుసుక్కున ఊడి అట్లనె చిప్పలాగ తెరుసుకొని ఉన్నది. మమ్మదంకూసుకు ఆ సంగతి ఆసక్తిగా మారింది. మళ్లా తలకాయను అండ్ల పెడతాడా? లేదా? ఇంతల 'అల్లాహు అక్బర్' అనుకుంటు సీజ్దా జేసే మిష మీద ఈ సారి తలకాయను అండ్ల ఇరికించె కోశిష్ చేస్తాండు. ఒకలిద్దరు తనలాగే బిత్తరపోయి చూత్తాండ్లు. ఏం జేయాల్నో ఇంకా తోస్తలేదు.

సజ్దానుండి తలెత్తిన బషీర్‌కు ఎంత వద్దనుకున్నా ఈ గందరగోళపు దృశ్యం కనబడ్తాంది. ఇది జూస్తె ఓసారి ఎప్పుడో ఇస్లామియా కాలెజి గ్రౌండ్‌లో జరిగిన ముషాయిరా లో ఓ షాయర్ గానం చేసిన అక్బరాబాదీ నజ్మ్ స్ఫురణకు వచ్చింది.

జో అహలె-ఫజల్ ఆలిమొ ఫాజిల్ కహతెహై
ముస్లిమ్ హునెతో కల్మాతలక్ భూల్ జాతెహై
పూఛె కోయీ 'అలీఫ్' తో ఉసే 'బే' బతాతే హై
నోజో గరీబో గుర్బాకే లడ్కే పఢాతీ హై
ఉన్కతో ఉమ్ర్ భర్ నహే జాతీహై ముస్లిసే

(పండితులు, విద్వాంసులనబడే వాళ్లు కూడా, పేదవాళ్లైతే కల్మా సైతం మరిచి పోతారు... ముసల్మాను అయ్యుండి కూడా ప్రారంభ వాక్యం మరిచిపోతారు.... 'అలీఫ్' గురించి అడిగితె 'బే' గురించి మాట్లాడుతారు... బీదవాళ్ళ పిల్లలకు సదువు చెప్పే పంతుళ్ళు జీవితాంతం బీదవాళ్ళుగానే ఉంటారు.)

నజ్మ్ అంతరార్థం మననం చేసుకుంటున్న బషీర్‌కు, "ఆకలితో ఉన్నవాడికి దేవుడు కూడా అన్నం రూపంలో కనిపించాలి". అని అప్పుడెప్పుడో ప్రజాస్వామ్య తెలంగాణా సభలో ఒక పెద్దాయన అన్న మాటలు గుర్తుకు వచ్చి ఆకలి పోరుకు మూలం ఏంటో విచక్షణకు తాకుతున్నట్లనిపించింది.

ఆలోచనల నుండి బయట పడేసరికి ఒక రకాతు నమాజు ఖతం అయ్యిందన్నట్టు అందరు సక్కగ లేసి నిలబడ్డరు. అంటే సగం నమాజు అయినట్లె. మళ్ళా అందరు నాభి మీద చేతులు కట్టుకుంటాండ్లు. ఇంతకు ముందోల్లెనె మళ్ళా మూడు సార్లు 'అల్లాహ్ అక్బర్' అని ఇమాంసాబ్ అంటాంటె.... మిగతా వాళ్ళు నోట్లె నోట్లె తెలిసిన కాడికి అనుకుంట, చేతులు ఇడుసుకుంట, కట్టుకుంట, నిలబడుకుంట చదవాల్సిన కాడికి నమాజు

# ఉక్క

❖ ప్రశాంత్



అర్ధరాత్రికావస్తున్నది. చలి తీవ్రంగా వున్నది. చీకటి గాఢంగా అలుముకున్నది. కొద్ది దూరంలో చిన్న దీపం బుడ్డి వెలుగుతున్నది. మంచు కురుస్తుండడం వల్ల దీపెపు వెలుతురు చిత్రంగా కనిపిస్తున్నది.

చుట్టుపక్కల మనుషుల ఛాయలేం లేవు. పాడుబడ్డ భవనం ముందు ఎండిపోయిన పెద్ద చెట్టొకటి నిలబడి ఉన్నది. దానికింద రాలిపోయిన ఆకులు మసగ్గా కనిపిస్తున్నాయి. వాటిని తొక్కుకుంటూ వెళ్లి శిధిలమైన కట్టమీద కూర్చున్నాను. కాళ్ళను చూసుకున్నాను. చెప్పులు లేవు. ముఖంపై చేయివేస్తే కంటికింద చిన్నపాటి గాయం కనిపించింది. ఆందోళనంతా మాసిపోయి ఆకలి కొంచెం కొంచెం మొదలయింది.

ఒక అన్నం ప్యాకెట్, నీళ్ళ బాటిల్ ఇచ్చాడు, బలిష్ట దేహం గల ఒకాయన. చేయి కడుక్కుంటే నీళ్ళు ఎండిన ఆకులపై పడి శబ్దం చేశాయి. అంత ప్రశాంతతలో ఆ శబ్దం గమ్మత్తుగా అనిపించింది. సాధారణంగా ఇలాంటి వాటిని అంతగా పట్టించుకోం. కానీ నేనిపుడు వాటిని మాత్రమే పరిశీలించ గలను. ఆకలయితే ఉంది గాని బుక్క నోట్లోకి దిగడం లేదు. ఎంత ప్రయత్నించినా సాధ్యం కావట్లేదు. చేయి కడుక్కుని కట్టమీద కూర్చున్నాను. జేబు తడుముకుంటే చిల్లరేమీ కనిపించలేదు. రెండు రోజుల క్రితం నావైన వస్తువులన్నీ తీసేసుకున్నారు. జేబు తడుముతుంటే ఒకడన్నాడు.

"ప్రాణాలు పోతుంటే ఇప్పుడేంట్రా, నీకు కోరికలూ" అని. ఆ మాటకు నాకు కోపం రాలేదు. బాధా కలగలేదు. ఊరికే విన్నాను. రెండు రోజుల బట్టీ స్తంభించిపోయిన మనసు ఇపుడిపుడే ఆలోచించడం మొదలుపెట్టింది. ముందుకు నడుస్తున్నట్లు తెలుస్తున్నదే కానీ ఆ అడుగులు ప్రయత్నపూర్వకంగా వేస్తున్నావేం కావు.

కొద్దిసేపు నడిచిన తర్వాత ఒక దగ్గర ఆగిపోయాను. సరిగ్గా అక్కడే ఆకుపచ్చని రంగేసిన ఇనుప ఊచలు కనిపించాయి. వాటి మధ్య నుంచి లోపలికి తొంగి చూస్తే అలాంటి తలుపులున్న గదులే ఇంకొన్ని కనిపిస్తున్నాయి.

నిదుర మగత వదలని ఒకాయన వచ్చి బరువైన ఊచల తలుపు తెరిచాడు. దానికి పెద్ద తాళం కప్ప వున్నది. ఆయన వేసుకున్న చొక్కాకు గుండీలు లేవు. పరుపులో నుంచి లేచి వచ్చినట్లుంది. నేను లోపలికి అడుగుపెట్టగానే తిరిగి తాళం వేశాడు. ఆ తలుపు భయంకరమైన శబ్దం చేసింది. ఆ శబ్దానికి పడుకున్నవాళ్ళంతా దిగాలున లేచి కూర్చుని దిక్కులు చూస్తున్నారు. రంగుపోయి తుప్పు పట్టిన ఆ తలుపు మిగతా తలుపులకంటే భిన్నంగా కనిపించింది. గదుల్లో ఉన్నవాళ్ళు బీడీ ముట్టించుకుంటున్నారని అగ్గిపుల్ల గీకినపుడు వచ్చే శబ్దం ద్వారా తెలుస్తున్నది. ఒకాయన పొగ బయటకు వదులుతూ ఊచల మధ్య నుంచి బయటకు చూస్తున్నాడు. ఆ గది ముందే వేలాడుతున్న డొక్కు రేడియో పాటలు పాడి పాడి అలసిపోయి బుస్సుమని అరుస్తున్నది. నన్ను తీసుకెళుతున్న ఆయన ఆ గది ముందే ఆగమని సైగ చేశాడు. దగ్గరగా వచ్చి వొళ్ళంతా తడిమాడు. చేతిలో వాచీ ఇచ్చేయమన్నాడు. ప్యాంటూ, చొక్కా విప్పి ఒకసారి కూర్చుని లేవమన్నాడు! వివరాలు రాసుకున్నాడు. ఈ తతంగం ముగిసేసరికి ఏ ఇరవై నిముషాలో పట్టింది. తాళం తెరిచి లోపలికెళ్ళమన్నాడు. లుంగీ చంకలో పెట్టుకుని గదిలోకి అడుగు పెట్టాను. అక్కడ ఇంకో ఆరుగురున్నారు. ఎవరి ఒంటిపై చొక్కాలు లేవు. లేచి కూర్చొని ఒకరి బీడీ తీసుకుని ఇంకొకరు ముట్టించుకుంటున్నారు. ఇంకొందరు బీడీ మార్చుకుని తాగుతున్నారు. నేను లోపలికి అడుగుపెట్టగానే ఎగాదిగా చూశారు.

---

చదివేసిండ్లు. అక్కడికి ఓ ఖిస్సా అయిపోయింది. అందరు దమ్ము తీసుకున్నరు. అయితె కథ అంతటితో అయిపోలేదు.

పండగ రోజు మాట్లాడుకోవలసిన ఇంకా కొన్ని ఖాస్ ముచ్చట్లు మిగిల్నాయ్. అంటే ఆ రోజు ఇమాంసాబు చేయవలసిన ఖుత్బ (బోధ) ఇంకింత ఉందంటాండ్లు. పక్కనున్న ఖష్ ఖష్‌కి దాడి అతను, అన్నింటికంటే ఇదే ముఖ్యం అన్నట్లు చెవులు రిక్కించి మూతి ముందుకు సాచి ఇమాంసాబ్ మీద దృష్టి సారించాడు.

నమాజ్ మనిషిని ఎట్ల తేట తెల్లం జేస్తది. ఎంత నమాజ్ సదివితే ఎంత సవాబ్ (పుణ్యం) వస్తది! ఏయే రోజుల్లో ఎంతెంత నమాజ్ సదివితే ఎంతెంత పాపం కడిగివేయబడ్తది! ఇట్లా ఎన్నో విషయాలు ఇమాం ఉర్దూ, అరబ్బీల కలిపి జెప్తాంటె, మమ్మదంకూసు కు కొద్ది, కొద్దిగా అర్థం గా బట్టినయ్.

ఒక్క 'జగ్‌నేకీరాత్' రోజు రాత్రంతా నమాజ్ చదివితె జన్నత్‌ల సీట్ ఖాయమట! అయితే పరస్త్రీని కామపు దృష్టితో చూస్తె ఏడేండ్లపాటు సదివిన నమాజ్ అంతా కొట్టుక పోతదట! మమ్మదంకూసుకు తన పనేందో తాను చేసుకునుడు తప్ప ఇంకో ధ్యాసే ఉండదు. ఇమాంసాబు భయపెట్టినట్లు తనకైతె గట్లాంటె ఛినాల్ బుద్ధిలేదు. కాబట్టి తనకేం గాదు అనుకుంటడు.

సరె, ఇమాంసాబు ఇంకా జెప్పుక పోతనే ఉన్నడు. షబ్బెబరాత్, షబ్బెఖదర్‌ల వంటి పవిత్రమైన రోజులల్ల ఒక్కరాత్రి జాగరణ చేసుకుంటు ఎంత ఎక్కు నమాజ్ సదివితే అంత ఎక్కువ సవాబ్ (పుణ్యం) వస్తదట! అంతేకాదు, ఇంతకు ముందు జేసిన ఎట్లాంటి పాపాలైనా ఇట్లే తుడుసుకు పోతయట!

అంటే ముందుగాల్ల పాపం జేసి ఆ తర్వాత అంత మందం నమాజ్ చేసి తుడిచేసుకునె సౌకర్యం ఉందన్నమాట! మమ్మదంకూసుకు గట్లాంటి ఆలోచనలు రావటం ఆశ్చర్యమనిపించింది. ఇవి సవ్యమైనవా? అపసవ్యమైనవా? గిట్లాంటి అర్థం పర్థం లేని ఆలోచనలు రావడం ఏంది? తన మొదట్ల షైతాన్ గిట్ల జొరబడింది, ఏంది?

ఇంకా ఇమాం జెప్తనే ఉన్నడు. "నమాజ్ ద్వారా కమాయించిన బోలెడంత సవాబ్ తో పరలోకంలో మస్తు ఖుషామత్ చేసుకుంట బతకొచ్చు". ఎల్లైసోడు సచ్చినంక వచ్చే లాభాన్ని ఊరించి చెప్పినట్లు, ఎంతో ఉత్సాహంగ, మరెంతో ఉత్తేజంగ, ఉద్రేక పూరితమైన స్వరంతో ఇమాంసాబు చెప్తాండు.

పరలోకం సంగతేమో గాని, మమ్మదంకూసుకు ఈ లోకంల ఎట్ల బతకాలన్నది బాధ. ఒంటె చేతి ఎవుసం ఎట్లబాగు చేసుకోవాల్నని. చేతికి అందకుండ తిరుగుతున్న కన్న కొడుకును పనికి ఎట్ల వంగ బెట్టాలె. ఉన్న చెలకల ఏ పంట ఏస్తె బతుకుతది? ఎండిన పొలాల మీద ఇగనన్న వాన చినుకులు కురుస్తయా? చెల్క దున్నె బక్కపశువులకు కాసింతనైన, గడ్డి మందనైనా వరి గంట పోస్తదో లేదో? పోయినసారి జొన్నశేనేస్తె సొప్పన్నా ఎల్లకపాయె! పశువుల కింత మేత ఎల్లని ఎవుసం ఎవన్ని బాగుజేయ? అయ్యో, నా బక్కెద్దులు ఏమైనయోగదా? ఎట్లన్నయో గదా? అసలే నోరు లేని జీవాలు. అమ్మో అవి సల్లగుండాలె. రెక్కలు గట్టిగ ఉంచుకోవాలె. పెళ్లాం పిల్లలకు, సాటి మనుషులకు గింతంత తిండి పెట్టేటివి గవే కద. గీ రెక్కలే కద? గివిగాక ఇంకేమైనా ఉన్నాయా? ఏదైనా నాకేం తెల్వదు. నా కెరుకున్న కాడకైతె గివ్వె బుక్కడెంత బువ్వపెట్టేటివి.

ఇట్లా ఆలోచనలు ముసురుతుంటే... ఈలోగ అరబ్బీ ఖుత్బగూడ ఖతమైంది. గీ బాధలు ఎప్పటికి ఉన్నయేగని, వచ్చినందుకు పండుగపూట అందర్ని! కలవాలె. అందర్ని చూస్తాంటె కడుపు నిండనట్లైతాంది. మంచి చెడ్డలరుసుకుంట కలిమిడికి గుర్తుగా దీన్ అనుకుంట మమ్మదంకూసు అందర్కి ఈద్ ముబారక్ చెప్పుకుంటు 'అలాయ్ భలాయ్' తీసుకుంటాండే.

ఎడతెగని ఆలోచనల నడుమ ఈద్ నమాజ్! దారి తెన్ను లేకుండ సాగిన దునియాదారి ఆలోచనల నడుమ ఈద్ నమాజ్!

పండుగ సందడిల పడి తన బక్కెద్దుల సంగతె పట్టించుకోలేదు. ముందుగా వాటి గతి ఏమయ్యిందో జూడాలె అనుకుంటు మమ్మదంకూసు ఇంటిదారి పట్టిండు. *

వాళ్ళలో వాళ్ళేదో మాట్లాడుకుంటున్నారు. కాసేపటికే దుప్పటి, పరుచుకునేదీ ఇచ్చారు. అవి నల్లగా మాసిపోయి వాసనేస్తున్నాయి.

మనుషుల్నీ, గదినీ పరిశీలిస్తూ లుంగీ కట్టుకుని ప్యాంటు కొక్కానికి తగిలించాను. టైపు చేసిన కాగితమొకటి చేతిలో ఉంటే తిప్పిచూశాను. ఒకవైపు ఖాళీగాఉంది. ఏదైనా రాసుకోవచ్చన్న ఊహ తట్టింది. మూత్రం పోయడానికి చిన్న సైజు లాట్రిన్ లాంటిది వున్నది. దాని చుట్టూ గోడలు లేవు. రాత్రిళ్లు దొడ్డికి సైతం అదే ఉపయోగించాలని వాళ్ళనడిగితే చెప్పారు. ఆ సందర్భాన్ని తలచుకుంటేనే భయం వేసింది. ఇంత చిన్న చిన్న పనులకు సైతం ప్రైవసీ లేదుకదా అనుకుంటూ, ఏవో ఆలోచిస్తూ వాళ్లమధ్యనే కూర్చున్నాను.

"ఏటనియా ఏటి కేసూ" అన్నాడు ఒకాయన. వయసు నలభైలోపే ఉంటుంది కావచ్చు. నల్లగా, లావుగా ఉన్నాడు. పళ్లు గారపట్టి వున్నాయి. గుండు చేయించుకున్నాడు.

చిన్న టవల్ కట్టుకున్నాడు. ఆ గుడ్డ శరీరాన్ని కప్పడానికి సరిపోవడంలేదని చూస్తేనే అర్థమవుతున్నది. దగ్గరగా కూర్చుని టవల్‌ను లాగి పట్టుకున్నాడు.

మీపేరేంటన్నాను.

"రాజండి. అందరూ రాజుగోడంటారండి. కేడీ పేటున్నాది కదండి. అక్కడ పల్లబేరం చేస్తానండి" అన్నాడు ఒకింత కృతజ్ఞతతో.

"మీ కేసేటో సెప్పనేదండీ" అన్నాడు మళ్లీ ఆయనే.

గవర్నమెంటుకు వ్యతిరేకంగా ఉన్నందుకనీ....... చెప్పాను.

"అలగండీ. అంతేలెండి. ఏటోనండి. నాకు తెల్దండి. ఈ గవుర్మెంటేటో దానిగోలేటో, నాకు తెల్దండి. గవర్మెంటుని ఎవరు నడిపిస్తారేటండీ, పోలీసులే కదండీ......." అంటూ

బీడీ ముక్క నా నోట్లో పెట్టి అంటించాడు.

ఆయన మాటలకు ఏ జవాబూ చెప్పకుండా నవ్విఊరుకున్నాను.

"బెంగగా ఉంటాది. రేపు చెబుదురుగానండీ" అన్నాడు.

మీదేవూరూ అన్నాను.

"ఈరగట్టమండీ కానీ చాన్రోజుల్నించి ఇక్కడే ఉండి పోన్ను" అన్నాడు.

కడుపులో ఆకలికీ, బీడీ రుచికీ కళ్లు తిరిగినట్లనిపించింది. నోరంతా కంపువాసన. పేగులు కరకర శబ్దాలు చేస్తున్నాయి. నీరసంగా గోడకు జారగిల పడుతూ తలపైకెత్తాను. గోడపై ఏసుప్రభు జాలిగా గదిలోని మనుషుల్నే చూస్తున్నాడు.

బాగా పొద్దుపోయిన తర్వాత సింహాచలం వార్డరుగారొచ్చారు.

నిద్రపట్టక ఏదో ఆలోచిస్తున్న వాణ్ణి లేచి కూర్చున్నాను. సింహాచలంగారు పాత సినిమా పాట పాడుతున్నారు. భానుమతి 'మనసున మల్లెల మాలలూగెనే' పాడమని అప్పల్నాయుడు సింహాచలం గారిని బతిమాలుతున్నాడు.

"ఎర్రా ఎదవ నాయాలా, రేప్పాడతాలేరా" అంటూ వెళ్ళిపోయారు వార్డరుగారు.

"మల్లీశ్వరి ఉన్నాదండీ. మా బాగా ఉంటాదండి. ఒక పాత్రా తీసేయడానికి నేదండి. పాట్లూ, మాటలూ అంతేనండి" అన్నాడు అప్పలనాయుడు.

నేను వెళ్లిన కొద్దిసేపటికే చొరవగా పరిచయం చేసుకొని అందరి వివరాలూ చెప్పాడు. వయసు నలభై మించదు. బాగా పొట్టి.

"ఈడి పేరు బ్రెమ్మాజిగోడండి. బామ్మర్దిని సావదొబ్బి సొర్గంలోకొచ్చాడండి. ఇదుగో ఈడున్నాడు కదండీ, ఆడిపేరేటో ఆడికే తెల్దు. మనకేటి తెలుస్తాది సెప్పండి. ఈడేటి సేశాడూ...? ఉంచుకున్న గుంటదాన్ని సావదొబ్బాడు. ఈడికీ ఆ గుంటదానికీ ఇలాకా ఉన్నాదని ఎవరికీ తెలీనేదు. ఈడు సంపేసినట్టా ఎవరికీ అనుమానం రాలేదు. మావూలుగా సచ్చిపోన్దని పూడ్చేశ్నారు. ఊరుకుంటే అయిపోయేది కదండీ. ఎవరో ఆపీసురుగోడితో ఫలానాదాన్ని సంపేశ్నాను, ఏటైంది బాబూగోరూ అన్నాట్టండీ. ఎర్రినాయాల కాప్పోతే. ఇదిగో ఇక్కడొగ్గేశ్నారు. పుల్లుగా పప్పు తినేస్తున్నాడండి. ఈడిపేరు సిరంజీవండి. కుర్రతనం ఎక్కువైపోయి బూ పిల్మిలూ సూశాట్టండి. ఇదిగో ఇక్కడ ఈరోయిన్నై కులికేస్తున్నాడు. ఇక నాదంటారండీ... సారాకేసు. సీస్సారా అమ్మితే కేసెట్టేసి లోపల తోశ్నారండి. ఏటిసేత్తం సెప్పండి. నా బారియ ఉన్నాదండి. ఆ గుంటదానికి మాట్రాదు. మూగది. ఓ బాబండి, ఆడికీ మద్దె ఆరూగ్యం బాగుండట్నేదండి, జొరం" అన్నాడు.

సిమ్మాచెలంగారెళ్ళిపోయాక అందరూ ముసుగు తన్నారు. నాకు నిద్రపట్టలేదు. కళ్ళు మూసుకుంటే ఏవో కలలొస్తున్నాయి. లేచి కూర్చున్నాను. చిమ్మ చీకటి. టైమెంతవుతుందో తెలుసుకోవాలని బయటికి చూస్తే దేముడుగారు టేబిల్‌పై తలపెట్టి గురకలు పెడుతున్నారు. మూలకు ఒదిగి కూర్చుని బీడీ ముట్టించుకున్నాను. బ్రమ్మాజి లేచి "ఏటండీ, నిద్రపట్టదు కదండీ..... మనసలా ఎలిపోతాదండి. ఎంతాపినా ఆగదు. గుండెలో కెలికినట్టయితాదండి" అన్నాడు. ఆయన మాటల గురించి ఆలోచించేలోపే మళ్ళీ అన్నాడు. "ఏటిసేత్తం సెప్పండి, తప్పదండి. పడుకోండి". ఉదియమైతే పావురాలొస్తాయండి. మా బాగా ఉంటాదండి " అంటూ సరిపోని దుప్పటిని ముదురుకుని కప్పుకున్నాడు.

ఊచల మధ్య నుంచి ఆకాశాన్ని చూస్తున్నాను. ఎప్పుడు తెలవారుతుందా అని. కోళ్ళు కూస్తాయేమోనని ఎదురు చూశాను. కూసినా ఇంత పెద్ద గోడలు దాటి వినిపించకపోవచ్చనిపించింది.

హఠాత్తుగా మనకు తెలియని పరిసరాల్లో మనని బందీచేస్తే ఉండే ఆందోళనే నాలోనూ ఉంది.



ఆకాశం తెల్లబడి గదిలో కొంచెం వెలుతురు పరుచుకుంది. నలుపు తెలుపుల వింతకాంతి అది. ఎక్కడో దూరంగా మనుషుల అరుపులు వినిపిస్తున్నాయి. అప్పుడనిపించింది, ఈ కారాగారం ఇళ్ళ మధ్యన ఉన్నది కావచ్చని. బహుశా ఐదుగంటలపుడు దేముడు వార్డరుగారు లాఠీతో ఊచల్ని టకటకలాడిస్తూ వస్తున్నారు. మూడో నాలుగో గదులున్నట్టు అర్థమయింది. రాత్రి అటువైపు నుంచే వచ్చినా వాటి గురించి పట్టించుకునే స్థితి లేదు.

వార్డరుగారి కర్ర శబ్దానికి అందరూ దిగ్గున లేచి కూర్చున్నారు.

అప్పలనాయుడు తలగోక్కుంటూ నసుగుతూ "వార్డరు బాబుగోరూ! ఈ రాతిరీ పగళ్ళెందుకొచ్చాయండీ... ఉంటే రాత్రైనా ఉండాలా నేప్పోతే పగలైనా ఉండాల" అన్నాడు నిక్కరు సరిచేసుకుంటూ.

"ఒరే, రాత్రే ఉన్నాదనుకోరా మేం నిన్ను పట్టుకోలేం. ఉట్టి పగలే ఉన్నాదనుకోరా. నువ్వు సారా అమ్ముకోలేవు. అందుకనే మా కోసం పగలు, మీ కోసం రాతిరి" దేముడుగారు తాళం వేస్తూ వెటకారంగా అన్నారు.

"నిజవేనండి బాబుగోరు సత్తెం పలికారు, మీరు సెప్పే ఇషియాలన్నీ ఈ నిక్కరీ ముండకేటి తెలుస్తాయి సెప్పండి, ఇదీ నాలాగే ఎర్రిదండి బాబు" అన్నాడు అప్పలనాయుడు పొడవాటి నిక్కరు చూయిస్తూ. ఈ మాటలు అంటుండగానే వార్డరుగారు లాఠీతో పిర్రలపై సుతారంగా దెబ్బవేయబోతె గెంతుతూ, నవ్వుతూ ఆవరణలోకి పరిగెత్తాడు. దేముడుగారు అన్ని గదుల తాళాలు తీసిన తర్వాత అందరం గబగబా వెళ్లి వార్డరుగారి టేబుల్‌ముందు చేతులుకట్టుకుని వరుసగా కూర్చున్నాం. మొత్తం ఖైదీల సంఖ్య పధ్నాలుగుకు మించదు. అందర్నీ లెక్కించిన తర్వాత దేముడుగారు ఆవరణలోకి తీసుకెళ్లారు. అందరూ వరుసలో వెళ్లాలని ఆజ్ఞాపించారు.

"ఒరే ఎర్రినాయాల్లారా, వరుసలో నడండిరా, మనం అలా నడవలేదను కోరా, ప్రెపంచికం తలకిందలైపోయి తల్లడిల్లిపోతాదిరా" అన్నాడు నాయుడు ఊడిపోతున్న నిక్కరును సరిచేసుకుంటూ. అప్పల నాయుడిది విచిత్ర వేషధారణ. అందరూ లుంగీలు కట్టుకుంటే నాయుడు మోకాళ్ళకిందకు పొడవాటి లూజు నిక్కరూ చీకిపోయిన ముదురు తెలుపు జైలు బనియనూ వేసుకుంటాడు.

"ఏటండీ, ఇదిగో పందుంపుల్ల" అంటూ చేతిలో పెట్టాడు రాజు. పుల్లనోట్లో వేసుకుని చుట్టూ పరికించాను. ఆవరణంతా పచ్చగా ఉన్నది. రకరకాల చెట్లూ, రంగు రంగుల పూవులున్నాయి. చుట్టూ ఎత్తైన, బలమైన గోడలున్నాయి. గోడలకవతల అంతస్తుల్లో కొంతమంది పళ్ళు తోముతూ తిరుగాడుతున్నారు. నవ్వుతూ, తుళ్లుతూ పనులు చేసుకుంటున్నారు. వాళ్ల ఇష్టమైనచోటికి తిరగ్గలరు, మాకా అవకాశంలేదు, అంతే తేడా. ఆవరణలోని చెట్లపై పక్షులూ, పావురాళ్లూ

స్వేచ్ఛగా ఎగురుతున్నాయి.

అటూ ఇటూ పచార్లు చేస్తున్నవాణ్ణి వార్డరుగారి అరుపు విని గాబరాగా మొహం కడుక్కుని, ప్లేటు పట్టుకుని వరుసలో నిలబడ్డాను. కొంచెం పులిహోరా పెట్టారు. అంత ఉదయాన్నే తినబుద్దికాక కొంచెం తిని, కొంచెం పారేశాను.

ఆవరణ మధ్యలో గోడలు లేని లాట్రిన్ ఉన్నది. దాన్ని చూసి జడుసుకుని రాజుదగ్గరికెళ్లి ఇక్కడేనా కూర్చోవడం అన్నాను.

"అవునండీ, అలగుంటాదండి, జైలుకదండి, ఏటో ... " అన్నాడు. అందరూ పనుల్లో నిమగ్నమై ఉన్నారు. రాజు నిశ్చింతగా దొడ్డికి కూర్చుని అందరితో మాట్లాడుతున్నాడు.

గంటలోపే లాకప్ అయ్యింది. ఈ జైల్లో రోజుకు మూడు గంటలు మాత్రమే అన్‌లాకప్. ఉదయం, తిరిగి పదకొండింటికి, మళ్లీ సాయంత్రం. ప్లేట్లూ, గ్లాసులూ మూలకుపెట్టి అందరం ఎదురుబొదురుగా కూర్చున్నాం. అప్పలనాయుడికి ఒకటే ఆరాటం రేడియో ఎపుడు పెడతారా అని. ముళ్లపై నిలబడ్డవాడిలా పచార్లు చేస్తూ వార్డరుగారి కోసం ఎదురుచూస్తున్నాడు. కాసేపటికి దేముడుగారొచ్చి రేడియో పెడితే అది ఎంతకూ పలకలేదు.

"ఒసే జయమాలీ ఎట్టవే ... ఓ... బాయ్యా... దేముడు బాయ్యా... తెరువు... బాయ్యా... తలుపూ ...ఊఁ....."
అన్నాడు అప్పల నాయుడు. కొజ్జాలా నటించి అందర్నీ నవ్విస్తుంటాడు. చిరంజీవి బొద్దుగా ఉన్నందుకు జయమాలీ అంటాడు. ఆయన మాటలకు అందరూ గొల్లుమని నవ్వేసరికి, వార్డరుగారు కోప్పడుతూ తలుపు తెరిచారు. చిరంజీవి వెళ్లి రేడియో పెట్టాడు.

"ఒసే జయమాలీ... ఎలగే ఎట్టీశావూ... బలే కిటుకు తెలుసే నీకు ..." అంటూ చిరంజీవి నడుము గిల్లుతూ ఎగతాళిగా అన్నాడు అప్పలనాయుడు.

"ఎటండీ సడిసేయకేగాలి పాటిన్నారండి, గొప్పగా ఉంటాదండి" పాతపాటని పలవరించాడు అప్పలనాయుడు.

రేడియో పాడటం ఆరంభించాక ఆయన మనసు స్తిమితపడ్డది.

"ఏసుప్రెబు గొప్పోడండీ, కరుణామయుడండీ, ఇశాల వృదయమండీ ప్రెబువుదీ" అంటూ ఏసు ప్రభు ఫోటో వెనకాల ఖైనీ ప్యాకెట్ బయటకు తీశాడు. ఉదయం టీ కాయడం, పులిహోరా వండటం, తిరిగి మధ్యాహ్నం, సాయంత్రం వంట వండటం, మిగతా సమయాలలో పాటలు పాడటం, కొజ్జాలా మాట్లాడి అందరినీ నవ్వించడం, క్యారమ్స్ ఆడటం అప్పలనాయుడు దినచర్య.

ఉదయం అన్‌లాకప్ చాయ్ తర్వాత బియ్యంలో రాళ్లేరటం అందరూ తప్పనిసరి చేయాల్సిన పని.

రాళ్లేరుతుంటే నాయుడు వచ్చి "ఒసే పెళ్లాలూ ... బేగి కానీండే ఎంతసేపే ... వంట వండాలే " అంటుంటాడు.

పాటలు వింటూ కాసేపు క్యారమ్స్ ఆడి, విసుగుతో పక్కనపెట్టారు. రాజు లుంగీ కట్టుకుంటూ "ఏటండీ, అసుకేసుకోడమేనండి, ఇంకేటున్నాది సెప్పండి" అంటుండగానే చిరంజీవి లుంగీ లాగేసరికి అందరూ ఫక్కున నవ్వారు. రాజు తాపీగా లుంగీ చుట్టుకుంటూ "సూశ్నార్రా, మా గొప్ప అదృష్టంరా బాబు" అన్నాడు.

గుంపుగా కూర్చుని బీడీలు ముట్టించుకున్నారు. అందరూ పొగ ఒకేసారి గుప్పుమని వదులుతున్నారు.
అప్పలనాయుడు మొదలుపెట్టాడు.

"బతుకు మా పెద్ద బరువండీ, నడుములిరిగే బరువుకాదండి, మనసుకాలే బరువండీ" అంటూ దు:ఖంలో కెళ్లిపోయాడు. అంతసేపూ అందరినీ నవ్వించినవాడు అట్లా అయిపోవటంతో అందరూ ఆందోళన పడ్డారు. కొండజాతాయనైతే ఏమీ అర్థంకాక అందరి ముఖాలూ చూశాడు. గారపట్టిన పళ్లు బయటపెట్టి పిచ్చినవ్వు నవ్వాడు. ఆయనకు తెలుగురాదు. కుయీ మాట్లాడతాడు. ఏంచెప్పినా, తిట్టినా నవ్వి ఊరుకుంటాడు. చప్పిడి ముక్కూ, లావాటి పెదవులతో పొట్టిగా, లావుగాఉన్నాడు. వయసు యాభైదాకా వుండొచ్చన్నాడు అప్పలనాయుడు. ఆయన గురించి ఏం చెప్పాలన్నా అప్పలనాయుడే చెప్పాలి. అప్పలనాయుడు కొండ ప్రాంతాలు తిరగటంవల్ల కొంచెం కుయీ వచ్చు.

గదికి ఎదురుగా ఉన్న పాత, నల్లటి గోడపై ఎండపొలుపు పడ్డది. చలింకా వదల్లేదు.

"ఏటండీ ఆ ఎండలో కూచొని అసుకేసుకుంటే బాగుండు కదండీ..." అన్నాడు రాజు.

ఆ ఎండలోనే రెండోమూడో పావురాళ్లు కూర్చుని గునగునమంటు న్నాయి. నాయుడు వాటివైపే చూస్తున్నాడు.

"నా పెల్లామున్నాది కదండి, దాని గురించేనండి బెంగ. ఎలాబతుకుతాదో, తింటాదో, లేదోనండి, పిల్లోడికి ఆరుగ్యం బాలేదటండి. జొరం, మూడ్రోజుల క్రితం వొచ్చినాదండీ. ఓ బీడీ కట్ట, ఓ ఆపిలూ వొట్టుకొచ్చినాదండి. ఏటిసేత్తాం సెప్పండి అల్లలగా, మనమిలగా..." అన్నాడు గట్టిగా దమ్ము పీల్చుకుని గుప్పుమని పొగవదులుతూ.

కళ్లలో నీళ్లు తుడుచుకుంటూ తిరిగి ఆరంభించాడు.

"మా అమ్మ సెప్పేదండి, ఒరే నాయుడుగో మనకేటున్నాదిరా ... కడుపున్నాదిరా, దానికి ఆకలేత్తాది. సేతులున్నాయిరా కుయ్యనకుండా కట్టం సేత్తాయి. ఈ సేతుల కట్టాన్ని ఆ కాలే కడుపుకు ఎట్టాలిరా అని. నేనదే సేత్నానండి. అలగైతే ఈ పప్పెందుకండీ. నేనేటి నేరం సెయ్యనేదండి. ఈ కడుపున్నాదికదండి. అదిగో దాన్ని కాపాడుకోవాలనుకున్నానండి. ఏడాది కిందట ఇలగే పప్పుకొచ్చీశానండి. ముసిల్దాని ప్రేనాలు పోనాయండి. ఆ శెవమక్కడా, ఈ శెవమిక్కడా, ఏటోనండి బ్రేందీ షావులున్నంత కాలం మా బతుకులింతేనండి" అన్నాడు నిట్టూరుస్తు.

"నేరంసేసే ప్రెతివోడికి సిచ్చపడతాదంటారు, మరి సిచ్చేసేవోడి సంగతేటనియా" అన్నాడు రాజు పయఖానాలో ఊస్తూ. కొండజాతాయన మాత్రం మోకాళ్ల మీద కూర్చుని అందరినీ గమనిస్తున్నాడు. ఆయనవైపు చూస్తే పళ్లికిలిస్తూ నవ్వాడు.

"ఎర్రి నాకొడుకనియా, కొండోల్లంతా ఇంతే. సంపేసినోడు ఊరికే ఉండిపోక ఆడే సెప్పేస్తాడేటి ఎర్రి నాకొడుక్కాప్పోతే" కొండజాతాయన చెంపలు పిసుకుతూ నిష్టూరంగా అన్నాడు రాజు.

అప్పలనాయుడిని అడిగాను ఈయనది ఏ ఊరని. "ఈడిది రంపసోడవరమున్నాది కదండి. అటులోపల కొండల్లోనండి" అన్నాడు కోపంగా ఆయనవైపు చూస్తూ.

ఇంతలో చాయ్‌టైమైతే వార్డరుగారు కేకేసి అప్పలనాయుణ్ణి బయటకు తీశారు. చాయ్ గిన్నెలో తీసుకొచ్చి బ్యారక్‌లు తిరుగుతూ పోస్తున్నాడు అప్పలనాయుడు. అన్ని బ్యారక్‌ల ఊచల మధ్య నుంచి గ్లాసులు పట్టుకున్న చేతులను చూస్తే గమ్మత్తుగా అనిపించింది. పక్క బ్యారక్‌లవాళ్ల చేతులు మాకు కనిపిస్తాయి. మా చేతులు వాళ్లకు కనిపిస్తాయి. కేకలేసి మాట్లాడుకోవడమే కానీ ముఖాలు చూసుకోవడానికి వీలుపడదు. ప్రతిరాత్రి రాజు పక్క బ్యారక్‌లో ఉండే బామ్మర్దితో మాట్లాడతాడు. "బామ్మర్దిగో బీడీలున్నాయేట్రా" అని.

చిరంజీవి పడుకోబోతుంటే "ఏంటి చిరంజీవి ఎప్పుడూ పడుకోవడమేనా" అంటే "అలాక్కాదనియా, జైల్లోని లెగిసున్నామనుకో బుర్రపాడనియా, తొంగున్నామనుకో అలగా రోజు గడిచిపోద్ది" అన్నాడు. చిరంజీవి టీ తాగడం పడుకోవడం, తినడం పడుకోవడం చేస్తుంటాడు. నిండా ఇరవై ఏళ్లు మించవు. ఈ మాటల మధ్యలో వార్డరుగారు తలుపుతీసి నాయుణ్ణి లోపలికి పంపించాడు.

"నాయుడు బాయ్యొచ్చాడు, నాయుడు బాయ్యొచ్చాడు" అంటూ చిరంజీవి అల్లరిపెట్టాడు.

"ఒసే జయమాలీ ఊరుకోయే గోలెట్టకూ....." అన్నాడు అప్పలనాయుడు.

"ఒంటిగంటకు టీ యేటనియా, దొంగ నంజీకొడుకులు కాప్పోతే" చాయ్‌గ్లాసు చూయిస్తూ అన్నాడు రాజు. జైలు సమయపాలనే హింస. ఉదయం ఆరింటికి భోజనం. పదకొండింటికి భోజనం. ఒంటిగంటకు చాయ్ తిరిగి సాయంత్రం ఐదింటికి భోజనం. తినలేం, వదిలేయలేం అన్నట్టుగా ఉంటుంది.

"ఒరే బీడీ ఎలిగించరా, అసుకేసుకుందాం" అన్నాడు రాజు అప్పల నాయుడు తుండులాగుతూ. బీడీ తీసి రాజుకొకటి ఇచ్చి తానొకటి నోట్లో పెట్టుకున్నాడు అప్పలనాయుడు. బీడి ఉల్టాపెట్టుకోవడంతో "ఎర్రినాయాలా ఉల్టా ఎట్టేసుకున్నావు రా" అని రాజంటే

"ఒరే ఎలగెట్టినా పాపం కాలిపోయేదే కదరా, మనలాగే, ఎర్రిముండ ప్రెస్తుతానికి దానిట్టం అలగున్నాది పోనీరా" అన్నాడు.

చిరంజీవి నిద్రలేచి "ఏట్రా గోలెట్టేస్తున్నారు, ఊరుకొండహే" అంటే

"ఒరే బొక్కిలీసు నాయాలా, నీకేట్రా తెలుస్తాది, కొటేస్తానే" గయ్యిమని అరిచాడురాజు.

యధాప్రకారంగా చిరంజీవి ముసుగేసుకున్నాడు.

నసుగుతూ అప్పలనాయుడు మొదలుపెట్టాడు.

"ఏటండీ ఏడు ఆకాశాలూ, ఏడు బూవులూ ఉంటాయంటారండి. ఏటి అక్కడా ఈ పోలీటేషన్లూ, జేల్లూ, కోర్టులూ ఉంటాయేటి, ఎవరున్నా బ్రెందీషోపులూ, జైల్లూ, కోర్టులూ, పోలీసులూ ఉండకూడదండి, మీరేటంతారేటి" అన్నాడు. జైల్లో కూర్చుని నిరంతరం బయటి ప్రపంచాన్ని చూస్తాడు, వ్యాఖ్యానిస్తాడు నాయుడు.

"ఏటండీ మీరోపని సేసేండి, ఈ బ్రేందీ సాపుల్లోల్ని సావదొబ్బిండి, కుల్లబొడిసేండి, ఒక్కసారితో పోదండీ ... ఏటి ... అలగా సంపేస్తుండాలండి, కాదంటారేటి" అన్నాడు.

నవ్వి ఊరుకున్నాను.

మళ్లీ అందుకున్నాడు. "అంతటితో అయిపోదండి. ఈ బ్రేందీ షోపులన్నీ ఎమ్మెల్యేగాల్లవండీ, నేప్పోతే ఆల బందూలవండి. ఈల్ని ముట్టుకున్నామనుకోండీ ఇటు నర్సీపట్నం, అటు సోడవరం నుంచి పోలీసులు బేగిన దిగిపోతారండి" దీర్ఘంగా ఆలోచిస్తూ మెత్త సర్దుకుని పడుకోబోతూ అన్నాడు.

సాయంత్రం ఐదింటికి అన్‌లాకప్ అయ్యింది.

ఆరేసిన బట్టలు మడతబెట్టుకుని లైన్లో నిలబడ్డాం. నా వెనకాలే రాజు, కొండజాతాయనా ఉన్నారు.

"పూలు బాగా పూసాయండి, రేపు శివరాత్రి కదండీ దండగుచ్చాలండి" అన్నాడు రాజు.

తిన్న తర్వాత పదినిమిషాలు ఆవరణలో పచార్లు చేశాం. గోడల అవతల ఏవో ఏడ్పులు వినిపించాయి. కొద్దిసేపు దాని గురించి ఆలోచించాం. కొందరు చావన్నారు, ఇంకొందరు కాదన్నారు.

"మనకేట్రా తెలుస్తాది. ఆల్లు ఏరు, మనం ఏర్రా ఎర్రినాయాల్లారా ప్రెపంచికాలు రెండురా ..." అంటూ అందరినీ గదుల్లోకి వెళ్లిపొమ్మని గట్టిగా అరిచాడు అప్పలనాయుడు. వరుసలో నిలబడి గదుల్లోకి వెళుతున్నాం. వార్డరుగారు లెక్కచూసుకుంటున్నారు. నా వెనకాల నిలబడ్డ నాయుడు చెవిలో గుసగుసగా చెప్పాడు.

"ఏటండీ సప్పర్లదెగ్గిరో, అటుపైకో ఎవర్నో కాల్చీశ్నారటండీ" అని.

రేపు పేపరొస్తే తెలుస్తుందన్నాను. వార్డరుగారు లెక్క చూసుకున్న తర్వాత గదుల్లోకెళితే తాళంవేసుకున్నారు.

ఖైదీల్ని లెక్కపెట్టుకోవడం రోజుకు ఐదుసార్లయినా ఉంటుంది. లెక్కపెడుతున్నపుడు రాజు అంటుంటాడు.

"వార్డరు బాబుగోరూ ఈ ఒకట్లూ రెండ్లూ మాకోసం పుట్టాయేటండీ" అని. ఉదయం వాయిదాకెళ్లిన బ్రెమ్మాజీ లాకప్ తర్వాత ఏడింటికి వచ్చాడు.

"బ్రెమ్మాజిగో ఎటెల్లిపోయావురా ..., వాయిదా ఏటైనాదిరా ..." అంటూ మంథలించాడు చిరంజీవి.

"ఎట్లేదురా మనూర్లోని మెజిస్ట్రేటుగోరు లేర్రా సింతపల్లి కోర్టుకి ఎలిపోన్రు. సింతపల్లి దెగ్గిరే పోలీసుల్ని సంపేశ్నారటరా, ఎస్కార్టోల్లకి ఉచ్చపడి వాయిదాకి తీసుకెల్లలేదురా, అలగా తిరిగి మద్దికాన టిఫినీ చేసి వాచ్చీశాన్రా" అన్నాడు బ్రెమ్మాజి.

రాజు, నాయుడు, బ్రెమ్మాజి ముగ్గురూ చిరంజీవినీ, కొండజాతాయన్నీ ప్రేమగా చూసుకుంటారు.

"వొరే సింరంజీవిగో బేలయినాదేట్రా" రాగానే అడిగాడు బ్రెమ్మాజి. "లేదురో మా అనియొచ్చాడు. రేపయిపోతాదన్నాడురా" అన్నాడు.

బ్రెమ్మాజి కొండజాతాయనవైపు కోపంగా చూస్తూ

"వొరే ఎర్రినాయాలా కుమ్మీసీరా పప్పు, కింటాల్లు. కింటాల్లు సూపరెంటుగోరు నీకోసమేరా తెచ్చారురా. అంతా ఉబ్బరం కదరా ఎర్రినాయాలా సుబ్బరంగా తినీసి తొంగో" అన్నాడు.

మూలకు నతికి కూర్చుని అందరివైపు చూస్తూ పళ్ళికిలిస్తున్నాడు కొండజాతాయన.

రాత్రి బాగా పొద్దుపోయింది. సమయం ఎంతవుతుందో కచ్చితంగా తెలీదు. ఆవరణలోని చెట్లపై పక్షులూ, కాకులూ అరుస్తున్నాయి. పావురాలు తిరుగాడిన గోడవైపు, నేలవైపు కనులు రిక్కించి చూశాను. ఏమీ కనిపించలేదు. ఎండపోగానే అవి మాయమవుతాయి. తిరిగి ఉదయం ఎండపొలుపెక్కగానే దర్శనమిస్తాయి.

"ఏటండీ, ఈ జేల్లని ఎవరు కనిపెట్టారండీ, ఎప్పుడు పుట్టాయేటండీ" అన్నాడు రాజు కళ్లు చీల్చుకుని గది బయటకు చూస్తూ.

"ఒరే నేరం పుట్టినాదిరా, ఎకాఎకీనా మఠాలూ పుట్టేసినాయిరా ఎదవనాయాలా..." జవాబుగా అన్నాడు అప్పలనాయుడు.

ఇంతలో సిమ్మాచెలం చిన్నగా పాడుకుంటూ వస్తున్నట్టు గమనించిన నాయుడు,

"ఒరే బాబుగోరికి టోకరా ఇచ్చీస్తాను సూడరా" అంటూ ఊచలకు తల ఆనించి నిలబడ్డాడు.

సిమ్మాచెలంగారు రేడియో పెట్టబోతుంటే "బాబుగో ఆగండి మీకో ఇసియం సెప్పాల, మనజేలు దిడ్డీలోని పూలుపూసాయటండి, ఆటి పేరేటో తెలుసండి, తర్వాచెప్పుతాలెండి. ఆ పూలున్నాయా అయా పోలీసులకు, మెజిస్ట్రేటుబాబుగోరికి మాత్రమే కనిపిస్తాయటండి. మీకూ కనిపిస్తాయేమోనండీ, ఆటిపేరేటో తెలుసండీ, కల్లబొల్లి మల్లెలటండీ, మల్లెలేకానండీ గులాబిలంతా పెద్దగా ఉంటాయటండి" నాయుడు ఈ మాటల చెబుతున్నపుడు చిరంజీవి మూలకు నతికి నవ్వును బలవంతాన ఆపుకుంటున్నాడు.

సిమ్మాచెలం గారికి విషయం అర్థమైపోయి కొంచెం కోపం కొంచెం నవ్వుతో ఊచల మధ్యనుంచి లాఠీపెట్టి నాయుణ్ణి పొడవబోయాడు. నాయుడు గట్టిగా అరుస్తూ ....

"బాబుగారు బాబుగారూ, మహాప్రెబువులు దయుంచండి. ఈ మాట నే సెప్పనేదండి ఇజీనరం సత్తిబాబుగోడు సెప్పాడండి" అంటూ వెనక్కి జరిగాడు. సిమ్మాచెలంగారికి రేడియో మాటవినలేదు "ఒరే సిరంజీవిగో" అంటూ కేకేసాడు. రాజులేచి వార్డరుగారితో మాట కలుపుతూ

"జయమాలి ఇల్లెక్కేసి ముట్టుకొట్టులో తొంగున్నాదండి, ఎలగండి పిలడం, గుంటది మా నాయుడు గోడికి మాబాగా అమిరినాదండి" రాజు మాట పూర్తి కాకముందే చిరంజీవి లేచి రాజు వీపుపై రెండు గుద్దులు గుద్దాడు. వార్డరుగారు తలుపుతెరిచి రేడియో పెట్టించి వెళ్లిపోయారు.

అప్పటికే కొండజాతాయన పడుకున్నాడు. నాయుడుకి నిద్రపట్టడంలేదని అటూఇటూ తిరుగుతున్నాడు. రాజు, బ్రెమ్మాజి నాతోబాటు కూర్చున్నారు.

బ్రెమ్మాజి వృత్తేంటో కనుక్కుందామని "బయట నువ్వేం పనిచేస్తావ్" అన్నాను. "జట్లుకట్టి సెరుకుతోటలుంటాయి కదండి. అక్కడికి పనికెలిపోతానండి. జట్లోని పదిహేను మందుంటారండి. ఎటు కిట్టితే అటేనండి. ఎక్కువగా తునివైపే కిట్టుతాదండి అన్నాడు. చెల్లెక్కడుందని అడిగితే చెప్పుకొచ్చాడు.

"దాన్దోగొప్ప బాదనియా. ఎనుపూసిరిగిపోయి మంచంలో అలగా తొంగుంటాదనియా. మా బామ్మర్దిగోడు ప్రేమించానసి పెల్లిసేసుకున్నా డనియా, అప్పటినుంచి ఒకటే బాదలు. కూలీకెల్లీవోడు, మా సెల్లీ ఆడితో పనికెల్లీది. పనిదగ్గిరే గొడవడి మేడపై నుండి తోశ్నాడనియా. దాని

బతుకలగైపోంది. ఏటిసేత్తం. ఎవరో ఆపీసరుగోల్లు (ఆయన భాషలో ఎన్.జి.వోలు) చెల్లిని తీసుకెళ్లి ఆస్టల్లో పెడతామన్నారు. ఆల్తో నేనేటన్నానంటే బాబుగోరు నా సెల్లంటే నాతోడబుట్టింది, నా దెగ్గిరే ఉండిపోతాదన్నాననియా.

అది మంచంలో ఉన్నా నా బామ్మర్దిగోడు ఇంటికొచ్చిసీ ఇబ్బంది పెట్టీవోడు. ఆయాలలగే ఒచ్చీసి దాన్ని కొట్టీస్తున్నాడనియా, నేను జట్టుకెల్లీసి అలిసిపోయి ఇంటికొస్తే ఈడి గొడవ. కర్రతీసుకుని బాదేస్తే సచ్చిపోన్డు. సంపీయాలని కొట్నేదండి. అలగా జరిగిపోన్డి. తర్వాత గొప్ప బాదనియా" అన్నాడు కళ్లు తుడుచుకుంటూ.

"ఒరే బ్రెమ్మాజిగో, బతుకలగే ఉంటాదిరా, ఏదీ సెప్పనేమురా. నువ్వైనా పప్పుతినీస్తావని అనుకున్నావేట్రా, ఏటోరా అలగా జరిగిపోన్దంతే" భుజం తట్టి ఓదారుస్తూ అన్నాడు రాజు.

అందరి దగ్గరా మాటలు అయిపోయాయి. గదంతా నిశ్శబ్దంగా ఉంది. అడుగుల చప్పుడు వినిపిస్తే బయటకు చూశాడు రాజు.

దేముడుగారు బాగా ఆలస్యంగా డ్యూటీకొచ్చారు. వచ్చీరాగానే తాళాలు కొక్కేనికి తగిలించి, గదిముందుకొచ్చి బుస్సుమని అరుస్తున్న రేడియోని కట్టేసి వెళ్ళిపోతూ లోపలికి తొంగి చూస్తూ

"ఒరే నాయుడుగో పాట్లకోసం ఇంతగోలేట్రా" అన్నారు. "దేముడు బాబుగోరూ... మనసులో సీకటుంటాదండి, పాట్లున్నాయి కదండి అలగా ఎలిగించీస్తాయండి" అన్నాడు.

దేముడుగారు వెళ్లిపోయాక మళ్లీ నిశ్శబ్దం ఆవరించింది. పక్క బ్యారకుల్లో నుంచి ఆవలింపుల శబ్దాలూ, నిదురపట్టనివాళ్లు కాల్చుతున్న బీడీ వాసనలూ తప్ప ఊసుల సడిలేదు.

వార్డరుగారి టేబిల్ వద్ద చిన్న బల్బు గుడ్డి వెలుతురు చిమ్ముతున్నది.



ఉదయం ఆరింటికి వార్డరుగారి అరుపులూ, ఊచలపై లాఠీ శబ్దాలూ వినిపించడంతో లేచి దుప్పటీ పరుచుకునేదీ మడకబెట్టి, ప్లేటూ గ్లాసుపట్టుకుని వార్డరుగారి టేబిలు దగ్గరకెళ్లి కూర్చున్నాను. నాయుడు నా వెనకాలే కూర్చుని

"దేముడుగోరూ ఈయాల మఠంలో ఉన్నోలందరికీ కోక మరియాద సేస్తరటకదండీ, ఇసాపట్నునుంచి కోకలు దిగుతున్నాయట కదండీ..." అన్నాడు కిస్సున నవ్వుతూ. దేముడుగారు కోపంగా "ఎర్రా ఎర్రినాయాలా" అంటూ ఒక్కటిచ్చాడు.

"మా అమ్మ సచ్చిపోయి ఇయాల్టికి సమచ్చరం అయిపోన్ది. అదెప్పుడూ అనేదండి. బతుకంటే బూవి ఉన్నంతకాలం బతకడవేట్రా అని. బ్రేందీ షాపులున్నంతకాలం బతుకిలగే ఉంతాది. సలసలా కాలుతా ఉంతాది. మా తమ్ముడుండీవోడండి. ఆడికి మెంటలున్నాదని అందరు అనీవోరు. నిమానాగా ఏడెంది సమచ్చరాల కిందటే ఎలిపోన్డు. ఆడు పొద్దంతా ఇంట్లోని తొంగుండేవోడనియా, సీకటి ముసరగానే బయటికెల్లీవోడు. ఒరే తమ్ముడూ సీకట్లో తిరుగుతావేట్రా బయ్యం కాదేట్రా అంటే ఆడనీవోడూ ...

ఒరే అనియా ఎలుతురంటే నాకు బయ్యంరా, సీకటున్నాదనుకోరా సిత్రమైన ఎలుగులాగా కనిపిస్తాదిరా అని.

ఆడిమాటకు అర్థం తెలిసీది కాదండి. మఠానికొచ్చామా గొప్పగా తెలిసిపోన్ది. మా తమ్ముడుగోడు ఆయాల అలగా రేతిరి బయిటికెల్లినోడు మరిక రాలేదండి" అంటూ మౌనంలోకి వెళ్లిపోయాడు.

దేముడుగారు కేకేయడంతో అప్పలనాయుడు వంటగదిలోకెళ్లిపోయాడు.

పోతూ పోతూ "ఇదిగో ఇదేనండీ సీకటి" అంటుండగానే వార్డరుగారు గద్దించడంతో పరిగెత్తిపోయాడు. శివరాత్రి కావడంతో అందరూ చకచకా పనులు చేసుకుంటున్నారు. రాజు పూవులు కోసి దిమ్మెపై పెట్టాడు. నలుగురో అయిదుగురో కలిసి బియ్యంలో రాళ్లేరుతున్నాం. రాజు కొన్ని నోట్లోపోసుకుని తుపుక్కున ఊస్తూ "ఈ బియ్యిమేటి, మనవేటి, జైలు చేయడవేటి అంతా సిత్రంగా ఉన్నాది. ఉప్పరాపల్లి సత్తిబాబుగోడని, ఇజీనరం కేడీ ఉండీవోడండి. ఆడు నర్సీపట్నం పోలీసుల్తో లాయకీగా ఉండీవోడు. ఆడిప్పుడు ఇసాపట్నం సెంట్రల్ జైల్లో ఉంట్నాడండి. మా గొప్ప బుర్రండి ఆడిది. ఆడేటనేవాడంటే "ఒసే ఎర్రప్పల్లారా కోర్టులూ, పోలీటేసన్లూ, ఎమ్మిలేలూ అంతా ఒకటేరా, అందరూ కలిసి డబ్బు దొబ్బీస్తార్రా" అనీవోడు. ఆడిమాటే నిజవండి. ఇక్కడో ఎమ్మిల్యేగోడున్నాడు. ఆడికి నర్సీపట్నంలో, సోడవరంలో, కేడీపేటలో, రంపసోడవరంలో బ్రేందీషోపులున్నాయండి. ముండల కంపెనీలూ ఉన్నాయంటారండి. ఆడిపై మడ్డరు కేసులున్నాయండి. ఆడలగా కార్లో ఎక్కిసి తిరిగేస్తాడండి. మెజిస్ట్రీటుగోరు మాత్తరం చోరీకేసుల్లో సిచ్చలు గుచ్చీడం, పప్పుకు పంపీడం ఏటోనండి అంతా గొప్పసిక్కూ, సిరాకండి" అన్నాడు.

బియ్యాన్ని తట్టకెత్తుతూ "ఎలిపోదాం, లెగండి" అన్నాడు.

వార్డరుగారు లాకప్ అని అరవడంతో బ్యారక్‌లో కెళ్లిపోయాం. వంటకోసం అన్నీ సర్ది నాయుడు కూడా వచ్చాడు. రాజు బెల్లాన్ని దేవుడి ప్రసాదంగా పంచాడు.

"ఒరే రాజుగో, నా ప్రెబువున్నాడురా ఆడు నా బాదలలగా తీర్చీస్తాడురా నీ దేవుడేట్రా సేస్తాడూ" అంటూ ఏసుప్రభు ఫోటో వైపు చూశాడు నాయుడు.

"మా పిల్లలు తుని ఆస్టల్లో ఉంటారండి. ప్రెతి ఆదోరం ఎల్లి వల్లిచ్చేవోన్నండి. ఆరు నెల్లైపోన్ది. ఆల్లేటనుకుంటారో" కళ్లలో నీళ్లు కదలాడుతుంటే అన్నాడు రాజు.

"రాజుగో ఏడవకురా, ఏడిశావనుకోరా మనసు బెంగపడిపోతాది. జైలు చేయలేంరా" అన్నాడు అప్పలనాయుడు ఓదారుస్తూ.

మధ్యాహ్నం తిన్న తర్వాత కొద్దిసేపు క్యారమ్స్ ఆడారు. సాయంత్రం లాకప్ తర్వాత ఎంత ప్రయత్నించినా రేడియో పలకలేదు. చిరంజీవి చేతులెత్తేసి బ్యారక్‌లోకొచ్చాడు.

"ఒరే ఈ రోజు ఏసుప్రెబూ కరుణించడురా, అంతా ఖాళీరా" అన్నాడు నాయుడు, ఫోటో వెనకాల ఖాళీ ఖైనీ ప్యాకెట్ విసిరేస్తూ. రోజులాగే చిరంజీవి లాకప్ తర్వాత పడుకుండిపోయాడు.

పరుపు సర్దుకుంటూ నాయుడన్నాడు " ఏటోనండీ ఎప్పుడూ ఇలగే సీకటే ఉంటాదా, ఎలుతురు పరుసుకుంటాదో లేదో తెల్దండి. మా అమ్మ సెప్పేదండి, నాయుడుగో సచ్చిపోకూడదురా, మనిషి సచ్చినా ఆత్మలగా.... భూమ్మీదో, సెట్టుమీదో తొంగుంటాదిరా అని. అది మా గొప్పగా సెప్పీదండి" అంటూ వెల్లకిలా పడుకుని కప్పువైపు చూస్తున్నాడు. కాసేపటికి బీడీ ముట్టిస్తుంటే కొండజాతాయన నవ్వుతూ చేయిచాపాడు. నాయుడు బీడీ ఇస్తూ "యీడు గొప్పోడండి" అన్నాడు.

ఇద్దరూ బీడీ కాల్చిన తర్వాత వార్డరుగారు లైట్లార్పేసారు.

"తొంగోండి, తెలవారితే చిరంజీవిగోడికి బేలయితాది. మీకూ అయిపోతాది. మీరు బయటికెల్తే ఈ బ్రేందీ సాపులోల సంగతిసూడండి" అంటూ దుప్పటి కప్పుకున్నాడు. వార్డరుగారి గురక చప్పుడూ మొదలైంది. గుడ్డిలైటు వెలుతురు గోడలపై పడుతున్నది.

బ్రమ్మాజీ నిద్రలో ఉలిక్కిపడిలేచి తూలి పడిపోయాడు. మళ్లీ లేచికూర్చుంటూ "సీతారామరాజుగోరు ఈ జేల్లోనే ఉండీవారటండీ" అంటూ మళ్లీ నిద్రలోకి జారిపోయాడు.

"కలపడి ఉంటాదిలేండి" అన్నాడు నాయుడు.

చప్పుడు విన్న వార్డరుగారు నిదుర మగతలోనే టేబిల్‌పై కొట్టాడు.

కచ్చితంగా సమయం తెలీదుకానీ మధ్య రాత్రయింది కావచ్చు.



ఉదయం లేచేసరికి వార్డరుగారు "బాబూ నీకు ఎస్కార్ట్, ఇశాపట్నం అడివివరం సెంట్రల్ జైల్" అన్నారు. గదిలోకెళ్లి ప్యాంట్ వేసుకుని, కవర్ తీసుకుని అందరికీ వెళ్లొస్తానని చెప్పిన తర్వాత టేబిల్ దగ్గిర వార్డరుగారు రెండో మూడో సంతకాలు పెట్టించుకున్నారు. సబిన్స్పెక్టరు గొలుసు పట్టుకుని తీసుకెళుతుంటే నాలుగడుగులు వేసి వెనక్కి తిరిగాను. కొండజాతాయనా, నాయుడూ, బ్రమ్మాజీ, చిరంజీవి, రాజు నావైపే చూస్తున్నారు. కొండజాతాయన పళ్లుబయటపెట్టి నవ్వుతున్నాడు. ఎస్సై మందలిస్తే బండెక్కాను.

*



❖ ఉదయమిత్ర

# బంగ్లా ప్యూన్

"మమ్మీ! మమ్మీ!"

"ఏందిరా?"

"ఎలుక ... ఎలుక..."

"ఎక్కడ్రా? జాగ్రత్త ... దూరంగా ఉండండి."

"వొచ్చె... వొచ్చె... అల్మరాకిందికి దూరె... మమ్మీ ... మమ్మీ... అల్మరా కిందినుండి బుట్టపక్కకు. అదిగో ... అదిగో పాయె... పాయె ..."

"ఎక్కడికిరా..."

'స్టోర్ రూములకి"

"జాగ్రత్త... ఒరేయ్ కరుస్తది ... అరేయ్ - రామూ ... గాడ్దికొడుకా ... ఎక్కడ జచ్చినవ్‌రా ... ఇక్కడికొచ్చిచావు"

వంటింట్లో పనిజేస్తోన్న 'రాము'కి గుండెల్లో రాయిపడ్డట్టయింది. 'ఈదిక్కుమాలిన ఎలుకకి ఎక్కడ జాగాలేక, ఈడికొచ్చి చావాల్నా?' అని మనసులోనే తిట్టుకుంటూ, జయమానురాలి దగ్గరికి ఉరుకుపరుగుల్తో వొచ్చాడు ...

"అరేయ్ ... బద్మాష్... పిలుస్తుంటే వినబడ్తలేదుర... నీకు మస్తీ ఎక్కువయిందిరా ... ఆ స్టోర్ రూములకి ఎలుకవొయ్యింది. దాని సంగతిజూడు..." అంటూ ఆర్డర్ పాస్ జేసింది యజమానురాలు.

✦ ✦ ✦

రీటామాథుర్ ఆ ఇంటియజమానురాలు... పరమ చండశాసనురాలు... ఆమె ఒకమాట అన్నదంటే, దాన్ని ఖచ్చితంగా అమలుపర్చాల్సిందే. ఆమె 'ఎలుకసంగతిచూడు' అంటే దాన్ని బయటికయినా పంపాలి లేదా చంపనయినా చంపాలి... కానీ, అది దూరిందెక్కడ -? స్టోర్ రూములో... దాన్లో ఒకలారీకి సరిపడా సామాను ఉంటుంది. అంటే, తానిపుడు ఆ సామానంతా ఖాళీజేస్తేగాని, ఆ దరిద్రపు ఎలుక దొర్కిచావదన్నమాట... తప్పదు... సామానంతాఖాళీ జెయ్యాలి. ఎలుకసంగతి జూశాక.. తిరిగి సామాను స్టోర్ రూములో పెట్టాలి. ఇదంతా అయ్యేసరికి ఒళ్లు హూనమవుతుంది.

ఎలుకనూ, యజమానురాలినీ, తన బతుకునూ, తన మనసులోనే తిట్టుకుంటూ, ఎలుకను పట్టే కార్యక్రమంలోకి దిగాడు రాము.

ఓ అయిదు గంటల తర్వాత 'కొండను తవ్వి ఎలుకను పట్టినట్టు,' స్టోర్ రూమును తవ్వి 'ఎలుకను పట్టి చంపాడు. రీటా మాథుర్ తృప్తిగా గాలిపీల్చింది.

మధ్యాహ్నం వేళ...

మేడకు గుర్రుపెట్టి నిద్రబోతోంది. ఇంటినుండి తెచ్చుకున్న కంకెడు మెతుకులు కంకి, రాముగోడనానుకొని ఆలోచించడం మొదలెట్టాడు. అప్రయత్నంగా అతని కనుకొనుకుల్లో నీళ్లునిండాయి.

చ! ఏంబతుకుతనది? కుక్కకన్నా హీనమైంది... అంతకన్నా పల్లెటూళ్లో దొంగసారా అమ్మినపుడే... బావుండేది... పొట్టకు ఎల్లినా... ఎల్లకపోయినా, ఇంత స్వేచ్ఛనయినా ఉండేది. కంటినిండా కునుకయినా ఉండేది. ఈ 'ప్యూన్' ఉద్యోగం దొర్కినాంక అన్నీ కరువయిపోయాయి. పర్మనెంటు ఉద్యోగమని మొదట ఎగిరిగంతేసినమాట నిజమే. అందరూ మెచ్చుకున్నమాట నిజమే.

కానీదిగితేగాని లోతుదెలువదన్నట్టు, ఇక్కడికొచ్చినాంక గాని దీంట్ల సుఖమేమిటో అర్థంగాలేదు. తను 'ప్యూన్' ఉద్యోగంలో స్థిరపడాలంటే, ముందుగా ఒక పెద్ద ఆఫీసర్ ఇంట్లో డ్యూటీ చెయ్యాలి. తానిపుడు 'బంగళాప్యూన్' అంటే ఆ ఆఫీసర్ ఇంట్లో మూడు, నాలుగేళ్లదాంక ఊడిగం (వెట్టి) చేయాలన్న మాట. ఆ తర్వాత తనకు 'ప్యూన్' డ్యూటీ ఆఫీసులో వేస్తారు.

తన యజమాని ఢిల్లీకి చెందిన ఓ పెద్దాఫీసరు ... జీతం సుమారు ముప్ఫయివేల దాంక ఉంటుందని అంటుంటారు.

తాను డ్యూటీల చేరిన రెండోరోజే ఓ పెద్దమనిషి తనను జాలిగ దగ్గరికి పిల్చి, 'మేడమ్'తో జాగ్రత్తగా మసలుకోవాలన్నాడు. ఆమె శాడిస్ట్ మేడమనీ, ఇంతకుముందొచ్చిన 'బంగళాప్యూన్'లను విపరీతంగా వేధించుకు తినేదనీ, కొందరు పారిపోయారనీ, కొందరికి పిచ్చెక్కిందనీ, ఒకరిద్దరు ఎదురు తిర్గితే, వాళ్లకు నరకం చూపారనీ చెప్పుకొచ్చాడు.

ఆ ఆఫీసర్ క్వార్టర్‌లలో అందరు ప్యూన్‌ల సంగతి ఇంచుమించు ఇదే. దొరలగడీల్లో వెట్టి కూలీల లాంటిదన్నమాట.

మేడమ్ గారికేకల్తో ఈ లోకంలోకి వొచ్చిపడ్డాడు రాము.

- - -

ఎప్పుడూ తలుపులు మూసి ఉండే ఆ ఇంట్లో ఏం జరుగుతోందో ఎవరికీ తెలియదు. ఆ బంగళాలో మనోడి చాకిరీ పొద్దున ఆరుగంటల నుండి రాత్రి పన్నెండు గంటల దాంక కొనసాగుతుంది. దానెంబడి యజమానురాలి తిట్లు, దండకాలు, తన్నులు కొనసాగింపుగా ఉంటాయ్.

అసలా ఇంట్లో చాకిరీకి కనీసం ఐదారుమందిగావాలి. బండెడు చాకిరీపోగుపడి 'రాము' ఒంటిని హూనంజేస్తుంది.

అసలు వొస్తూనే ఇల్లంతా డస్టింగ్ చేయాలి. మొత్తం ఆరు రూముల్ని ఫినైల్‌తో కడగాలి. యజమానురాలి బట్టలతో సహా (లోదుస్తులుకూడా) రోజా సుమారుగ ముప్ఫయి రకాల బట్టలు ఉతకాలి. ఇస్త్రీ చేయాలి. ఎయిర్ కూలర్‌లో నీళ్లుపోయాలి. లెట్రిన్ కడగాలి.

ఇక వంట గురించి ప్రత్యేకంగా చెప్పడమే మంచిది. తాను పుట్టి బుద్ధెరిగినప్పటి నుండి ఇన్ని రకాల వంటకాలుంటాయని తానెరగడు. నల్గురికి నాల్గు రకాల టిఫిన్లు చేయాలి. మధ్యాహ్నం మూడు రకాల కూరలు, పెరుగు చట్నీ చేయాలి. అన్నీ తాజాగానే ఉండాలె సుమా...

'పూహ' అనే ప్రత్యేకమైన వంటకం ఆఫీసరుగార్కి బాగా ఇష్టం. దీన్ని పచ్చికొత్తిమీరతో బండమీద నూరి తయారుజేస్తారు. ఇందులో ధనియాలు, పచ్చిమిరపకాయలు, ఉల్లిగడ్డలూ వేసి నూరిపెట్టాలి.

ఒక్కోసారి 'మేడమ్'గారు ఉదయం పదకొండు గంటలకు నిద్రలేస్తుంది. ఆ సమయానికి టిఫిన్ +అన్నం+చాయ్ తయారుజేసి రెడీగా ఉంచాలి.

ఆఫీసర్ టిఫిన్‌కోసమని ఒక డ్రైవరు, ఒక ప్యూన్ జీపులో వొస్తారు. అప్పటికి తాను 'పుల్కా'లు తయారుజేసి రెడీగ ఉంచితే, వాళ్లు తనకేసి ఓ జాలిచూపు విసిరి, అవి తీసుకపోతారు.

బజారుకు పోయి కూరగాయలు తానే దెస్తడు... అవెప్పుడూ తాజాగానూ, చౌకగానూ ఉండితీరాలె... ధరలు మండిపోతే మేడమ్ తన మీద మండిపోతుంది. తనకు బేరం చేయడం చాతగాదనీ, మందిపైసలు గాబట్టి ఉల్టా ఖర్చుబెడుతావనీ తిట్టిపోస్తది. పోనీ 'మీరొచ్చి చూడండి మేడమ్! మార్కెట్ల ధరల సంగతి...' అంటే "నేను నీకింద ప్యూన్‌నా?" అంటూ ఎదురు ప్రశ్నవేస్తుంది.

ఆమె పోరు పడలేక, తాను కొంత డబ్బుకలగలిపి, కూరగాయలను తక్కువ ధరకే తెచ్చినట్టు చెప్పి ఆ గయ్యాళిని తృప్తిపరుస్తాడు.

తనను ప్రతి విషయంలోనూ తప్పుబడ్తుంది. తిడ్తుంది.. రోజు రోజుకీ ఉద్యోగం విడిచిపెట్టాలనిపిస్తోంది.

✦ ✦ ✦

ఇంకా అయిపోలేదు సుమా... ఆఫీసరు ఇంట్లో డిన్నరయితే, తనతాడుతెగినట్లే ... ఎవరినన్నా డబ్బులిచ్చి తీసుకొచ్చి ఇద్దరు కల్సిపని జేస్తారు. వొచ్చే పెద్దసార్లకు ఒక్కోరికి ఒక్కో అభిరుచీ, అలవాటు ఉంటది. ఆయా మేడమ్‌లకీ, ఆఫీసర్‌లకీ కావాల్సిన లిస్టొకటి తయారుజేసి ఇవ్వబడ్తుంది. ఆ ప్రకారం వంటజేసి, తాజాగ రెడీగా ఉంచాలి.

ఒకవేళ వంటలో ఎవరయినా వేలెత్తి చూపితే, ఆ రోజు తనపని ఆఖరే...

ఆఫీసర్ స్నేహితుల ఇళ్ళల్లో ఫంక్షన్లు అయితే, తనను అక్కడికి పంపుతుంటారు. వెనకటికి ఊడిగంజేయడానికి ఆవుల్తోబాటు బానిసలనీ పంపుతూ ఉండేవారట రాజుల ఇళ్లకి. అట్లా ఉంది తన స్థితి.

ఆఖరికి యజమానురాలి పిల్లలకు కూడా లోకువే ... వాళ్లు పిల్లలా? కాదు... పిల్లరాక్షసులు... వాళ్ల అల్లరికి అంతే ఉండదు... వాళ్లనేమీ అనగూడదు. పట్టుకుంటే ఏడుస్తారు. విడిచిపెడితే, బయటికి పారిపోతారు. పట్టుకున్నా తప్పే. విడిచినా తప్పే.

అసలు ఇట్లాంటి పిల్ల రాక్షసులతో ఎలావేగాలో తనకెవరయినా, మంత్రం నేర్పితే బావుండు. ఎంతయినా తల్లికి దగ్గ తనయులు గదా!

✦ ✦ ✦

ఎక్కడికయినా పోదామంటే, సెలవు దొర్కదు... ఉద్యోగమొచ్చినపుడే ఊరిపిల్లను పెళ్లయితే జేసుకున్నాడుగాని, ఓ ముద్దూ ముచ్చటాలేదు. చాలాసార్లు ఇంట్లో గాని, బంధువులకిగాని ఏమన్నా అయినా వోదలరు.

ఒకసారి ఏదో విషయంలో గట్టిగా అడిగితే, సలాకీ కాల్చివాత్తింది. చెబితేనమ్మరుగాని, ఓసారి తనమీద మంచం వెల్లకితలావేసి, ఉప్పుసంచిలాంటి మేడమ్ దానిమీద కూచుంది. గంటసేపు అట్లా కూర్చునేసరికి, తాను చచ్చిపోతానేమొనన్పించింది.

రానురానూ ఆమెశాడిజానికి ఓ అంతూపొంతూ లేకుండా పోతోంది. ఆమెతన అధికారకోరల్తో తనను గాయపర్చని రోజంటూ లేదు. అసలు ఎట్లాంటి మనిషి ఎట్లా అయిపొయ్యాడుతను? ఉక్కులాంటి మనిషి దూదిపింజెలాగ అయిపోయాడు. ఇంతకుముందు "దేన్నయినా సాధించగలను". అనేతను ఇపుడు దేన్నీ సాధించలేనేమో అనే దీనస్థితికి వొచ్చాడు.

ఒక్కోసారి నిద్రపట్టదు.

ఒక్కోసారి కత్తిదీస్కొని ఆఫీసర్ని, మేడమ్నీ కనకసానరికి పారెయ్యాలన్నంత కోపం వొస్తుంది. పేదవానికోపం పెదవికి చేటుగదా!

✦ ✦ ✦

మాట్లాడితే 'ఆబ్సెంట్' వేస్తామంటారు. ఇంటికాడపనుల్లో తేడా ఉంటే, యజమానురాలు ఆఫీసర్కి ఫోన్కొడ్తుంది. ఆయన విషయమేమీ తెల్సుకోకుండా 'ఆబ్సెంట్' వేసి జీతం కోసేస్తాడు. ఈదరిద్రపు 'ఆబ్సెంట్' అనేది ఆఫీసర్లకి బ్లాక్మెయిల్ చేయడానికి గొప్ప ఆయుధమన్నమాట.

పైకి తప్పుడు రిపోర్టులు పంపించి యమయాతన పెడ్తారు.

ఇదంతా వెలుగుచూడని వ్యథ... అంతులేని కథ. వక్కనే కార్మికసంఘాలున్నా వాళ్లు చేతులెత్తేయడంతో బంగ్లాప్యూన్ల స్థితి అడుగులేని అగాధంలో పడ్డట్టయింది.

✦ ✦ ✦

ఆ రోజు

ఆఫీసర్గారంట్లో పుట్టినరోజు ఫంక్షన్ జమ్ముగనడుస్తోంది. పట్టుచీరలు, సఫారీ సూట్లు, సెల్ఫోన్లు, పోసుకోలు కబుర్లు, బూతుజోకులూ ఇల్లంతా సందడే సందడి.

వంటింట్లో రాము యాంత్రికంగా పనిజేస్తున్నాడేగాని, మనసంతా ఇంటి దగ్గరేఉంది. పొద్దున వొచ్చేటప్పుడు బిడ్డ లల్లీ (లలిత)కు బాగ సుస్తీగ ఉండింది. దాన్ని విడిచిరా బుద్దిగాలేదు. ఈ దరిద్రపు ఫంక్షన్ లేకుండే, ఉండిపోయేవాడే.

అసలు అదంటే తనకుప్రాణం.

దానికి సుస్తీ జేస్తే తనకు సుస్తీ జేసినట్లే ఉంటది. కాళ్లు చేతులు ఆడవు. అదిలేచి తిరుగాడితేనే తనకు ఉపశమనం. అసలీ లోకంలో సమస్తమైన బాధలనుండి ఉపశమన మిచ్చేది తన 'లల్లీ'యే - లోకంలో ప్రతి తండ్రీ బిడ్డలూ ఇట్లాగే ఉంటారా? ఏమో - తానైతే తను పీల్చే ప్రతిగాలిలో, చేసే ప్రతి పనిలో తన చిన్నారిని చూసుకుంటుంటాడు.

దానికి ఎట్లుందో? ఏమో?

ఈ దరిద్రపు ఫంక్షన్ తొందరగా ముగిస్తే బావుండు. జ్వరం ముదిరిందో? ఏమో? అసలే మెదడువాపు వ్యాధి గురించి అంతటా చెప్పుకుంటున్నారు.

చేయి చురుక్కున కాలడంలో ఈలోకంలో కొచ్చాడు. చెంప ఛెళ్లుమంది. 'ఒళ్లు దగ్గరబెట్టుకు పనిచేయమ'ని చెప్పి, యజమానురాజు బుల్డోజర్లా నడుచుకుంటూ వెళ్లిపోయింది.

✦ ✦ ✦

ఫోన్ 'ట్రింగ్, ట్రింగ్'మని మోగింది.

అవతల నుండి ఏం వార్త వొచ్చిందో గాని, రీటామాథుర్ విసుగ్గా ఫోన్ పెట్టేసి వెళ్లిపోయింది. సుమారుగ గంట సమయంలో ఐదారుసార్లు ఫోన్మోగింది. ఆమె అంతే విసుగులో ఫోన్ పెట్టేసింది. కొంత సేపయిన తర్వాత విసుగొచ్చి, ఫోన్ పక్కనపడేసి విసవిసానడుచుకుంటూ వెళ్లింది.

"మేడమ్!" చేతులు నల్చుకుంటూ నిల్చున్నాడు రాము.

"ఏందిరా?" విసుగ్గా యజమానురాలు.

"మేడమ్.. నా బిడ్డకు సుస్తీ జేసింది."

"అయితే?"

"ఒక ఫోన్ జేసొస్త మేడమ్".

"కుదరదు. ఇక్కడ పనంత ఎవరు జేస్తర్రా... నేను జేయాల్నా?"

"తొందరగ ఉర్కొస్తమ్మా."

"కాల్చివాతవెడుత... బద్మాష్.. నడు.. ఆ పూరీలు దీస్కరాపో"

✦ ✦ ✦

అర్ధరాత్రిదాటాక, ఆదరాబాదరాగ ఇంటికి జేరుకున్నాడు రాము. ఇంటికి తాళంవేసి ఉంది. లోపల ఎందుకో భయమేసింది. చుట్టుపక్కల వాళ్లనడిగితే, పాపకు సీరియస్ అయ్యిందనీ, దవాఖానకు దీస్కపోయారనీ చెప్పారు.

దవాఖానకు చేరుకునేసరికి, ఇంకేముంది? పాప మృత్యువు అంచుకుచేరింది. ఆక్సిజన్లు, గ్లూకోజ్లు ఎక్కిస్తున్నారు. వాతావరణం అంతా అదోలా ఉంది. అందరికీ ఏదో తెల్సి పోయినట్టే ఉంది.

మృత్యునిశ్శబ్దం !

భార్య ఓమూలన కూచొని ఏడుస్తోంది. ఎవరో ఓదారుస్తున్నారు. ఏదేదో చేస్తున్నారు. అంతా విఫలమవుతున్నట్టే ఉంది. ఓడ మునిగి పోతోందా? పాప శ్వాసవేగం పెరిగింది. అది "నాన్నా! నాన్నా!" అంటోందా? అవి చివరిక్షణాలా? డాక్టరు నడిగి చూస్తే చెప్పలేమన్నాడు. అదృష్టమన్నాడు. ఆలస్యమయిందన్నాడు. ఆయన గొంతులో ధ్వనించాల్సిందేదో ధ్వనిస్తోనే ఉంది.

గంటసేపు మృత్యువుతో పోరాడి పాప చనిపోయింది. అంతా తనకళ్లముందే జరిగిపోయింది... అయ్యో... ఇదంతా తన వల్లే జరిగిందా? తను పాప పక్కనుంటే బతికేదా?

✦ ✦ ✦

పాపను ఒళ్లోకి దీసుకొని ఆటో ఎక్కాడు రాము. శరీరంలో నిస్సత్తువ ... చల్ల చెమట లొచ్చాయి... అయిపోయింది.. తనపనే ఆఖరయ్యింది. బయట చీకటి. లోపల చీకటి. చిర్నవ్వుల వెన్నెలలొలికించే తన చిన్నారి తన ఒడిలో ముద్దలాపడి ఉంది. అదిప్పుడు ఉలకదు.. పలకదు. ముద్దుమాటలాడదు ...

గుండెల్ని పిండేసే అనుభవం ...

✦ ✦ ✦

ఇంటికి చేరుకునేసరికి, నల్గురు నాల్గు రకాలుగ అన్నారు.

"ఏంమనిషివయ్యా! ఉద్యోగం జూసుకుంటివిగాని, పిల్లనుగానక పోతివి..."

"నాకిట్లయితదని తెల్వదక్కా... ఎవ్వరూ జెప్పలే..."

"ఎందుకు చెప్పలేదూ? ఫోన్ జేసినం... నాలుగైదుసార్లు గదెవతో బద్మాష్ముండ... ఫోనెత్తింది... సంగతి చెబితే, కసురుకుని ఫోనెత్తింది. గదేంమనిషిరా? పిల్ల సీరియస్గ ఉందంటే నీకు జెప్పలేదా...?

"చెప్పలేదక్కా... గాలం... ముండ అంతే..."

"మనిషిని పంపిస్తే ... అసలు లోపలికే రానియ్యలేదంట... ఆల్లేంమనుష్యుల్రా? అల్లను గన్నోల్లు బిడ్డల్ని గన్నరా? గడ్డల్ని గన్నరా?

"అల్లంతే అక్కా... ఆఫీసర్ల ఖ్యాన్ల గురించి ఎందుకు

పట్టించుకుంటరత్తా..."

"నీపెండ్లమేమెు పల్లెటూరిపిల్లా... తోసదు... పట్నం సంగతి దానికి దెల్వదు... ఇద్దరం ముగ్గురం గల్సి పెద్ద దవాఖాన్ల జేర్పిచ్చినం... నువ్వుంటే ఏదయినా సమురుయ్యేది. పిల్ల బతికేదేమో.. ఆ పిల్ల ఎక్కడ ఉర్కుతది? ఏంజేస్తది? అప్పటికే డాక్టర్లు ఆలిస్సమయిందన్నారు. సచ్చేటప్పుడు పిల్లనిన్నే కలువరించెగదరా..."

కట్టలుదెంచుకున్న దుఃఖం...

రాము పిచ్చోడయిపోయాడు... నెత్తిగుద్దు కున్నాడు... ఎదలు గుద్దుకున్నాడు... ఎవరెంత ఓదార్చినా ఆగలేదు...

తన'లల్లి', తన తల్లి; పోతూపోతూ తన గుండెను గూడ తీసుకెళ్లింది. ఇంక తనకేం మిగిలిందీ-? ఆరాత్రి బయట మంచమేసుకుని ఒక్కడు పడుకున్నడూ. భార్య ఇంట్లో ఓచాపేసుకు పడుకునుంది.

నిద్రపట్టడంలేదు. ఏవేవో ఆలోచన్లు...

అనంత నక్షత్రాల మధ్యన నిలబడి తన 'లల్లి' తననే పిలుస్తున్నట్టుగా ఉంది. అన్నీ దాని జ్ఞాపకాలే...

ఈ మంచం మీదనే తను పడుకునుంటే, తనమెడచుట్టూ చెయ్యేసి, నిద్రబోయేది. తనురాకుంటే నిద్రపట్టేదిగాదు. రోజూ ఒక కథచెప్పక పోతే నిద్రపట్టేదే గాదు... కధ చెప్పినా కొద్దీ నెమ్మదిగా నిద్రలోకి జారుకునేది.

దాని నవ్వులు, ఏడ్పులు తనను తొల్చివేస్తున్నాయి. ఏడ్చి ఏడ్చి తలదిండు తడిసిపోయింది. ఇంట్లో భార్య స్థితీ అంతే... ఎవర్నీ ఎవరూ ఓదార్చే స్థితిలో లేరు...

నిజానికి అంతటి దుఃఖంలోనూ మేడమ్ ప్రవర్తన కలుక్కుమని కెలుకుతోంది.

తన బిడ్డ చావుకు ఆమే కారణం...

ఔను... ఆమే కారణం. పసి బిడ్డకు సీరియస్‌గ ఉంటే ఫోన్ పెట్టేస్తదా-? మనిషిని పంపిస్తే బయట్నుంచే వాపసు పంపిస్తదా? తాము పందుల్ని గంటున్నట్టు పిల్లల్ని గంటున్నామా? తాను అడగడానికి వెళితే, ఎంతక్రూరంగా ప్రవర్తించిందీ-?

ఎన్ని చిత్రహింసల్ని భరించాడు తను, ఈ ఉద్యోగం పేరుమీద-? తల్చుకుంటే తలమీద మలంకుండ పగిలినట్టుగా ఉంటది. తనను కుక్కకన్నా, బానిసకన్నా హీనంగా చూశారు... చివరకు తనబిడ్డ ప్రాణం పోవడానికి కారణమయ్యారుకూడా...

అసహ్యంగా ఉంది...

కోపంగా ఉంది...

సన్నటి బ్లేడుతో మెదడు నరాలను ఫట్ ఫట్‌మని తెంపినట్టుగా ఉంది. తన సహనం... భద్రత... ఉద్యోగం... బానిసత్వం ... అన్నీ తనకు అర్థంలేనివిగా కన్పించాయి...

✦ ✦ ✦

వారంరోజుల జ్వరంతో మంచానికి అతుక్కుపోయేడు... అతను శారీరకంగా, మానసికంగా బాగా కుంగిపోయాడు. ఎక్కడో కొండ మీద నుండి లోయలోకి విసిరేసినట్టుందతనికి. ముఖం పీక్కపోయింది. కళ్లు నీరెండిన బావుల్లాగ ఉన్నాయ్... ఎవరో నరాల్లోంచి రక్తం పూర్తిగా పిండేసినట్లుగా ఉన్నది. అన్నీ పోగొట్టుకుని ఒంటి కట్టెలాగ మిగిలాడు...

ఆ రోజు నీరసంగానే డ్యూటీలో చేరడానికి బయల్దేరాడు... ఊగుతూ నడుస్తున్నాడు... పిచ్చి పిచ్చి ఆలోచన్లు ... విపరీతమైనకోపం... అసహ్యం... ఎవరినన్నా తంతేబాగుండు... లేక తల గోడకేసి కొట్టుకుంటే బాగుండునని వింత ఆలోచన్లు...

అతను మనిషి మనిషిలోలేడు... లోపలేదో సుడిగుండం చుట్ట జుడుతోంది.

✦ ✦ ✦

జీవితంమీద విరక్తి పుట్టిన ఓ ఆకారం బంగళా తలుపుదట్టింది. మేడమ్ లోపల పనిలో ఉన్నట్టుంది.. మళ్లా తలుపుదట్టేడు... వొచ్చింది 'రాము' అనేది మేడమ్‌కు తెల్సినట్టుంది. పనివాళ్ల ఉనికిని యజమానులు ఇష్టేపసిగడ్తారు.

మేడమ్‌లగెత్తుకొచ్చింది. రావడం రావడమే తిట్లకు లంకించుకుంది.

"అరేయ్ బద్మాష్... కమీనే... కుత్తే... గిన్ని రోజులు వోతావుర... డ్యూటీజేద్దమను కున్నవా... ఇంటికి వోదమను కున్నవా?" కోపంతో ఊగిపోతోందామె...

"మేడమ్ ... నా బిడ్డ చనిపోయింది" కళ్లలోకి సూటిగా జూస్తూ మొదటిసారిగా స్థిరంగా జవాబిచ్చాడు రాము.

'అరేయ్ ... లుచ్చే... బిడ్డపేరుమీద గిన్నిరోజులు వోతావుర..." సిగ్గూశరంలేదుర..." అన్నీ దొంగెత్తులు... భాడ్‌కావులకు లేబరు బుద్దులెక్కడికి వోతయ్...? అడ్డమైన సాకులు జెప్పిపని ఎగ్గొడ్తరు... బండెడు శాకిరి చేయలేక సచ్చినం... గాడ్దికొడకా... నీకు గాకపోతే ఇంకెవర్కన్నా వెట్టేదుంటివి... అయినా నీకు కొవ్వు బాగ ఎక్కింది"

"మేడమ్ నా బిడ్డ చనిపోయి... నా దుఃఖం లనేనున్న..."

"ఆ ... ఛస్తే... అది జస్తే... దాంతోబాటే... మేమూ సావాల్నా... ఎందుకుగంటర్ర... పందుల్లాగ... కంటరు పెంటలమీద వొదిలేస్తరు... సావులంటరు... బత్కులంటరు... పన్లు ఎగ్గొడ్తరు... చెప్పుదీస్కతంతే సరి... బద్మాష్ కొడుకొల్ని."

అంతే... మేడమ్ చెంప ఛెళ్లుమంది. లోపలున్న దేదో బయటికొచ్చేసింది. చెప్పానుగదా... రాము మనిషిలో మనిషిగా లేడని...

"అరేయ్... తేరేకో ఇత్‌నా హిమ్మత్...? నీ అంతు చూస్తా... నీ చమ్డా (చర్మం) దీస్తాం... నీ ఉద్యోగం సంగతి జూస్త."

ఒక్కసారిగ పనివాడు తిరగబడేసరికి, మేడమ్‌కు కోపంతో పిచ్చిదయిపోయింది. జీవితంలో మొట్టమొదటిసారి తగిలిన ఎదురుదెబ్బ... ఊహించని మనిషి నుండి, ఊహించని విధంగా తగిలిన పెనుదెబ్బ...

"అరేయ్... మీ బాస్‌రానీ... నీ అంతుజూస్త" ఊగిపోతూ అందామె...

"థూ" అంటూ ఉమ్మేసి" బాస్‌కుగాకపోతే, ఆడి దేవుడికిజెప్పుకో" నీ బత్కుగాల... నీదొక బతుకేనావే... నువ్వొకమనిషివేనావే? నాబొక్కలర్గ దీసి, నీకు ఎట్టిజేసిన... లేసినకాడ్నుంచి పండిందాక మీకు శాకిరి జేస్తే, ఆఖరికి నా పిల్లసావు బత్కులల్ల ఉంటే... సంగతి జెప్పకపోతివి. నీకు నీ దావత్ ముఖ్యమయిందిగాని. మేము కండ్లకిందికి కాన్రాలేదా? శాకిరిగావాలె... శాకిరి... శాకిరి.... నీయమ్మ... పందులు మీరయి మమ్ముల పందులంటారె... ఛీరేస్త..."

"అరేయ్... బద్మాష్... డిస్మిస్‌జేయిస్త..."

"ఏహె...పో... డిస్మిస్‌జేయిస్తే బత్కవనుకున్నవా-? రాల్లుగొట్టిబత్కుత... దండజేసి బత్కుత... ఏమిదొర్కకపోతే అడ్కతిని బత్కుత" కాని. నీయసొంటి బద్మాష్‌ల దగ్గరుండ... థూ" అంటూ ముఖంమీద ఉమ్మేశాడు...

అప్పటికే చుట్టుపక్కల జనం ఏంజర్గుతుందోననో తమకాంపౌండ్ల దగ్గరొచ్చిచూస్తున్నారు... వాళ్లకు పని మనిషి 'రాము' కేకలు స్పష్టంగా విన్పిస్తున్నాయి.. అందరూ ముక్కున వేలేసుకున్నారు. పనిమనుషులు యజమాన్లతో గట్టిగా మాట్లాడ్డమా, అందునా బంగ్లాప్యూన్‌లు? నోహోసక్‌తా... చెడిపోయేకాలమొచ్చింది.

గేటు తలుపులు ధడేల్మని మూసి బయటకి నడిచేడతను...

అందరూ అతడివైపే చూస్తున్నారు... క్యాహువా? కుఛ్ గడ్‌బడ్‌హోగయే....

అతడి కళ్లు చింతనిప్పుల్లాగ ఉన్నాయ్...

అతడి అడుగులు ధృడంగా ఉన్నాయ్...

ఆఫీసర్ కాలనీలో "రాము" నిర్లక్ష్యంగా నడుచుకుంటూ వెళ్తున్నాడు. అతను తలవంచుకునడిచేమునుపటి మనిషికాడు.

అప్పుడే ఇంటివైపు వొస్తున్నవాళ్ల ఆఫీసరు. రామును జూసి పిలుద్దామను కున్నాడు. అతని వాలకం జూసి భయపడి కారు ముందుకుపోనిచ్చాడు.

రాము ఇపుడు అలుపెరుగని బాటసారి. యుద్ధంలో సైనికుడు. *



❖ డా. కె. సుభాషిణి

# మొగ్గలు వికసించనీ

దాదాపు గంట నుండి టీ.వీ చూసుకుంటూ ఉయ్యాల అలా వూగుతూనే వుంది అనూష. టీ.వీ చూడ్డానికి ఉయ్యాల వూగుతోందో లేక . ఊగటానికి టీ.వీ చూస్తోందో చెప్పడం కష్టం. అందులోనూ కొత్తగా తెచ్చిన క్రేన్ ఉయ్యాల అది. బ్రష్ చేసుకోవటం, తిండి తినటం... అన్నీ అందులోనే. స్కూల్ నుండి వచ్చి చాలాసేపు అయ్యింది. యిప్పుడంతా యిలా టైమ్ వేస్ట్ చేసుకొని తరువాత తను పడే టెన్షన్ నాకు కొత్తేమీ కాదు.

పరీక్ష రాసి వచ్చింది ... కాసేపు రిలాక్స్‌గా పడుకోవచ్చుకదా ! పోనీ ... నిద్ర రాక పోతే, హాయిగా ఏదైనా కథల పుస్తకం చదువుకోవచ్చు కదా ! అది మాత్రం ససేమిరా అంటుంది. టీ.వీ అయితే ఎంతసేపయినా చూస్తుంది. పుస్తకాలల్లో అయితే జోక్స్, సినిమాలకు సంబంధించినవి చదివి పక్కన పడేస్తుంది. ఇది పిల్లల కథ బాగుంది... చదువు అని పోరుపెడితే యిష్టం వుంటే చదువుతుంది లేకపోతే ...అమ్మా నువ్వు చదువు వింటాను అంటుంది... ఆలోచనలలోనే నిద్ర పట్టేసింది. మెలుకువ వచ్చేటప్పటికి సాయంకాలం ఐదయ్యింది.

కిర్రుకిర్రుమని ఉయ్యాల శబ్దం...దిగ్గున లేచి హాల్లోకి వచ్చాను. ఊగుతూ చదువుకుంటోంది అనూష .

అలా ఊగుతూ చదివితే అక్షరాలు క్లియర్‌గా కనిపిస్తాయా ? కండ్లకు స్ట్రెయిన్ అవుతుంది అని చెబితేనా ... అమ్మా మొదలు పెట్టావా ...? ఆపు నీసోది ... నీకు స్ట్రెయిన్ అయితే నాకు కూడా అవుతుందా ? ఏం కాదు ... నాకు బాగా కనిపిస్తున్నాయి అంటుంది. అనడం ఎందుకు అనిపించుకోవడం ఎందుకు... అని నిర్ణయించుకున్నంతసేపుకూడా వుండలేకపోయాను. బ్రతిమిలాడినట్టుగానే చెప్పాను. అయితే నేను వూహించిన దానికి భిన్నంగా ... దీనంగా,

"అమ్మా ప్లీజ్..." చేతులెత్తి దండం పెట్టింది.

"ఏమిటి ఈ పిల్ల ... మాట్లాడనివ్వదు ... ఏం చెప్పినా వినదు ...పైగా చేప్పేటప్పుడు చెవులు మూసుకుంటుంది. చిన్న చిన్న వాటికికూడా బాగా టెన్షన్ పడిపోతుంది. మాట్లాడిస్తే మీదపడి కరిచినంత పని చేస్తోంది. యింటికి ఎవరొచ్చినా మాట్లాడదు... అసలు కలవదు. వాళ్లే పలకరిస్తే ... ముఖంలో నవ్వు వుండదు... సంబోధన అంతకంటే వుండదు ఆ... ఊ అని బదులిస్తుంది . ఎక్కడికయినా పోయినా సరే ... ఎవరితో కలవకుండా నా వెనకాలే వుంటుంది. మాటిమాటికి టైమ్ చూసుకుంటుంది. ఎంతసేపు యిక్కడ... నాకేమి సంబంధం వీళ్లందరితో , బోర్ కొడ్తోంది ... త్వరగా పోదాం పద అంటూ విసుక్కుంటుంది. యింత చిన్న వయసులోనే అంత కోపం, విసుగు, టెన్షన్ ఎందుకు వస్తున్నట్టు...? ఏం బరువు మోస్తోంది తను ...? అందరు పిల్లలు యింతేనా ... ? ఈ మధ్య అనూష వ్యవహారం నాకు మింగుడుపడడం లేదు.

ప్రొద్దున చేసి ఫ్రిజ్జులో పెట్టిన రాగి మాల్ట్‌ను గ్లాసులో పోసి యిచ్చాను. నావైపు చూడకుండా ... చదువుకుంటూ ముఖం చిట్లించుకొని తాగింది. డిస్టర్బ్ చేశానని కోపం వచ్చిందేమో బహుశ. అదే మ్యాథ్స్ ఎగ్జామ్ అయితే నన్ను పక్కకు కదలనివ్వదు. ఆ రెండురోజులు తనకు కాదు నాకే పరీక్షలాగవుంటుంది. కాలేజికి కూడా పోనివ్వకుండా నాచేత లీవ్ పెట్టించేసింది. పెద్దగా నిట్టూర్చి బయటకి వచ్చాను. ఎండకు కుండీలల్లో మొక్కలన్నీ వడలిపోయి వున్నాయి. ప్రొద్దున ప్రభాకర్ పెద్ద చెట్లకు నీళ్లు పెట్టి వీటికి పెట్టడం మరిచిపోయినట్టున్నాడు.

భూమిలో నీళ్లు పడినప్పుడు వచ్చే మట్టివాసన అంటే అనూషకు బాగా యిష్టం. వాసనకు బయటకి వచ్చి ... గుండెల నిండా గాలి పీల్చుకొని నిమిషం పాటు అస్వాదించింది. అంతే ... ఏదో గుర్తుకువచ్చినట్టుగా [illegible] తిరిగి గబగబ యింట్లోకి వెళ్లిపోయింది.

అనూష చేత చెట్లకు నీళ్లు పెట్టించాలని ఎన్నోసార్లు ప్రయత్నించాను. చెవిలోకి కూడ వేసుకోదు. యింట్లో వున్నంతసేపు రెండే పనులు అనూషకు. ఒకటి టీ.వీ చూడ్డం... రెండవది చదువుకోవడం లేదా రాసుకోవటం. ఇంక వేరే వ్యాపకం అంటూ ఏమిలేదు.

ముఖం కడుక్కుందామని బాత్‌రూమ్ వైపు వెళ్తున్న నాకు "అమ్మా...మై గుడ్‌నెస్..." అంటూ అనూష అరిచిన అరుపుకు గుండెలు అదిరిపోయాయి.

"అమ్మా...యింతవరకు నేను ఫిజిక్సే చదువుతున్నాను... అది యింకా అయిపోలేదు. కెమిస్ట్రీ ఎప్పుడు చదవాల ? ఎంత సిలబస్ వుందో తెలుసా..." అనూష ముఖం ఎర్రబడింది. పెదవులు ముక్కుపుటాలు అదురుతున్నాయి. కన్నీళ్ళు దూకడానికి సిద్ధంగా వున్నాయి.

ఓదార్చాలో, తిట్టాలో కొద్దిసేపు నాకు అర్థం కాలేదు.

"చేతులు కాలాక ఆకులు ముట్టుకుంటే ఏం లాభం నాన్నా... మధ్యాహ్నం నుండి ఎంత టైమ్ వేస్ట్ చేసుకున్నావో తెలుసా నీకు ... యిప్పుడు ఏడ్చి టెన్షన్ పడితే ఏమన్నా అర్థముందా చెప్పు ... సర్లే యిప్పుడవన్నీ ఎందుకు గాని అయిపోయిందేదో అయిపోయింది. ముందు నేర్చుకున్నవి రివైజ్ చేసుకో. కొత్తవి పొరబాటున కూడా ముట్టొద్దు... నీకు వచ్చినవి రాయి. మార్కులు ఎన్నన్నా రాని. కొంపలు మునిగేదేమీ లేదు..."

✦ ✦ ✦

దోశపిండి మిక్సికి వేస్తున్నాను. చెమటకు జాకెట్టు తడిచి ముద్దయి పోతుంది. అనూష మెల్లిగా వచ్చి నా పక్కన నిలబడింది.

" ఇక్కడ నేను వుక్కతో చస్తుంటే ... మళ్లీ నువ్వుకూడా వస్తివి... ఏం కావాలి నీకు... "

ఆ... ఊ అంటూ కొద్దిసేపునసిగింది.

"అమ్మా నెక్ట్స్ ఇయర్ నేను స్కూల్ మారుతాను..." అసలు విషయం చెప్పింది. మిక్సివేయడం ఆపేశాను.

" ఏ ...ఎందుకని..."

"ఏమో... నాకు నచ్చడం లేదు..."

"ఏం నచ్చలేదు? యిన్నేండ్ల తర్వాత అనాల్సిన మాటేనా? యింక రెండేండ్లు వుంటే అయిపోతుంది... అంతో యింతో మీ స్కూలే మేలు... వర్షాలకు, ఎండలకు బూట్లు వేసుకోకుండా పోయినా కూడా ఏమీ అనరు. పైగా పెద్ద గ్రౌండ్ - గేమ్స్ బాగా ఆడిస్తారు. పిల్లల్ని టోర్నమెంట్స్‌కు తీసుకెళ్తారు. అందు వల్లనే కదా నువ్వు కూడా బాస్కెట్ బాల్ ప్లేయర్ కాగలిగావు. గేమ్స్ పిరియడ్స్ వుంటాయి".

"అమ్మా ఆపుతావా నీ ఉపన్యాసం ..."

నేను మాట్లాడితే ఉపన్యాసం లాగుంటుందని అనూష ఎప్పుడు నన్ను ఎగతాళి చేస్తూ వుంటుంది.

"గేమ్స్ పిరియడ్స్‌లో మమ్మల్ని గేమ్స్ ఆడుకోనిస్తున్నారనే నువ్వు యింకా అనుకుంటున్నావా..."

"ఆడుకోనివ్వక ఏం చేస్తారు..."

"మ్యాథ్స్, సైన్స్ క్లాసులు తీసుకుంటారు..." వ్యంగ్యంగా దీర్ఘం తీసింది అనూష "

"అదేంటి ...! అయినా మీరు వద్దని చెప్పొచ్చుకదా ..."

"ఆ ... చెప్తాం పాపం ... ఆటల మీద వున్న ధ్యాస చదువుమీద లేదని మా మూతి పళ్లు రాలగొడ్తారు. సిక్స్త్ క్లాసు వరకు నడుస్తాయి గేమ్స్ పిరియడ్స్. సెవెన్త్, టెన్త్ వాళ్లకు అసలు ఏం వుండవు. ఎయిత్, నైన్త్ వాళ్లకు టోర్నమెంట్స్ అప్పుడు మాత్రం ఆడిస్తారు. క్లాసెస్ మిస్ అవుతామని మా వాళ్ళు చాలా మంది పార్టిసిపేట్ చెయ్యరు..."

నా మనసు బాధగా మూలిగింది.

"మరి మీకు ఆడుకోవాలని అనిపించదా నాన్నా..."

"ఆడుకోవాలని ఎవరికుండదమ్మా ... కాని ఏం చేస్తాం ... తప్పదు..." ఆ చూపు గొంతులో నిరాశ.

నాలో వున్న అనుమానం యింకొంచెం బలపడింది. అప్పుడప్పుడే

మెచ్యూర్ అవుతున్న ఆడపిల్లలు వీళ్లు... పిరియడ్స్, అప్పుడు వచ్చే కడుపునొప్పి, అనీజీనెస్ వలన వీళ్లు ఆటలకు దూరం లవుతున్నారని నా అనుమానం. అనూష కూడా కడుపు నొప్పని ఏడుస్తుంది. కాని... స్కూల్ మాత్రం ఎగరగొట్టదు. క్లాసులు పోతాయని భయం. నా అనుమానం బయటపెట్టలేక...

"అబ్బాయిల పరిస్థితి ఏంటి...?" మెల్లిగా అడిగారు.

"మా డి-సెక్షన్ గర్ల్స్, బాయ్స్ ఎవ్వరిని కూడా గేమ్స్‌కు పంపరు. ఏ,బి,సి సెక్షన్ వాళ్లు లీజర్ పిరియడ్స్‌లో ఆడుకుంటారు. మేమయితే ఏదైనా యిన్ కంప్లీట్ వర్క్ వుంటే చేసుకుంటాం..." ఎవరి మీదో తెలియనికసి అనూష గొంతులో వినిపించింది.

అనూషకు ఆటలంటే మహా పిచ్చి. తిండి, నీళ్లు, నిద్ర అని అనుకోకుండా ఎంతసేపైనా ఆడుకునేది. హు...అది ఒకప్పటి మాట. సిక్స్త్ క్లాసు వరకు విపరీతంగా ఆటలాడిన పిల్ల ... ఎయిత్ క్లాసులో బాస్కెట్ బాల్ ప్రాక్టీసు చేయడానికి ఏ మాత్రం యింట్రస్ట్ చూపలేదు. నేను ఎంతగానో నచ్చచెప్పేసరికి బలవంతంగా వొప్పుకుంది. ఇంటి దగ్గర కూడ అంతే... ఎప్పుడైనా పక్కింటి పిల్లలు వచ్చి... అక్కా ఆడుకుందాం...వస్తావా అని అడిగితే...అమ్మో!నేను రాను మ్యాథ్స్ హోమ్ వర్క్ వుంది, చేసుకోవాలి అంటుంది. ఆ ధ్యాస నుంచి డైవర్ట్ చేద్దాం అని నేనే... ఎంత సేపు టీ.వీలు, చదువేనా... కాసేపు ఆడుకోపో అని బలవంతంగా పంపిస్తుంటాను. వెళ్లి వచ్చాక టైమంతా వేస్ట్ అయ్యిందని... ప్రాబ్లమ్స్ పెండింగ్ పడిపోయావని అనూషపడే టెన్షన్ వర్ణనాతీతం... ఎందుకిలా ..? ఎప్పటి నుండి ...? సెవెన్త్ క్లాసుకు వచ్చేసరికి ఆటలన్నీ బంద్. అప్పటి నుండి మార్కులు, పర్సంటేజిలు, ర్యాంకులు తప్పితే వేరే ప్రపంచం లేకుండా అయిపోయింది. అన్ని స్కూల్స్ లోనూ అదే పరిస్థితి. ఈ స్కూల్‌ను కాదనుకొని అనూష వేరే స్కూల్‌కు ఎందుకు మారాలనుకుంటోందో నా ఊహకు అందలేదు.

"యింతకు ఏ స్కూల్‌కు మారాలనుకుంటున్నావ్...!"

"నర్సిరెడ్డి టాలెంట్ స్కూల్..." మెల్లిగా గొణిగింది.

"ఆహా... ఏం చెప్తివమ్మా...పొద్దున ఏడున్నర నుండి రాత్రి ఎనిమిదింటి వరకు స్కూల్లోనే వుంటానంటావ్ ? అంత అవసరమా చెప్పు ! ఒక ఆటలేదు...పాటలేదు...చూడు ఎలాంటి నరకాన్ని కోరుకుంటున్నావో ?. అనవసరమైన విషయాలు పక్కన పెట్టి ప్రశాంతంగా చదువుకో...మళ్లీ అన్నీ చదువుకోలేదని ఏడుస్తావ్..." ఇక నీ మాటలు వినదల్చుకోలేదు అన్నట్టుగా మిక్సీ తిరిగి ఆన్‌చేశాను.



"ఏంటి సంతాపం ప్రకటిస్తున్న వాళ్లమాదిరిగా నువ్వు, మీ అమ్మ యిద్దరు అలా మౌనంగా తింటున్నారు..."

భోంచేసేటప్పుడు...అనూష వాళ్ల నాన్న దగ్గర ప్రొద్దుననుండి సాయంకాలం వరకు జరిగిన విషయాలన్నీ రివ్యూ చేస్తుంటుంది. అన్నం నోట్లో పెట్టుకోకుండా గలగల వాగే అనూష అంతమౌనంగా వుండడం ప్రభాకర్‌కు ఆశ్చర్యంగా వుంది.

"ఏం నాయనా అట్లున్నావ్ ! ఏమయ్యింది ? ఎగ్జామ్ బాగా రాయలేదా ? లేక పోతే అమ్మ ఏమన్నా అరిచిందా ?..."

వాళ్ల నాన్న అలా అనునయంగా మాట్లాడేసరికి అనూషకు లోపల ఎక్కడో వున్న దుఃఖం పొంగుకొచ్చింది. పెదవి కొరుక్కుంటూ ఏం లేదన్నట్టు తల అడ్డంగా వూపింది. ఎక్కడ ఏడుస్తుందో అని భయపడి నేనే విషయం చెప్పేశాను. అంతా విని ప్రభాకర్ నవ్వేశాడు.

"ఫిజికల్ సైన్స్ ఎగ్జామ్‌కు భయపడి, స్కూల్ మారతానంటావా పిచ్చితల్లి! అక్కడ వుండదా ఈ సబ్జెక్ట్. ఎక్కడైనా యిదే తరహా టీచింగే వుంటుంది. వడ్డించడం...మింగించడం...అవసరమున్నప్పుడు కక్కించడం...అంతే. నమిలి జీర్ణం చేసుకొని రక్తంలో యింకించుకునే పద్ధతే లేదు. పళ్లూడగొట్టుకోడానికి ఏ రాయి అయితే నేమి ? మీ వాళ్లు నొప్పితెలియకుండా అనెస్తీషియా యిచ్చి తాలగొడలేరు..." దుఃఖంలోనే ఫక్కుమని నవ్వింది అనూష.

నవ్వించుకుంటూ మనుషుల్ని కన్విన్స్ చేయడంలో ప్రభాకర్ దిట్ట. నాలాగ సీరియస్‌గా వుండడు. సీరియస్‌గా బిగుసుకొని వుంటే ఏం సాధిస్తామోయ్ అంటాడు. అనూష ముఖంలో నవ్వు చూసి ప్రభాకర్ "అమ్మయ్య" అనుకున్నాడు. "చెప్పు నాన్నా... ఎందుకు స్కూల్ మారాలనుకుంటున్నావ్. నాకు కూడా తెలియాలి కదా !..." లాలనగా అడిగాడు.

"అదికాదు నాన్నా... యిప్పుడీ స్కూల్లో డి-సెక్షన్‌లో వున్నాను కదా ! ఈ సారి ఎగ్జామ్స్ బాగా రాయలేదు. సెక్షన్ మార్చేస్తారేమోనని భయం ..."

"అయితే..." ప్రభాకర్‌కు అర్థం కావడం లేదు.

"నేను డల్లర్ అనే కదా వాళ్ల వుద్దేశం ..." కళ్లల్లోనుండి నీళ్లు టపటప రాలాయి. నేనూ, ప్రభాకర్ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నాం. నాకు బుర్రలో ఫ్లాష్ వెలిగింది.

"అయితే యిందుకా అనూషా! నువ్వు స్కూల్ మారాలనుకున్నది..." సూటిగా అడిగాను.

"ఊ..." ముక్కుతో పలికింది.

ప్రభాకర్ అర్థం కానట్టు నా వైపే చూస్తున్నాడు.

"స్కూల్ మారాలనుకోవడానికి సెక్షన్స్ మారడానికి ఏమిటి సంబంధం... మోకాలికి బోడిగుండుకు ముడివేసినట్టుంది వ్యవహారం".. ప్రభాకర్ గొంతులో కొద్దిగా విసుగు. అంతలోనే తన మామూలు ధోరణిలోకి వచ్చాడు.

"డి- సెక్షన్ నుండి మారితే డల్లర్ అని అనడమేమిటమ్మా! పిచ్చివాళ్ళ ప్రేలాపన కాకపోతే ... నువ్వు అంతగా ఏడ్చేంత సీన్ ఏముందో నాకయితే అర్థం కావడం లేదు..."

" వాళ్ళ స్కూల్లో చానా సీన్ వుంది బాబు... డి- సెక్షన్ అంటే డైమండ్స్, సి-సెక్షన్ అంటే క్లవర్స్, బి-సెక్షన్ అంటే బెటర్, ఏ - సెక్షన్ అంటే యావరేజ్ అని వీళ్ళ కోడ్. ఎయిటిఫైవ్ పర్సెంట్‌పైన వచ్చిన వాళ్ళను డి-సెక్షన్‌లో వేస్తారు. ఈ సెక్షన్ పిల్లలు చాలా యింటలిజెంట్స్ అని అందరికి తెగ ఫీలింగ్. మిగతా సెక్షన్ పిల్లలను డల్లర్స్ అని ఏడిపిస్తారంట. ఒకసారి పేరెంట్స్ మీటింగ్‌లో ఈ విషయం మీదే... ఒకావిడ స్కూల్ మేనేజ్‌మెంట్‌ను దులిపిపారేసింది. వాళ్ళ పాప స్కూల్‌కు పోనని డి-సెక్షన్‌లో వేస్తేనే పోతాను అని ఒకటే ఏడుపంట. అపుడు నేను అంత సీరియస్‌గా తీసుకోలేదు. ఇప్పుడు ఆమె ఎందుకంత ఆవేశానికి గురయ్యిందో నాకు అర్థమవుతోంది. ప్రస్తుతం మన పరిస్థితి కూడా ఆమె లాంటిదే"... అందరిని యింత హింస పెడ్తున్న స్కూల్ మేనేజ్‌మెంట్ మీద పీక పిసకాలన్నంత కోపం వచ్చింది. పైగా సిగ్గులేకుండా ఎంత బాగా సమర్థించుకున్నారో. ఆరోజు...

"ఏమ్మా ... అమ్మ చెప్పేది నిజమేనా?" ప్రభాకర్ నమ్మలేకపోతున్నాడు. ముఖంలో నవ్వు మాయమయ్యింది.

"ఊ..."

"బాగుందమ్మా... ఈ ఏబిసిడిల వర్గీకరణ, బుద్ధిలేకపోతే సరి! సెక్షన్ ఏదయితే ఏమి? ఏం చెప్తున్నారు... ఎలా చెప్తున్నారు...? మనం ఏం నేర్చుకుంటున్నాం అన్నది ముఖ్యమా లేక డి-సెక్షన్‌లో వుండడం ముఖ్యమా చెప్పు... అనూష సమాధానం కోసం చూశాడు. అయితే నేను అనూషను మాట్లాడనివ్వకుండా

"ఆ రేంజ్‌లో మార్కులు తెచ్చుకోవాలి అని రాత్రింబగళ్ళు చదవడానికి ప్రయత్నం. చేతకాకపోతే టెన్షన్‌తో తల్లిదండ్రుల మీద ఎగరడం... మళ్ళీ మేము ఏడ్చి మొత్తుకోవడం... ఏమిటి యిదంతా ... ప్రశాంతంగా, యిష్టంగా చదువుకోవాలిగాని... యిలా సెక్షన్స్ కోసం చదవడం ఏమిటి? " కోపగించు కోవడం వలన లాభం లేదని మెత్తగా చెప్పాను.

ప్రభాకర్ నా మాటలు వింటున్నట్టుగా లేడు. ఏదో ఆలోచిస్తున్నాడు. చేతులు ముఖం దగ్గర పెట్టి సరదాగా పైకి కిందకు వూపాను. నవ్వుతూ నా చేతులు పక్కకు తోసేశాడు. " యిలా డివిజన్స్ చేయడం వలన స్కూల్ మేనేజ్‌మెంట్‌కు ఏం లాభం... పేరెంట్స్ అప్జెక్ట్ చెయ్యరా? ఇవన్నీ వదిలేయ్... డి-సెక్షన్ కాకుండా వేరే సెక్షన్‌లో కూర్చోడం వలన పర్సనల్‌గా నీకు నష్టం అయ్యేది ఏమన్నా వుందంటావా తల్లీ..."

"యిందాకా చెప్పాను కదా! మళ్ళీ ఆ పిల్లను అడుగుతున్నావ్... ఏం చెప్తుంది.. మొద్దు అని ఏడిపిస్తారు నాన్న అని చెప్తుందా..." నా చిరాకును ప్రభాకర్

పట్టించుకోలేదు.

"నువ్వుండు... అది కాదులే... యింకా ఏదో వుంటుంది. తను చెప్తుందిలే..." అనూషవైపు చూస్తూ "చెప్పరా" అన్నాడు. "నీ కొక సంగతి తెలుసా నాన్న... డి- సెక్షన్ వాళ్ళకు స్పెషల్‌గా ఐ.ఐ.టి ఫౌండేషన్ క్లాసెస్ వుంటాయి... ఇప్పుడన్నా అర్థమయ్యిందా నా బాధ ఏంటో" కోపంగా ముఖం పక్కకు తిప్పుకుంది.

"ఎయిత్ క్లాస్ నుండే ఐఐటి కోచింగ్ ఏంటమ్మా..."?

"మరి క్రీమ్ సెక్షన్ అంటే కొంచెం స్పెషల్ వుండాలి కదా నాన్న... పైగా దాన్నుండి సబ్జెక్ట్ మీద గ్రిప్ వస్తుంది. చాలా టాపిక్స్ ముందే చెప్తారు..." నవ్వొచ్చింది నాకు.

పరీక్షల కంటే ముందు ఒకసారి ... అనూష 'లాగరిధమ్స్'లో పెద్ద పెద్ద ప్రాబ్లమ్స్ తీసికొచ్చి... ఆన్సర్స్ రావటం లేదు... చెప్పమని నా ముందు పెట్టింది. ఫార్ములాస్ అయితే గడగడ చెప్పేసింది. "లాగ్" డెఫినేషన్ అడిగితే తెల్లముఖం వేసుకుని, నీళ్ళు నములుతూ, ఇవి ఎయిత్ క్లాస్ సిలబస్‌లో లేవు... ఐఐటి ప్రాబ్లమ్స్ అని చెప్పింది. అప్పుడు తెలిసింది నాకు ఈ ఐఐటి ఫౌండేషన్ క్లాసులలో ఎయిత్ వాళ్ళకు టెన్త్ సిలబస్... నైన్త్‌లో యింటర్ సిలబస్ చెప్తారని. రెండేండ్ల తర్వాత చదవాల్సిన వాటిని ఆ క్లాసు సబ్జెక్ట్స్‌తో పాటు చదవాలంటే మాటలా? అసలు అంత కొంపలు మునిగిపోయేంత అవసరం ఏ మొచ్చింది..." అదే అనూషను అడిగాను. "ఏమో మరి...? మా స్కూల్ వాళ్ళు అయితే అవసరం అంటారు. ఎందుకంటే ... ఇప్పటి నుండి చదివితే తప్ప 'ఐఐటి'లో 'ఏఐట్రిపుల్‌ఈ' లో సీటు రాదంట. హాటిల్లో చదివిన వాళ్ళకు శాలరీస్ చాలా ఎక్కువంట... యియర్‌కు హాఫ్ క్రోర్ పైనే వుంటుందంట. మా టీచర్స్ చెప్పారు..."

వింటున్న ప్రభాకర్‌కు పొర పోయింది. నేనయితే తలకొట్టుకున్నాను. మెల్లిగా పొడి దగ్గును కంట్రోల్ చేసుకున్నాడు ప్రభాకర్.

"సో... ఈ ఫౌండేషన్ క్లాసెస్ కోసం మీకు ఎక్స్‌ట్రా పీరియడ్స్ తీసుకుంటారన్నమాట..."

"కొన్ని ఎక్స్‌ట్రా పీరియడ్స్‌లు వుంటాయి. కొన్ని రెగ్యులర్‌టైం టేబుల్‌లోనే వుంటాయి... ఆ నాన్న... నైన్త్‌లో అయితే, నైన్త్ సిలబస్ కంటే ఐఐటి సిలబస్, టెన్త్ సిలబస్ ఎక్కువ చెప్తారు... నైన్త్‌వి ఏవో కొన్ని టాపిక్స్ చెప్పి వదిలేస్తారు..." "బుద్ధిలేకపోతేసరి... సర్లే ఈ విషయం పక్కన పెట్టు, మీకు ఐఐటి క్లాసెస్ వుంటే... ఏ, బి,సి వాళ్ళకు ఏ క్లాసెస్ వుంటాయి?

ఫ్రీగా వుంటారా...?"

" ఆ...పాపం... అంత సీన్ లేదు. మ్యాథ్స్, సైన్స్‌లో రివిజన్ క్లాసెస్, ఎగ్జామ్స్ వుంటాయి... మంచి పర్సంటేజి వస్తే డి - సెక్షనుకి మారుస్తారు... నాన్నా! అలా డి-సెక్షన్‌లోకి వచ్చిన వాళ్ళ ఆనందం చూడాలి ... అబ్బో పట్టలేం వాళ్ళని... పొంగిపోయి తెగ ఫీలయిపోతుంటారు.. అదే మా సెక్షన్ నుండి వెళ్ళిపోయే వాళ్ళు మాత్రం ఎట్లా ఏడుస్తారంటే... చూడలేం... అట్లా ఏడుస్తారు..."

వినడానికి కూడా ఇబ్బందిగా వుంది నాకు.

"డి-సెక్షన్ వాళ్ళేమో అదే సెక్షన్‌లో వుండడానికి పోరాటం... మిగతా సెక్షన్ వాళ్ళు డి-సెక్షన్‌లోకి రావటానికి పోరాటం... ఎంత స్ట్రగుల్ ఫేస్ చేస్తున్నారు పిల్లలు... దీన్నుంచి ఎన్ని వదులుకోవాల్సి వస్తుంది. పిల్లలతో పాటు తల్లిదండ్రులు... మొన్నటికి మొన్న అనూష వాళ్ళ అత్తవాళ్ళ గృహప్రవేశానికి గినుగిమ అంటే రాకపాయ కదా! పెండ్లిండ్లకు పోవడం బంద్... బంధువుల రాకపోకలు బంద్... ఆటలు బంద్... అన్నీ బంద్... ఒకటే దృష్టి... మొదట డి-సెక్షన్‌లో వుండాలి... అక్కడ నుంచి ఐఐటిలో పాగా వేయాలి... కోట్లు సంపాదించాలి.. పదమూడేళ్ళ పిల్లకు కోట్లు సంపాదించాలనే ఆలోచన ఎందుకు వస్తోంది...! ఆడుతూ,పాడుతూ చదువుకోకుండా డబ్బుల మీద ధ్యాస ఎందుకు పోతుంది...? దీనికంతా కారణం స్కూల్సే.. వాటి మధ్య వున్న పోటీయే యింత పని చేస్తోంది. ఒకరిని చూసుకొని ఒకరు... దీనికి తోడు తల్లిదండ్రుల పోరు. రోజుకు పదహారు గంటలు స్కూల్లోనే పిల్లలు వుండాలి అని అనుకునే తల్లిదండ్రుల సంఖ్య కూడా తక్కువేమీ లేదు. బలయిపోతున్నది మాత్రం పిల్లలే... అనూషకు ఎలా చెప్పాలి...? కేవలం మాటలతో అయ్యేట్టుగా లేదు... యింతకు ప్రభాకర్ ఏమనుకుంటున్నాడో... కళ్ళెత్తి ప్రభాకర్ వైపు చూశాను.

చేతులు కట్టుకుని నేలవైపు చూస్తూ తీక్షణంగా ఆలోచిస్తున్నాడు. ప్రభాకర్ యిప్పట్లో నోరు విప్పడు. మెల్లిగా లేచి గిన్నెలు సర్దిపెట్టాను.

కిర్రుకిర్రుమని ఉయ్యాల శబ్దం... అనూష చేతిలో పుస్తకం... పెదవులు వేగంగా కదులుతున్నాయి. దీర్ఘంగా నిట్టూర్చాను. "అనూషను అలా వదిలేస్తే మనిషిగా మిగులుతుందా...? పెద్దయ్యాక బాల్యాన్ని తిట్టుకోకుండా యిష్టంగా గుర్తుచేసుకునే పరిస్థితి వుంటుందా...? రేపు తన పిల్లలతో మేం స్కూల్లో ఈ ఆటలు ఆడించిమి... ఇంటి దగ్గర ఫలానా ఆటలు ఆడింటిమి... కథలు చెప్పుకుంటుంటిమి అని చెప్పుకోవడానికి ఏముంటుంది. భవిష్యత్తులో పిల్లలకు ఆటలు, కథలు అనేవి మిగులుతాయా. భయంతో కూడిన అనుమానం మొదలయ్యింది నాకు. " అనూషా.. పది దాటింది. నాన్న దోమతెరకట్టారు. వెళ్ళి పడుకోపో".

" లేదమ్మా... అంతా అయిపోయే వరకు పడుకోను. పొద్దున లేచి మళ్ళీ ఒక్కసారి రివైజ్ చేసుకుంటాను"..

జాలిగా చూశాను అనూష వైపు.

✦ ✦ ✦

" ఏం చేద్దామంటావ్..." వెల్లకిలా పడుకొని తిరుగుతున్న సీలింగ్ ఫ్యాను చూస్తున్నాడు ప్రభాకర్.

పక్కరూమ్‌లో అనూష నిద్రపోతుంది. నాకయితే కనురెప్ప మూతపడటం లేదు. మనసంతా అలజడే...

"ఏదో ఒకటి చెయ్యకపోతే మాత్రం లాభం లేదు. స్కూల్స్ తెరిచేలోపు ఆ మాయనుంచి బయట పడేటట్టు చూడాలి"

"పోనీ... తను కోరుకుంటున్నట్టు స్కూల్ మారుద్దామా? ఏదైనా సాదా సీదా స్కూల్లో వేస్తే బాగుంటుంది..."

"బానే వుంటుంది... అయితే ఈ స్కూల్ కంటే యింకొంచెం కార్పోరేట్ స్కూల్‌కు పోవాలని ఆ పిల్ల అనుకుంటుంటే... నువ్వు తీస్కపోయి సాదాసీదా స్కూల్లో వేస్తాను అంటే వింటుందనే అనుకుంటున్నావా? అయినా ఏముంది అక్కడ? సరి అయిన క్లాస్ రూమ్స్ వుండవు. తగినంత మంది టీచర్స్ వుండరు. లైబ్రరినా? గ్రౌండా...? గ్రౌండ్ ఉన్నా డ్రిల్ టీచర్స్ వుంటున్నారా? బాత్‌రూమ్స్ వుండవు... నీళ్ళు అసలే వుండవు...

" అట్లా అని పాపను ఆ విధ్వంసంలోకి నెట్టేయ్యాల్సిందేనా..."

"నెట్టేయకూడదనే కదా ఈ తాపత్రయమంతా? స్కూల్ వాతావరణాన్ని మనం ఏం చేయలేము... కనీసం యింట్లో అయినా అదే వాతావరణాన్ని సృష్టించకుండా చూసుకుందాం.."

"మరి యింట్లో ఏం సృష్టించాలి"?

"పుస్తకాలను పరిచయం చేయాలి. క్లాసు పుస్తకాలే కాదు ప్రపంచంలో చదవాల్సిన పుస్తకాలు చాలా వున్నాయి అని చెప్పాలి..."

"భలేదానివే... చెప్పడం లేదా... ఏకంగా వాల్యూమ్స్ వాల్యూమ్స్ పుస్తకాలు కొని తెస్తామే... ఒక్కటన్నా పూర్తిగా చదువుతుందా?

బొమ్మలు చూసి పక్కన పడేయ్యడం తప్పితే..."

"అదే ప్రభాకర్! నేను చెప్పాలనుకుంటున్నది. ఇక నుండి బలవంతంగా అయినా సరే చదివించాలి. అలా కాకపోతే మనమే చదివి వినిపిద్దాం".

"ప్లాన్ బానే వుంది...కాని ఆచరణే కష్టం... మనకు అంత టైమ్ ఎక్కడుంటుంది చెప్పు..."

"ఎందుకుండదు? వుండేట్టు చూసుకోవాలి. టీ.వీ ప్రోగామ్స్, క్రికెట్, టెన్నిస్ మ్యాచ్‌లు చూడ్డం తగ్గిస్తే మస్తు టైం మిగులుతుంది..."

"కరెక్టేలే... ఎవరో ఆడేది చూసే బదులు, మనింట్లో మనమే ఆడుకోవచ్చు. మొత్తానికి చిన్ని పిల్లలమై తనతో ఆడితే తప్ప దారిలోకి రాదు. కనీసం సెలవుల్లో అయినా ఈ పనులు చేయాలి" రిలీఫ్‌గా గాలి పీల్చుకున్నాడు ప్రభాకర్. సెలవులు అయిపోయాక ఏమిటి పరిస్థితి...? సమస్య మళ్ళీ మొదటికే వస్తుందేమోనని ఒక్క క్షణం నాకు భయం వేసింది. అంతలోనే ఆ భయం అర్థం లేనిదిగా అనిపించింది. ఎందుకంటే... ఒక్కసారి పుస్తకాలు, ఆటలకు అలవాటు పడిన పిల్లలు, అంత త్వరగా వాటికి దూరం కాలేరు అని నాకు ఖచ్చితంగా తెలుసు.

*

సీరియల్
గత సంచిక తరువాయి

# తలకిందులు

❖ ఎడ్వర్డో గెలీయనో
తెలుగు : అరుణ్

## అధ్యాయం : 2

## భయోత్పాతంపై ప్రసంగాలు

*"న్యాయమనేది పాములాంటిది అది పాదరక్షలు లేని వారిని మాత్రమే కాటేస్తుంది"*
ఆస్కర్ ఆర్నుల్ఫో రొమేరో శాన్ సాల్వెడార్ బిషప్ (1980లో హత్య గురయ్యాడు)

**1. భయాన్ని బోధించడం :**

న్యాయం కన్నా రక్షణకు ఎక్కువ ప్రాధాన్యతనిచ్చే ప్రపంచంలో, రక్షణ కొరకు న్యాయాన్ని బలిపెడుతున్నపుడల్లా చప్పట్లు మారుమోగుతాయి. ఈ కర్మకాండంతా వీధుల్లో జరుగుతుంది. ఒక నేరస్థుడు తుపాకీ గుళ్ళకు బలయినపుడల్లా తనకు వణుకు పుట్టించే రోగం నుండి కొంత ఉపశమనం కల్గిందని సమాజం భావిస్తుంది. అధోజగత్ ప్రజల ప్రతి మరణం, ఉన్నత జీవితాలపై ఔషధాల ప్రభావం చూపుతుంది. "ఫార్మకీ" (ఔషధ తయారీ) అనే పదానికి మూలం గ్రీకు పదమైన "ఫార్మకోస్". అంటే, సంక్షోభ సమయాల్లో దేవునికిచ్చే మానవబలి.

**యుగాంతపు గొప్ప బెదిరింపు :**

1982 లో రియో డిజనేరియోలో సాధారణంగా జరిగే సంఘటన మరొకటి జరిగింది. దోపిడీ చేసాడనే అనుమానంతో పోలీసులు ఒక వ్యక్తిని చంపారు. అధికారులు ఆత్మరక్షణ కోసం కాల్పులు జరిపినపుడల్లా నిందితుని వీపులోకి బులెట్ దిగినట్టుగా పై వ్యక్తి వీపులోకి బులెట్ దిగింది. కేసు మూసి వేయబడింది. తన నివేదికలో ప్రధాన అధికారి ఆ అనుమానితుడు ఒక "నిజమైన సామాజిక క్రిమి" అంటూ " అతని మరణంతో, అతనికి ఈ గ్రహంపై విముక్తి కలిగింది'' అని పేర్కొన్నాడు. నేరస్తులను వర్ణించేందుకు బ్రెజిల్‌లోని దినపత్రికలు, రేడియో, టి.వి.లు తరచుగా వైద్యశాస్త్ర, జీవశాస్త్ర పదాలను 'వైరస్', 'క్యాన్సర్', 'సామాజిక అంటువ్యాధి'. "పశువులు", "బందిపోట్లు", "క్రిములు", "క్రూరజంతువులు" అని, చిన్నపిల్లలనయితే " చిన్న జంతువులు" అనే పదాలను ఉపయోగిస్తాయి. ఈ పదాలు ఎప్పుడూ పేదలకు వర్తించేవే. నేరస్థుడు పేదవాడు కానపుడు ఈ వార్త మొదటి పేజీలో ప్రచురితమవుతుంది". చంపబడిన యువకుడు మధ్యతరగతికి చెందినవాడు'' అని దినపత్రికలు మొదటిపేజీలో రాస్తాయి.

పోలీసులతో సంబంధమున్న కిల్లర్ గ్యాంగ్‌ల బలిపశువుల సంఖ్యను పరిగణలోనికి తీసుకోకనే, 'అధికారికంగానే', 1992లో సావ్‌పాలో రాష్ట్ర పోలీసులు ప్రతిరోజు నలుగురిని చంపారు. సంవత్సరానంతరం లెక్క వేస్తే, పోలీసుల చేత చంపబడిన వారి సంఖ్య 15 ఏళ్ళ సైనిక నియంతపాలనలో బ్రెజిల్‌లో చంపబడిన వారి సంఖ్య కన్నా నాలుగు రెట్లు ఎక్కువ. 1995 చివరికి "ధైర్యసాహసాలకు'' గాను బ్రెజిల్ పోలీసుల వేతనాలు పెంచబడ్డాయి. పెరిగిన వేతనాలతో సమానంగా, మరొక రూపు పెరుగుదల కూడా కన్పించింది. అది "నేరస్థులనబడేవారి'' మరణాల సంఖ్య. గతంలో సైనిక నియంతృత్వంలో ప్రధాన వ్యక్తిగా వుండి, ఇప్పుడు రియోనగర శాంతి భద్రతలకు బాధ్యుడైన జనరల్ నీల్టన్ సెర్క్యూర "వీరు పౌరులుగారు; దోపిడీదొంగలు'ని వివరిస్తాడు. ఒక మంచి సైనికునివలె ఒక మంచి పోలీసు మొదట కాలుస్తాడు, తర్వాత ప్రశ్నిస్తాడని ఆ జనరల్ విశ్వాసం.

1959లో సంభవించిన క్యూబన్ విప్లవ భూకంపం తర్వాత, లాటిన్ అమెరికా సైనికశక్తి సరిహద్దులు రక్షించే సాంప్రదాయ పాత్ర నుండి తన దృష్టిని "అంతర్గత శత్రువుల" గెరిల్లా విద్రోహచర్యలపైన వాటికి ప్రోత్సాహాన్నిచ్చే అనేక శక్తులపైన మళ్ళించింది. స్వేచ్ఛా ప్రపంచం మరియు ప్రజాస్వామ్య పాలన ప్రమాదంలోపడటంతో, ఈ సైనికపాలన స్వేచ్ఛను, ప్రజాస్వామ్యాన్ని రద్దు చేసేందుకు ఉత్తేజం పొందింది. దేశ సంరక్షణ అనే సిద్ధాంతాన్ని అక్షరక్షరం పాటిస్తూ, ఈ సైనిక పాలకులు పౌర ప్రభుత్వాలను పడగొడుతూ, సంవత్సరాల తరబడి ప్రజలను ఊచకోతకోసారు. కాలం గడిచింది. పౌరప్రభుత్వాలు పునరుద్ధరించబడ్డాయి. శత్రువులు గతంలోలాగా కాకపోయినా, 'అంతర్గతంగా' మిగిలారు. నేడు సైనికులు సాధారణ నేరమనే దానికి వ్యతిరేకంగా పోరాటం చేస్తున్నారు. గతంలో మాదిరి దేశభద్రత కాకుండా, నేడు ప్రజాభద్రత అనేది ఒక మానసికరోగమైంది. మామూలుగా చెప్పాలంటే ఆఫీసర్లకు తమను పోలీసుల స్థాయికి తగ్గించడం మింగుడుపడటంలేదు. కాని వాస్తవ పరిస్థితుల్ని భరించకతప్పదు.

---

### ప్రపంచవ్యాప్త భీతి

*ఉద్యోగులకు ఉద్యోగాలు పోతాయని భయం*
*నిరుద్యోగులకు తమకెన్నడూ ఉద్యోగాలు దొరకవని భయం*
*ఆహారకొరత లేనివారికి తినడానికి భయం*
*డ్రైవర్లు కాలినడకకు, పాదచారులు వాహనాలకు భయపడుతున్నారు*
*ప్రజాస్వామ్యానికి జ్ఞాపకాలంటే భాషకు మాటలంటే భయం*
*పౌరులకు సైనికులంటే, సైనికులకు ఆయుధాల కొరతంటే*
*ఆయుధాలకు యుద్ధాలు లేకుంటే భయం*
*ఇది భీతి కాలం*
*స్త్రీలకు క్రూరులైన పురుషులంటే భయం*
*పురుషులకు భీతిలేని స్త్రీలంటే భయం*
*దొంగల భయం, పోలీసుల భయం*
*తాళాలులేని వాకిళ్ళంటే, గడియారం లేని కాలమంటే*
*టి.వి.లేని పిల్లలంటే; నిద్రమాత్రలు లేని రాత్రుళ్ళంటే*
*నిద్ర మేల్కొలిపే మాత్రలు లేని పగలంటే భయం, భయం*
*గుంపు అంటే భయం, ఒంటరితనపు భయం,*
*గతమంటే భయం, ఏమౌతుందోనని భయం*
*చావు భయం, బతుకు భయం*

---

30 సంవత్సరాల క్రితం వ్యవస్థకు అన్ని రంగాలలో శత్రువులుండేవారు. చిల్లర దొంగతనాలు, చాకు చేతబూనిన మురికివాడ వాసులు - వీరంతా నేర కథనాలు చదివే పాఠకులకు, క్రూరచర్యలపై ఆసక్తిగలవారికి, నేరశాస్త్ర నిపుణులకు ఆసక్తి కల్గించేవారు. నేడు, "సాధారణ నేర" మనేది ఒక విశ్వవ్యాప్త రుగ్మతగా మారింది. "సాధారణ నేరం" ప్రజాస్వామీకరించబడి, అందరికీ అందుబాటులో వుంది. చాలామంది దాన్ని పాటిస్తున్నారు. ప్రతి ఒక్కరూ దాని వల్ల బాధపడుతున్నారు. రాజకీయనాయకులకు, నేరమనేది శక్తివంతమైన ఉత్తేజపు వనరు. ఇక, నేరాన్ని ఉక్కుపాదంతో మరణశిక్షతో అణచివేయాలని కేకలు పెట్టే జర్నలిస్టులకు నేర ఉత్తేజాన్నిస్తుంది. నేరం కొంతమంది సైనికాధికారులకు, సైనికేతర వృత్తి చేపట్టడానికి బంగారు అవకాశం. సైనిక నియంతలుగా

పనిచేసిన కొంతమంది లాటిన్ అమెరికా సైనికాధికారులు ప్రజాదరణ పొందిన రాజకీయ నాయకులుగా చెలామణి కావడానికి; ప్రజాస్వామ్యాన్ని అల్లకల్లోలంగా, అభద్రతగా గుర్తించే సామూహిక భయోత్పాతం బహుశా కారణమేమో. గేటమ్‌ల ఇండియన్లను ఊచకోతకోసిన జనరల్ రియోస్ మాంట్, అతని అధ్యక్ష అభ్యర్థిత్వం చట్ట విరుద్ధమని ప్రకటించేవరకు ఎన్నికలో ముందున్నాడు. ఒక చేత్తో అనుమానాస్పదులను చంపుతూ, మరో చేత్తో ఆ శ్రమఫలితాన్ని స్విస్ బ్యాంకుల్లో నిల్వచేసిన జనరల్ బుస్సీ, టుకుమన్ రాష్ట్ర గవర్నర్‌గా ఎన్నికయ్యాడు. మరల తిరిగి ఎన్నికయ్యాడు కూడా. సైనిక దుస్తులలోవున్న మరో హంతకుడు జనరల్ బాంజేర్‌కు బొలీవియా అధ్యక్షపదవి బహుమానంగ దొరికింది.

చావు పుట్టుకలను డాలర్లలోకి, సెంట్లలోకి మార్చగల ఇంటర్ అమెరికా డెవలెప్‌మెంట్ బ్యాంక్ నిపుణులు నేరాలవల్ల లాటిన్ అమెరికా ప్రతిసంవత్సరం 168 బిలియన్ డాలర్లను నష్టపోతుందని లెక్కవేసారు. మనం నేరమనే ప్రపంచకప్‌ను గెలుస్తున్నాం. లాటిన్ అమెరికా హత్యల రేటు ప్రపంచ హత్యల సగటుకన్నా ఆరురెట్లు ఎక్కువ. నేరాల స్థాయిలోనే ఆర్థిక పెరుగుదల కూడా వుండి వుంటే, ఈ ప్రాంతం మొత్తం ప్రపంచంలోనే అత్యంత సంపన్న ప్రాంతమయ్యుండేది. ఎల్ సాల్వడార్‌లో శాంతి? ఏ శాంతి? గంటకొక హత్య చొప్పున ఎల్ సాల్వడార్ వెనుకటి యుద్ధపు రోజులతో పోటీ పడుతుంది. కొలంబియా, బ్రెజిల్, మెక్సికోలలో 'కిడ్నాపింగ్' చాలా లాభదాయకమైన పరిశ్రమ. మన పెద్ద నగరాలలో, కనీసం ఒక్కసారైనా దోచబడనివాడిని, సాధారణ వ్యక్తిగా పరిగణించరు. న్యూయార్క్ కన్నా రియో నగరంలో ఐదురెట్లు హత్యలు ఎక్కువగా జరుగుతాయి. బొగోట హింసకు రాజధాని. మెడిలాన్ వితంతువుల నగరం. మూడవ ప్రపంచ యుద్ధానికి అవసరమయినట్టుగా, తలనుండి బొటన వేలుదాక రక్షణ కవచాలు ధరించిన ప్రత్యేక పోలీసు సిబ్బంది కొన్ని లాటిన్ అమెరికన్ నగరాలలో కావలికాస్తారు. వారు చీకటిలో కూడా చూడగలిగే అద్దాలను, హెడ్‌ఫోన్‌ను, మైక్రోఫోన్‌ను తూటాలు దూరని దుస్తులను ధరిస్తారు. వారు మిరియాల పొడిని, ఆటోమేటిక్ రైఫిళ్ళను, పిస్టల్స్‌ను చేతబడ్తారు.

---

## లాటిన్ అమెరికా నుండి ఒక నమూనా దృశ్యం

ప్రభుత్వాలు, పాలన నిర్వహించడంమాని జైళ్ళను నడుపుతాయి
అధ్యక్షులు విదేశీకంపెనీల దేశీయ మేనేజర్లవుతారు
ఆర్థిక మంత్రులు మంచి అనువాదకులవుతారు
పారిశ్రామికవేత్తలు దిగుమతుదారులవుతారు
చాలా చాలా కొద్దిమంది వినియోగించి వదిలివేసిన వాటిమీద
చాలా చాలా ఎక్కువమంది ఆధారపడతారు
కార్మికులు ఉద్యోగాలు కోల్పోతారు
రైతాంగం భూమిని కోల్పోతుంది
పిల్లలు బాలల హక్కులను కోల్పోతారు
యువత విశ్వాసాన్ని కోల్పోతుంది
వృద్ధులు తమ పించన్లను కోల్పోతారు
విజేతలు మాత్రం "జీవితం ఒక లాటరి, జూదం" అని వ్యాఖ్యానిస్తారు.

---

కొలంబియాలో జరిగిన ప్రతి వంద నేరాలలో, 97 నేరాలు పరిష్కారం కాలేదు. పోలీసులు తామే నేరాలు చేస్తూ, ప్రజల్ని చంపుతూ గడిపే బ్యూనస్ ఐరస్ నగర వీధుల్లో, వారు నేరస్థులను కనుగొనే శాతం కూడా కొలంబియాలోలాగే వుంది. 1983లో ప్రజాస్వామ్యం పునరుద్ధరింపబడినప్పటి నుండి 1997 మధ్యకాలం వరకు, పోలీసులు అనుమానాస్పదంగా కన్పడే 314 మంది బాలురను కాల్చిచంపారు. 1997 చివరలో పోలీసుల అలజడుల కాలంలో ఐదువేలమంది పోలీసు అధికారులు ఏంచేస్తున్నారో, లేక వారెక్కడ వున్నారో పత్రికల వాళ్ళకు తెలియదు. తమకేదైనా తీవ్రమైన సమస్యవుంటే, ఏ అర్జెంటీనావాసుడుగాని, ఉరుగ్వే వ్యక్తిగాని పోలీసుల సహాయం కోరడని ప్రజాభిప్రాయసేకరణలో తేలింది. ప్రతి పదిమంది ఉరుగ్వేవాసులలో 6మంది చట్టాన్ని తమచేతుల్లోకి తీసుకోడానికే యిష్టపడుతారు. కొంతమంది తుపాకి పేల్చడంలో శిక్షణ పొందుతున్నారు కూడా.

ఉత్తర అమెరికాలో ప్రతి పదిమందిలో నలుగురు తమ రోజువారి కార్యక్రమాలకు నేరాలవల్ల స్వస్తి చెప్పామని అంగీకరించారు. రియోగ్రాండే (టెక్సాస్-మెక్సికోకు సరిహద్దుగా వున్నది) దక్షిణ ప్రాంతంలో ప్రజలు ఫుట్‌బాల్ గురించి, వాతావరణం గురించి ఎంతగా మాట్లాడుకుంటారో అంతగా దోపిడీ గురించీ, బందిపోటుతనం గురించీ మాట్లాడుకుంటారు. ప్రజాభిప్రాయ సేకరణ అనే పరిశ్రమ మంటను ఎగదోస్తూ ప్రజా రక్షణను ప్రజల మౌఢ్యంగా మార్చింది. అయితే, వాస్తవంలో నేరాలు యింకా ఎక్కువగానే జరుగుతున్నాయి. అధికారికంగా తెలిపే సంఖ్యకన్నా పెద్దమొత్తంలో నేరాలు జరుగుతున్నాయి. పెరుగుతున్నాయి. చాలా దేశాల్లో ప్రజలకు పోలీసులంటే భయం వుండటంవల్ల లేదా వారిపై విశ్వాసం లేకపోవడం వల్ల, వేరు నేరాల గురించి ఫిర్యాదు చేయరు. సంచలనం కల్గించే దోపిడీ చేసే సమూహాలను ఉరుగ్వే పత్రికలు "సూపర్‌గ్యాంగ్స్" అని పిలుస్తాయి. ఆ గ్యాంగ్ సభ్యుల్లో పోలీసు అధికారులుంటే వాటిని 'పోలీగ్యాంగ్' అని పేర్కొంటాయి. ప్రతి పదిమంది వెనిజులా ప్రజల్లో, తొమ్మిది మంది పోలీసులు నేరం చేస్తారని నమ్ముతారు. 1996లో రియోడిజనేరిమోలోని మంచి పోలీసులలో ఎక్కువమంది, ప్రజలు తమకు లంచాలు యివ్వజూపారని చెప్పగా, వారి అధిపతి "పోలీసులు లంచగొండులయ్యేందుకే సృష్టించబడ్డారని", "లంచగొండి మరియు హింసాత్మక పోలీసుల" కోరే సమాజాన్ని నిందించాలని చెప్పాడు.

ఆమ్నెస్టీ ఇంటర్నేషనల్‌కు దొరికిన పోలీసు రహస్య నివేదిక ప్రకారం, మెక్సికో నగరంలో జరిగే ప్రతి పదినేరాలలో ఆరునేరాలు పోలీసులు చేసినవే - ఒక సంవత్సరంలో వందమంది నేరస్థులను పట్టుకొనడానికి, వాషింగ్టన్‌లో 10 మంది పోలీసులు, పారిస్‌లో 15, లండన్‌లో 18 మంది అవసరం కాగా, మెక్సికోనగరంలో 1,295 మంది పోలీసులు అవసరమవుతారు. "మేం పోలీసులు అతిగా లంచగొండులయ్యేందుకు అవకాశం యిచ్చామని" 1997 మెక్సికో నగర మేయర్ అంగీకరించాడు. "అతిగానా?" అని మెక్సికో రచయిత మరియు జర్నలిస్టు కార్లోస్ మాన్‌సివియాస్ ఆశ్చర్యపోగా, "వారిలో తప్పేముంది వారు లంచగొండులా? లేక నిజాయితీపరులా? దాంతో మాకేంపని? వారికి పనికి అప్పగించు", అని ఆ మేయరు స్పందించాడు.

శతాబ్దపు చివరకు ప్రతి ప్రపంచీకరణ చెందుతుంది, ప్రతి ఒక్కటి ఒకేవిధంగా తయారవుతున్నది. దుస్తులు, ఆహారం, ఆహారంలేక పోవడం, అభిప్రాయాలు, అభిప్రాయాలలేమి, నేరంకూడా; ఇక నేరభయం గురించి చెప్పనక్కర్లేదు: సప్తస్వరాలు ఎంతో ఉద్వేగంగా పల్కినా, వాటికన్నా వేగంగా, ప్రపంచమంతట నేరాల సంఖ్య పెరుగుతూవుంది. 1970ల నుండి, ఫిర్యాదుచేయబడిన నేరాల పెరుగుదల, ప్రపంచ జనాభాపెరుగుదల కన్నా, మూడు రెట్లు అధికం. 1990లలో వినిమయ సంస్కృతి కమ్యూనిజాన్ని పాతిపెట్టిన కాలంలో యూరోప్‌లో వేతనాలు పడిపోయినంత వేగంగా రోజువారి హింసపెరిగింది. బల్గేరియా, చెక్ రిపబ్లిక్, హంగరీ, లాట్వియా, లిధువేనియా, ఈస్టోనియాలలో 3 రెట్లు పెరిగింది. సంఘటిత, మరియు అసంఘటిత నేరాలు రష్యాకు సంక్రమించాయి. అక్కడ బాల్యనేరాలు మరెక్కడా లేనివిధంగా పెరిగాయి. రష్యా నగరాలలో తిరుగాడే పిల్లలను "మరచిపోబడ్డవారు" అని అంటారు. "మా దేశంలో వందల వేల అనాథబాలలున్నారని" రష్యా అధ్యక్షుడు బోరిస్ ఎల్సిన్ అంగీకరించాడు.

1997 చివరకు, లూసియానా రాష్ట్రంలో దాడుల గురించి, స్పష్టంగా ఒక చట్టంచేయబడింది. తమను ఎవరైనా దోచేందుకు ప్రయత్నిస్తే- వారు నిరాయుధులైనా- వారిని కారు డ్రైవర్లు కాల్చిచంపడం చట్టవ్యతిరేకం కాదంది. ఇటువంటి యెలాంటి పరిమితులులేని చట్టాన్ని టి.వి. ద్వారా ప్రచారం చేసారు. నేరస్థులను, ఎలాంటి జాలి, దయ, కరుణ లేకుండా శిక్షించడంవల్ల న్యూయార్క్

రాష్ట్ర గవర్నర్ ప్రతిష్టపెరిగిపోయింది. పోలీసుల క్రూరచర్యలు పెరిగినంత నిష్పత్తిలోనే నేరచర్యలు తగ్గాయి. మీడియా బ్రహ్మారథం పట్టిన క్రూర అణచివేత, అతి దారుణంగా నల్లజాతి వారిపై మరియు ఇతర "మైనారిటీల"పై ప్రయోగించబడుతోంది - వారందరూ కలిసి న్యూయార్క్ జనాభాలో మెజారిటీగా వుంటారు. "ఏమాత్రం జాలి, కరుణ, దయలేని "చర్య" లాటిన్ అమెరికా నగరాలకు దిక్సూచిగా మారింది.

1997 హోండురన్ అధ్యక్ష ఎన్నికలు: ప్రతి అభ్యర్థికి నేరమనేది ప్రధాన అంశం. భయంతో వణికిపోతున్న ప్రజలకు ప్రతి అభ్యర్థీ రక్షణ కల్పిస్తామని హామీ యిచ్చాడు. అదే సంవత్సరం అర్జెంటినాలో చట్టసభకు ఎన్నికలు: నార్మామిరాలస్ అనే అభ్యర్థి నేరస్థులకు 'మరణ శిక్ష' విధించాలనీ, అయితే అది భాధాకరమైందిగా, కాకుండా వుండకూడదన్నాడు. "నేరస్తున్ని చంపడం పెద్ద విషయమేమీకాదు; ఎందుకంటే అతడు బాధపడడు". అంతకు కొన్ని రోజుల క్రితమే రియోడిజనేరియో మేయర్ లూజ్‌పాలో కాడే, మరణ శిక్షలో లోపంవుందన్నాడు. ఎందుకంటే ఆ క్రమం 'త్వరలో ముగుస్తుంది'. కాబట్టి నేరస్థునికి జీవితకాలపు శిక్ష లేక బలవంతపు శ్రమగాని విధించాలని ఆ మేయర్ అభిప్రాయం.

కాని; ఏ చట్టంకూడా, ఆ చట్టపు పరిధికావల వున్నవారిని దాడులను ఆపలేదు. భయపడేవారి సంఖ్య పెరుగుతూనే వుంటుంది: వారు, వారు భయపడేదానికన్నా, యెక్కువ ప్రమాదంగా వుంటారు. సంపదకల్గిన జూదగాళ్ళు, మోసగాళ్ళు మాత్రమే బెదిరింపులకు, భయపడరు: ఏమీలేని వాళ్ళు, పేదలు కూడా తమకన్నా పేదలు, నిస్సహాయులు దాడిచేస్తారేమోనని భీతిచెందుతారు. "నారింజ పండును దొంగిలించినందుకు ఒకపిల్లవాని సజీవదహనం" అని పత్రికా శీర్షికలుంటాయి. పేదవాళ్ళపై పేదవాళ్ళ ఆగ్రహం : 1979 - 1988 మధ్యకాలంలో బ్రెజిల్ దినపత్రికల ప్రకారం 272 మంది పేదలచేత చావుదెబ్బలు తిన్నారు. కారణం, ఆ పేదవారి దగ్గర, ఆ పని పోలీసుల కప్పగించేందుకవసరమయిన ధనం లేకపోవడమే. 1997లో అలాంటి సంఘటనలు 52 జరుగగా, 1986 - 1991ల మధ్య జమైకాలో 166 జరిగాయి. అదే ఐదేళ్ళలో జమైకా పోలీసులు వేయిమందికిపైగా అనుమానాస్పదులను కాల్చిచంపారు. వీధుల్లో ప్రజలు చావబాదడం, పోలీసులు కాల్చిచంపడం యివన్నీ నేరాలను తగ్గించలేకపోయాయి. కాబట్టి ఒక ప్రజాభిప్రాయసేకరణలో మూడవవంతు జనాభా, బాలనేరస్థులకు ఉరిశిక్షవేయాలని అభిప్రాయపడినట్టు తేలింది. 1997 రియో డిజనేరియో, సాన్‌పాలో లో జరిగిన ప్రజాభిప్రాయ సేకరణలో సగంమందికిపైగా జనాభా నేరస్థులను చిత్రవధ చేయడం "సాధారణమే"నని అభిప్రాయపడింది.

చట్ట వ్యతిరేకంగానో, పోలీసుల, సైనికుల పాత్రవుండి లేక వారి సమ్మతితో, "డెత్ స్క్వాడ్స్" చేసే శిక్ష హత్యలను ప్రజలలో గణనీయమైన భాగం బహిరంగంగా, లేదా రహస్యంగానో మెచ్చుకుంటున్నారు. బ్రెజిల్‌లో ఈ క్రమం గెరిల్లాల హత్యలతో మొదలైంది. ఆ తర్వాత సైనికులు కౌమారదశ చేరిన నేరస్థులకు ఈ శిక్ష విధించారు. ఆ తర్వాత స్వలింగసంపర్కులు, బిచ్చగాళ్ళు, ఆ తర్వాత టీనేజర్లు, చివరకు పసిపిల్లలను ఆ పట్టిక (చంపబడేవారి పట్టిక)లో చేర్చారు. రియోనగర వ్యాపారస్థుల సంఘ అధ్యక్షుడు సిల్వియో కున్హా" మురికివాడలకు చెందిన ఒక యువకున్ని చంపడం, సమాజానికి సేవచేయడమే" నని 1991లో తన అమూల్యమైన అభిప్రాయం వెలిబుచ్చాడు. బోటోఫోగో వీధుల ఒక అంగడి యజమాని, రెండునెలల్లో నాలుగు మార్లు దోచబడ్డాడు. అలా యెందుకు జరిగిందో ఒక పోలీసు వివరిస్తాడు: ఇప్పుడు పిల్లల్ని అరెస్టు చేయడంవల్ల ఉపయోగంలేదు. వారు, రేపు దొంగతనం చేయడానికి, న్యాయమూర్తి విడుదలచేస్తాడు. "ఇక మీయిష్టం" అన్నాడు పోలీసు. సహేతుకమైన ధర చెల్లిస్తే, తాను వీధుల్లో లేనపుడు, తాను వారిని తొలగిస్తాను" అని చెపుతాడు.

"వారిని తొలగించడమా?"

"అవును, అదే."

బ్రెజిల్‌లో "డెత్‌స్క్వాడ్స్" అంగళ్ళ యజమాన్లతో కాంట్రాక్టు కుదుర్చుకుంటాయి. అని తమనుతాము "స్వీయ రక్షణ దళాలని" చెప్పుకుంటాయి. వారిపని నగరాలను శుభ్రం చేయడమే (బాల నేరస్థులను కాల్చిచంపడమే). వారి సహచరులు గ్రామీణ ప్రాంతాలలో భూస్వాములతో, కాంట్రాక్టు కుదుర్చుకుంటారు.- వారిపని భూమిలేని రైతాంగాన్ని ఇతర యిబ్బందికరమైన వ్యక్తులను తుదముట్టించడమే, "ఇస్తొ-ఈ" పత్రిక మే 20, 1998 ప్రకారం, మరన్‌హావో రాష్ట్రంలో ఒక న్యాయమూర్తి ప్రాణం విలువ ఐదువందల డాలర్లయితే, ఒక మతాధిపతిది నాలుగువందల డాలర్లు. ఒక లాయర్‌ను చంపాలంటే కేవలం మూడు వందల డాలర్లు మాత్రం అవసరం. ఇంటర్నెట్ ద్వారా హంతకులు తమసేవలను ప్రచారంచేస్తారు. డిస్కౌంట్ కూడా యిస్తారు.

కొలంబియా "డెత్ స్క్వాడ్స్"ను అధికారికంగా "స్వీయరక్షణ గ్రూపులు" అని పిలుస్తారు. అవేమో, తమనుతాము "సామాజిక పరిశుభ్రతాదళాలు" అని పిలుచుకుంటాయి. ఇవి, మొదట్లో గెరిల్లాలను చంపడంతో తమ కార్యక్రమాల్ని ప్రారంభించాయి. అయితే, ఇప్పుడు, ఎవరు డబ్బు చెల్లిస్తే వారు చూపినవారిని చంపుతాయి. ఆ దళాలలో చాలామంది సభ్యులు యూనిఫారం ధరించని పోలీసులు, సైనికులే. వారు, కొత్తవారికి హత్య చేయడంతో తర్ఫీదునిస్తారు. మెడిలిన్‌లో అలాంటి శిక్షణయిచ్చేక అనేక పాఠశాలలు టీనేజర్లను డబ్బుతోనూ, విలాసవంతమైన జీవితాన్ని ఎరవేసి ఆకర్షిస్తాయి. శిక్షణ పొందిన ఈ 15 సం॥ వయసు పిల్లలను, ఇతర పిల్లలు చంపేందుకు అద్దెకు తీసుకుంటారు. పేదలకు వ్యతిరేకంగా పేదలు - సర్వసాధారణమే. పేదరికమనేది తక్కువ విడితి (సైజు)గల దుప్పటిలాంటిది. ప్రతిఒక్కరు దాన్ని తమ వైపులాక్కొని ఇతరులను అందులోంచి మినహాయించాలని చూస్తారు. ఒక్కొక్కసారి, ఆ బాధితుడు ప్రముఖ రాజకీయ నాయకుడో లేక జర్నలిస్టో, అయ్యుండొచ్చు. ఎంపిక చేసిన లక్ష్యం (వ్యక్తి)ని "కుక్క" లేక ఒక "ప్యాకేజి" అంటారు. ఆ 'కుక్క' యొక్క హోదాను బట్టి ఆ కార్యక్రమంలో కలిగే యిబ్బందులపట్టి యువహంతకులకు నజరానా చెల్లిస్తారు, తరచుగా ఈ హంతకులకు సెక్యూరిటీ కంపెనీల చట్టబద్ధ ముసుగు రక్షణ కల్పిస్తుంది. 1997లో చివరలో, మూడువేల సెక్యూరిటీ సంస్థలకు గాను, తమకు కేవలం 30 మంది ఇన్‌స్పెక్టర్లున్నారని కొలంబియా ప్రభుత్వం ప్రకటిస్తుంది. గత సంవత్సరం 1997లో ఒక వారంలో, ఒక ప్రభుత్వ ప్రతినిధి నాలుగువందల "స్వీయరక్షణ గ్రూపుల" పరిశీలించాడు. ఆ గ్రూపులలో అతనికి చట్టవిరుద్ధమైనదేమీ కన్పడలేదు.

---

## ప్రజాశత్రువు : 1

*1997 ఏప్రిల్‌లో, ఒక యువ హంతకునికి యెలాంటి శిక్షవిధించాలో తెల్పమని బ్రెజిల్ టెలివిజన్ తన వీక్షకులను కోరింది. జైలుశిక్షపై మరణశిక్ష 1 : 2 తో గెలిచింది.*

*పరిశోధకుడు, వీరా మాలాగుటి అభిప్రాయంలో "ప్రజాశత్రువు"కు ఒక నమూనా ప్రచారంలో వుంది. అతడు, మురికికూపంలో నివసించే, చదువురాని, చెత్త సంగీతాన్ని మెచ్చుకొనే, మాదక ద్రవ్యాలను వినియోగించే లేక అమ్మే బానిసల సంతతివాడు. అంతేగాక, అతను గర్విష్టి, మొరటు యే మాత్రం పశ్చాత్తాపం చూపనివాడు.*

---

డెత్ స్క్వాడ్స్ యే మాత్రం గుర్తుల విడవవు. నిశ్శబ్దం చాలా అరుదుగా మాత్రమే చెదురుతుంది. 1991 మధ్యలో ఒక మినహాయింపు కొలంబియాలో జరిగింది. పెరీరానగరం అర్లమైమంది బిచ్చగాళ్ళు కాల్చిచంపబడ్డారు. హంతకులు కనీసం అరెస్టుచేయలేదు. కానీ, పదిహేనుమంది పోలీసు అధికారులపై, అందులో ఇరువురు ఉన్నతాధికారులుకూడా, పై క్రమశిక్షణా చర్యలు తీసుకున్నారు. వారితో పదవీ విరమణ చేయించారు. 1993 మధ్యకాలంలో

రియోడిజనేరియాలో మరొక మినహాయింపు, కొండిలేరియా చర్చిగేట్లముందు నిద్రపోతున్న ఏభైమంది అనాధబాలురు కాల్చివేయబడ్డారు. ఈ సామూహిక హత్యలు ప్రపంచమంతటా ప్రకంపనలు సృష్టించాయి. చివరకు ఆ కార్యక్రమం నిర్వహించిన ఇరువురు సైనికాధికారులు జైలుకు పంపబడ్డారు. ఒక అద్భుతం.

## ప్రజాశత్రువు : 2

*1998 ప్రారంభంలో, శామ్యూల్ బ్లిక్సిన్ అనే జర్నలిస్టు చాలా ఆసక్తికరమైన పోలిక ఒకటి వివరించాడు. పేరుపొందిన నేరస్థుల ముఠా ఏభై బందిపోటుదొంగతనాలు చేస్తే ఉరుగ్వేలో లభించేది దాదాపు ఐదు మిలియన్ల డాలర్లు. కాని, ఒక తూటాపేలకుండా, ఒక బ్యాంక్ లేక మరొక ఫైనాన్సర్ చేసే రెండు బందిపోటు దొంగతనాల నుండి లభించేది డెభైమిలియన్ల డాలర్లు.*

సోనోపాలో రాష్ట్రచరిత్రలోనే చట్టసభకు అత్యధిక ఓట్లతో గెలిచినవ్యక్తి ఆల్ ఫాన్సియో జజాడ్జి అంతటే ప్రజాదరణను అతడు యెలాపొందాడంటే: సమస్యల గురించి మాట్లాడం యిక చాలు : పరిష్కారాలకు సమయమాసన్నమైంది. అనేవాడు. నిండిపోయినజైళ్ళాడి "యే మాత్రం సరిదిద్దుటకు సాధ్యంకాని బందీలను, గోడలకాన్ని కాగడాలతో సజీవదహనం చేయాలి" లేకపోతే ఒక బాంబు సమర్చాలి. బద్దలవుతుంది. సమస్య పరిష్కారమయింది, ఆ వెధవల వల్ల మనకు మిలియన్లు ఖర్చవుతున్నాయి". వెవిగ్ని జరిపిన ఒక ఇంటర్వ్యూలో, జజాడ్జి చిత్రవధను సమర్థించాడు. పోలీసులు కేవలం తప్పు చేసినవారినే చిత్రవధ చేస్తారన్నాడు. ఒక్కొక్క మారు ఈ దుర్మార్గులు యేం నేరం చేసారో పోలీసులకు తెలియదు. అటువంటప్పుడు సమాచారాన్ని రాబట్టడానికి భర్త భార్యను కొట్టినట్టుగా, పోలీసులు నిందితులను బాదుతారన్నాడు. చిత్రవధ ఒక్కటే నిజాన్ని తెలుసుకొనే మార్గమంటూ తన ఇంటర్వ్యూను ముగించాడు.

1252లో పోప్ ఇమ్నెగెంట్ 4, క్రైస్తవ మతానికి వ్యతిరేకంగా ప్రచారం చేసేవారిని శిక్షించే అధికారమిచ్చాడు. ఆ విచారణ, బాధను కల్గించేందుకు కొత్త టెక్నిక్‌లను కనిపెట్టింది. దాన్నే 20వ శతాబ్దపు సాంకేతిక విజ్ఞానం పారిశ్రామిక పరిపూర్ణత్వ స్థాయికి చేర్చింది. ఏభై దేశాలలో ఒక పద్ధతి ప్రకారం విద్యుత్‌తో చిత్రవధ అమలవుతుందని ఆమ్నెస్టీ ఇంటర్నేషనల్ రుజువులతో సహ బయటపెట్టింది. 13వ శతాబ్దంలో అధికారంగల వాళ్ళు "పార" "పార" అనేవాళ్ళు; నిజాన్ని నిర్భయంగా భయటపెట్టేవాళ్ళు. ఇప్పుడు చిత్రవధ అమలవుతున్నది గాని చర్చించబడటం లేదు. అధికారం చెడుమాటల్ని తప్పించుకుంటుంది. 1996 చివర్లో, పాలస్తీనా బందీల చిత్రవధలకు ఇజ్రాయిల్ కోర్టు అధికారమిచ్చినపుడు, న్యాయమూర్తిదాన్ని "తగుమాత్రపు శారీరక ఒత్తిడి" అని పిలిచాడు. లాటిన్ అమెరికాలో చిత్రవధ "చట్టబద్ధమైన నిర్బంధం". ఇక్కడ సాధారణ నేరస్తులు లేక, అలాకన్పడే వాళ్ళు, పోలీసుస్టేషన్లలో "నిర్బంధం" అనుభవిస్తారు. రాజకీయ ఖైదీలకు సైనిక నియంతృత్వం పెట్టే బాధలనే, పోలీసులు నేరస్థులను నేరాన్ని ఒప్పించడానికి అమలు చేస్తారు. ఒక తేడా యేమిటంటే, ఆ రాజకీయ ఖైదీలు మధ్యతరగతికి చెందినవారు, కొందరు ఉన్నత తరగతికి చెందినవారు. సామాజిక వర్గ మొక్కటే, క్షమాభిక్షకు అప్పుడప్పుడు అంగీకరించే సరిహద్దు, సైనిక పాలన కాలపు భయోత్పాతంలోనూ, మానవహక్కుల సంఘాల నిరసనలు పూర్తిగా ఫలితాన్నివ్వకపోవు ఒక్కొక్క సారి అవి నియంతపాలన ప్రాంతంలోనేగాక ఆ పరిధిదాటి ప్రపంచం మొత్తంపైనా ప్రభావం చూపుతాయి. దానితోపోలిస్తే సామాజికంగా అసహ్యంచుకొనబడే, చట్టపరిధిలోకిరాని సామాన్య నేరస్థుల ఆక్రందనలను ఎవరు వింటారు? వారిలో ఎవరైనా తమను చిత్రవధ చేసారని చెప్పే పిచ్చి పనికి తలపడుతే, పోలీసులు అతన్ని మరింత తీవ్రమైన 'అదుపు'లోకి పంపుతారు.

కంపుకొట్టు కారాగారాలలో, ఖైదీలు బిరడా బిగించిన సీసాలోని పిల్లచేపలు - వారిలో చాలామందికి నేరనిరూపణ అయివుండదు; చాలామందిపై విచారణే జరిగివుండదు. వారక్కడ వున్నారంతే; ఎందుకున్నారో ఎవ్వరికీ తెలియదు. ఈ భయంకరమైన కారాగారాలతో పోలిస్తే డాంటే వర్ణించిన నరకం 'డిస్నీలాండ్' అంత ఆహ్లాదంగా వుంటుంది. జైళ్ళలో నిరంతరం ఆందోళనలు చెలరేగుతుంటాయి. శాంతి భద్రతల పేరిట నలుమూలలకు తూటాలు పేల్చబడుతాయి. ఆ క్రమంలో ఎంత సంఖ్యలో అదనపు ఖైదీలను తగ్గించ కలుగుతే అంత మేరకు మనుషులను చంపుతారు. 1992లో లాటిన్ అమెరికా, కిక్కిరిసిపోయిన జైళ్ళలో 50 దాకా తిరుగుబాట్లు జరిగాయి. 90 మంది చంపబడ్డారు. చాలామందిని అతిక్రూరంగా, నిర్దాక్షణ్యంగా చంపారుకూడా.

మూగవాళ్ళను మాటలనిచ్చే చిత్రవధలకు కృతజ్ఞతలు, చాలామంది ఆ బాధలు భరించలేక చేయని నేరాన్ని అంగీకరిస్తారు. ఎందుకంటే, నేరస్థునిగా బయటి ప్రపంచంలో వుండటంకన్నా, నేరం చేయనివానిగా జైళ్ళు వుండటమే క్షేమకరం. కొంతమంది తాము హత్యలు చేసామని అంగీకరిస్తారు. కాని, అవి, సైనికాధికారుల సాహసాలతోపోలిస్తే పిల్లాటలుగా కన్పడుతాయి. కొందరు దోపిడీలకు పాల్పడ్డామని అంగీకరిస్తారు. కాని, అవి, వ్యాపారస్థులు, బ్యాంకర్లు చేసేమోసాలతోనూ, దేశంలో కొంతభాగాన్ని ప్రతిసారి అమ్మినపుడు రాజకీయ నాయకులు పొందే కమీషన్లతో పోలిస్తే, హాస్యాస్పదమవుతాయి. సైనిక నియంతృత్వాలు నేడు ఉనికిలో లేవు. కాని, లాటిన్ అమెరికా ప్రజాస్వామ్యంలో జైళ్ళు మాత్రం నిండిపోతున్నాయి. మీరందరూ ఊహిస్తున్నట్లు, బందీలంతా పేదవాళ్ళే. ఎందుకంటే, వంతెనలు కూలిపోతే, దోచబడిన బ్యాంకులు దివాలాతీస్తే పునాదులు లేని భవంతులు కూలిపోతే, ఎవ్వరినీ జైలుకు పంపని దేశాల్లో కేవలం పేదలే జైళ్ళ కెళ్ళేది.

పేదరికాన్ని సృష్టించే వ్యవస్థ, తను జన్మనిచ్చిన నిరాశోపహతులపై యుద్ధాన్ని ప్రకటించే వ్యవస్థా ఒక్కటే. ఒక శతాబ్దం కిందట జార్జెస్ వాచెర్ డి వాపోజ్ అనే వాడు జాతిని పరిశుద్ధంచేయడానికి మరిన్ని ఉరికంబాలు కావాలన్నాడు. ఈ ఫ్రెంచి ఆలోచనా శీలి దృష్టిలో కేవలం జర్మనులు మాత్రమే మేధావులు: "పాకృతిక (సహజ) ఎంపిక"లోని లోపాలను ఉరికంబాలు మాత్రమే సరిదిద్దగలవని: అవి మాత్రమే అసమర్థుల మరియు నేరస్థుల వ్యాప్తిని అరిగట్టగలవంటాడు. నేడు ఉక్కుపాదపు సామాజిక వైద్యాన్ని డిమాండ్ చేసేవాడు. "ఒక మంచి మోసగాడంటే మరణించిన మోసగాడే". అని అంటారు. యేనాటికి బాగుపడని మరియు మాదకద్రవ్యాలకలవాటైన వారితో నిండిపోయిన మురికివాడల ప్రమాదంబారినుండి సమాజాన్ని తప్పించడానికి ఆ సమాజానికి వారిని చంపే హక్కువుంది. సామాజిక సమస్యలను నేడు శాంతిభద్రతల (పోలీసు) సమస్యలుగా చూడటంతో, 'మరణశిక్ష విధింపు' వుండాలనే డిమాండ్ పెరుగుతున్నది. దాన్ని, జైళ్ళను నిర్వహించే ఖర్చు తగ్గించేదిగా, అది ఆరోగ్యకరమైన బెదిరింపుగా వుంటుందని, తరచుగా నేరాలు చేసే కరడు గట్టిన నేరజాతిని తొలగించడానికి మరణశిక్ష ఒక శక్తివంతమైన సాధనమని ప్రజల నమ్మకంగావుంది. మరణిస్తూ నీవు నేర్చుకుంటావు. చాలా లాటిన్ అమెరికా దేశాల్లో మరణశిక్ష చట్టవ్యతిరేకం. అయితే, అనుమానాస్పదుని వెనుక భాగంపై పోలీసులు హెచ్చరికల లేకుండా కాల్పులు జరిపినపుడు, యెటువంటి శషభిషలు లేకుండా 'డెత్‌స్క్వాడ్స్' చంపినపుడు, 'మరణశిక్ష' అమలవుతూనే వుంటుంది. చట్టబద్ధమో లేక వ్యతిరేకమో, రాజ్యం ప్రణాళికబద్ధంగానే నరహత్యలకు ద్రోహానికి, వివక్షతకు పాల్పడుతుంది. అయితే, రాజ్యం యెంతమందిని హత్యచేసినా, ఎవరికీచెందని ప్రాంతాలుగా తయారయిన ఈ వీధులను మాత్రం యేమీ చేయలేదు.

అధికారమనేది కలుపు మొక్కలను కత్తిరిస్తూనే వుంటుందిగాని, వాటి మూలాలను (వ్రేళ్ళను) తనకే ప్రమాదకరం కాకుండా పెకిలించలేదు, మాదకద్రవ్యాలకు అలవాటు పడ్డవారిని జైలుకు పంపవచ్చుగాని, రసాయినిక ద్రవ్యం ద్వారా ప్రశాంతత కోరుకునే వాస్తవ ప్రపంచం నుండి దూరం కావాలనుకునే జీవన విధానాన్ని శిక్షింపలేము. అదే విధంగా, నేరస్థులను అరెస్టు

చేయవచ్చు కాని, వారిని ఉత్పత్తి చేసే యంత్రాన్ని (సామాజిక వ్యవస్థను) అరెస్టు చేయడం. చట్టమనేది సాలెగూడు లాంటిదంటాడు రచయిత డేనియల్ డ్రూ. అది ఈగలను, చిన్నచిన్న పురుగులను బంధిస్తుందిగాని పెద్ద జీవులను అడ్డుకోలేదు. జోసే హెర్నాండెజ్ అనే కవి, దాదాపు ఒక శతాబ్దం కిందట "చట్టము ఒక కత్తి లాంటిదని, దాన్ని పట్టుకున్న వాన్ని యేమీ చేయదని" చెప్పాడు. చట్టం ముందు అందరూ సమానులే అధికారులంటారుకాని, అది కేవలం దాన్ని తప్పించుకోలేని దురదృష్టవంతులపైనే చర్య తీసుకుంటుంది. సినిమాలలో పేద నేరస్థులు దుర్మార్గులు; ధనవంతులైన నేరస్థులు నేర రచయితలేగాక, నేరం యెలా చేయాలని చెప్పే దర్శకులు కూడా.

ఇతర కాలాల్లో, విధేయులైన శ్రామికులవసరమైన ఆర్థికవ్యవస్థకు పోలీసులు సేవచేసేవారు. ఆనాటి న్యాయవ్యవస్థ, తుపాకీ బెదిరింపుతో తిరుగుబోతులను కర్మాగారాలతో పనిచేయిస్తూ శిక్షించేది. ఆ విధంగానే యూరోపియన్ సమాజం రైతాంగాన్ని పారిశ్రామికీకరణకు వుపయోగించుకుంది. నగరాలలో పని నైతికతను అమలు చేసింది. కాని, నేడు యేవిధంగా నిరుద్యోగ నైతికతను రుద్దాలి అనేదే సమస్య. ఎటువంటి అనివార్యమైన విధేయత నియమాల ద్వారా నిరుద్యోగులు భవిష్యత్తులో కూడా ఉద్యోగాలు లేనివారి సంఖ్య పెరగకుండా చేయాలి? బతుకు పయనంలో చతికిలపడ్డవారు మరల లేవకుండా మేం చేయాలి?

నేటి రాజ్య పరిస్థితీ, ప్రపంచాన్ని శాసిస్తూ స్పెక్యులేషన్ తప్ప మరేమీ ఉత్పత్తి చేయని ద్రవ్యమార్కెట్ స్థితీ ఒక్కటే. చియపాస్ ఇండియన్ అధికారిక ప్రతినిధి సరిగ్గా వర్ణించినట్టుగా; మన బట్టలూడదీయడం చూస్తున్నాం. రాజ్యం మనం నుండి అగ్ని విలువలను ఊడుస్తుంది. ఒక్క అండర్‌వేర్‌ను తప్ప. ఆ అండర్‌వేర్ తప్పని సరైనది. కాబట్టి ఆ అండర్‌వేరే అణిచివేత రక్షణ వాస్తవం; విదేశాల రుణాల తీర్చడానికి, సామాజిక శాంతికి హామీ యివ్వడానికి మాత్రమే రాజ్యం ఉనికిలో వుంది.

రాజ్యం, చట్టానికి అతీతంగానూ, చట్ట వ్యతిరేకంగాను హత్యలు చేస్తూనే వుంటుంది. 1995 నాటి చివరకు బ్రెజిల్, అర్జెంటీనా వార్తా అంశాలు.

చట్టానికి అతీతమైన నేరాలు : రియోడిజనేరియో మిలటరీ పోలీసులు, గత సంవత్సరంలో కన్నా ఎనిమిది రెట్లు సంఖ్యలో పౌరులను చంపారు. బ్యూనస్ ఐరస్‌లో నగర పోలీసులు యువకులను క్రూర జంతువులవలె వేటాడారు.

**చట్టవ్యతిరేక నేరాలు** : బ్రెజిల్ పట్టణం కరువరులో ప్రభుత్వ హాస్పిటల్‌లో డయాలసిస్‌కు కలుషిత నీరు వుపయోగించడంతో నలభైమంది కిడ్నీ రోగులు మరణించారు. అర్జెంటీనాలోని ఈశాన్య రాష్ట్రం మిషియోన్స్‌లో గర్భిణీస్త్రీలు క్రిమి సంహారక మందులతో కలుషితమైన నీరు తాగడం వల్ల కుష్టువ్యాధితోనూ, వంగిపోయిన వెన్నుముకతోనూ పిల్లలు పుట్టారు. రియోనగర మురికివాడల్లో, స్త్రీలు కిరీటాలు ధరించినట్టుగా నీటికడవలను మోస్తూ వుంటే, పోలీసులు వస్తున్నారని హెచ్చరిస్తూ పిల్లలు గాలిలో గాలిపటాలు వదుల్తారు. పండుగ దినాల్లో నల్లచర్మపు రాణుల, రాజులు తెల్లని విగ్స్ ను, తెల్లని కోట్లను ధరించి కొండల నుండి మైదాన ప్రాంతాలకు వస్తారు. పండగ ముగిసాక విహార యాత్రికులు వెళ్ళిపోయారు. నల్లవారెవరైనా ఇంకా తెల్ల విగ్స్ తెల్లకోట్లు ధరించి వుంటే, వారిని జైళ్ళో తోస్తారు. ప్రతి సంవత్సరం కొంతసేపు చక్రవర్తులుగా వుండే ఈ కష్టజీవులు పై నియమాలను పాటించేటట్లు రాజ్యం పర్యవేక్షిస్తుంది.

ఈ శతాబ్దపు (20వ) ప్రథమభాగంలో రియో.నగరంలో ఒక మురికివాడ వుండేది. నలభైలలో మరిన్ని మురికివాడలు ఏర్పడిన సమయంలో, స్టీఫన్ జ్వెగ్ అనే రచయిత ఆ మురికివాడల్లో తిరిగాడు. అక్కడ హింసగాని, విచారం గాని కన్పించలేదు అని రాశాడు. నేడు, రియోనగరంలో ఐదువందల మురికివాడలున్నాయి. అందులో నివసించే వారంతా సంపన్నుల యిండ్లలో రకరకాల సేవలు చేసేవారే. వారిలో చాలా మంది మార్కెట్ అవసరాలకు వుపయోగపడనివారు. వీరిలో చాలామంది మాదకద్రవ్యాలతో స్వాంతన పొందేవారే. వారిని సృష్టించిన సమాజదృష్టిలో, మురికివాడలు, సంఘటిత నేరాలకు, కొకైన్ వ్యాపారాల కన్నా మారేదానికి (వారికి) సురక్షిత ప్రాంతాలు కారు. వియత్నాం గ్రామాలపై అమెరికా దాడులను తలపిస్తూ, మురికివాడలపైత మిలటరీ పోలీసులు, పదుల సంఖ్యలో "డెత్‌స్క్వాడ్స్" తరచుగా దాడిచేస్తూ వుంటారు. మరణించినవారు, నిరక్షరాస్యుల పిల్లలైన, నిరక్షరాస్య బాలలు - చాలా మటుకు నల్లజాతి యువకులు.

ఒక శతాబ్దం క్రితం ఇల్లినాయిస్‌కు చెందిన సంస్కరణల పాఠశాల అధిపతి దృష్టిలో, వారి వద్ద నున్న బాల నేరస్థులలో 3 వ వంతు మందిని మాత్రం నిబద్ధలేమన్నాడు. వారు భౌతిక ప్రపంచాన్ని, శారీరక వాంఛలను, సరిదిద్ద సైతానును ప్రేమించే భవిష్యత్ నేరస్థులు. వారితో యేం చేయాలో ఎవరికీ స్పష్టంగా తెలియదు. కాని కొంతమంది శాస్త్రవేత్తలు, సిరిల్‌బర్ట్‌లాంటి ఇంగ్లస్ శాస్త్రవేత్త వలె, పేదల్లో పేదలను భౌతికంగా నిర్మూలించడం ద్వారా మాత్రమే నేరాలను లేకుండా చేయవచ్చని ప్రతిపాదించారు. ఆ విధంగా వారి జాతి విస్తృతిని అడ్డుకోవచ్చని వారి అభిప్రాయం. అదేవిధంగా నేడు ఒక శతాబ్దానంతరం దక్షిణ ప్రాంతదేశాలు వారి దేశపేదలను విష్యర్థపదార్థాలుగా పరిగణిస్తున్నాయి. ఉత్తరప్రాంతదేశాలు ప్రమాదకరమైన తమ పారిశ్రామిక వ్యర్థపదార్థాలను, దక్షిణ దేశాలకు ఎగుమతి చేస్తాయి. కాని,దక్షిణ దేశాలు తిరిగి ఉత్తరదేశాలకు తమ పారిశ్రామిక వ్యర్థపదార్థాలను ఎగుమతిచేయ లేవు. అలాంటప్పుడు, వారు (దక్షిణ దేశాలు) తను ప్రమాదకరమైన వ్యర్థమానవ పదార్థాలను యెలా వదిలించుకోగలరు? ఇక తుపాకీ గుళ్ళు మాత్రమే ఆ పని చేయగలరు.

గాటమల నగరంలోని 140 మంది అనాధ వీధి బాలలను ఇంటర్వ్యూ చేయగా అందరూ పైసల కోసం తమ శరీరాన్ని అమ్ముకున్నవారే. అందరికీ సుఖవ్యాధులున్నాయి. అందరూ మాదకద్రవ్యాలను రుచి చూసినవారే. 1990 సం॥ మధ్య కాలంలో ఆ వీధి బాలల్లో కొంతమంది పార్టీలో మాట్లాడుతూ వుండగా, చాలా మంది సైనికులు వారిని ఒక ట్రక్కులో ఎత్తుకెళ్ళారు. ఒక అమ్మాయి మాత్రమే తప్పించుకోగలిగింది. ఆ ఎత్తుకెళ్ళిన పిల్లలలో నలుగురి శవాలు, కళ్ళు, చెవులు, నోరు కోసివేయబడి పార్క్‌లో విసిరివేయబడ్డాయి. ఆ విధంగా ఆ పిల్లలకు గుణపాఠం నేర్పబడింది.

---

## ఉన్నదున్నట్టుగా చెపుదాం

*సైనిక నియంతృత్వం కింద, ఉరుగ్వేలో, 1979 లో మొదట దక్షిణాఫ్రికా పోలీసుల సమావేశం నిర్వహించబడింది. చిలీలో, సైనిక నియంతృత్వం కింద పనిచేయాలని ఈ కాంగ్రెసు నిర్ణయించినది. "అమెరికా ప్రజల ఉన్నత ప్రయోజనాలకు లబ్ది చేకూరేలా" పనిచేయాలని ప్రతిపాదించింది.*

*అర్జెంటైనా సైనిక నియంతృత్వం కింద పనిచేస్తున్న అర్జెంటీనా పోలీసుల ప్రతినిధి బృందం బాలలకు, యువనేరస్థులకు వ్యతిరేకంగా తాము చేస్తున్న పోరాటాలను వివరించారు. పోలీసులు మాత్రమే చెప్పగలిగినట్టుగా. "చాలా సాధారణమైన విషయంగా కన్పిస్తున్నానూ, సమస్య మూలాల్లోకి వెళ్ళాలంటే, అధోజగత్ క్రమాభివృద్ధికి ప్రజల చురుకుదనానికి, కారణం వారి కుటుంబ వ్యవస్థేనని దృఢంగా చెప్పగలం. అంతేగాని వారి(నేర) చర్యలకు సామాజిక ఆర్థిక, సాంస్కృతిక పరిస్థితులు కారణం కాదు. ఆ యువకులు, తమ లాంటి నమూనాలను, ఇతర అప్రధాన సంస్కృతుల (హిప్పీ, నేరం) లో చూచుకుంటారు. ఆ విధంగా వారు వీరిని సామాజికీకరణ చేసే క్రమానికి అడ్డుపడుతుంది. ప్రజాబాధ్యతను కాపాడే కార్యక్రమం వ్యక్తిగత స్థాయిని అధిగమించి, అంతర్ వ్యక్తుల స్థాయిని చేరి ప్రత్యేకమైన, విభజించలేని వ్యక్తిగత జీవితాలను, సామాజిక జీవితపు వాస్తవాలను గమనంలోకి తీసుకుంటుంది. కొంతమంది పిల్లలు సరైన ప్రవర్తనస్థాయి నుండి దిగజారుతే, వారు వ్యక్తిగత, సామాజిక ప్రమాదకరంగా మారుతే, వారిని సులభంగా కనుగొనగలం; వారి ప్రవర్తనను మార్చి, సమస్యను పరిష్కరించగలం."* *

---

ప్రక్రియగా వ్యాసం 4 : ❖ వి. చెంచయ్య

# వ్యాసరచనా శిల్పం

వ్యాసం అనేది ఏ భాషలోనైనా గొప్ప ప్రయోజనకరమైన ప్రక్రియ. ఎటువంటి విషయాన్నైనా అన్ని రకాల పాఠకులకూ సులభంగా వివరించడానికి ఉపయోగపడే ఏకైక ప్రక్రియ. కథలు రాసినా, నవలలు రాసినా, నాటకాలు రాసినా, కవిత్వం రాసినా, వాటన్నిటి గురించి వ్యాసంలో చెప్పదగిన విషయాలు కొన్ని తప్పక ఉంటాయి. అదే వ్యాసం ప్రత్యేకత. అందుకే ప్రత్యేకంగా వ్యాసాలు రాసిన వ్యాసరచయితల్ని అలా ఉంచితే, కవులూ, నాటకకర్తలూ, కథానవలా రచయితలూ కూడా చాలామంది వ్యాసాలు రాసినవారే. వ్యాస ప్రక్రియను సుసంపన్నం చేసినవారే.

శిల్పం అనేమాటను సాధారణంగా కవితా శిల్పం, కథాశిల్పం, నవలా శిల్పం, నాటక శిల్పం అని సృజనాత్మక ప్రక్రియలకే ఉపయోగిస్తాం. విమర్శనా శిల్పం అని కూడా ఒక పుస్తకం (వల్లంపాటి వెంకట సుబ్బయ్య) వచ్చింది. కానీ వ్యాస శిల్పం అని ఎవరూ రాసినట్టు లేరు. శిల్పం అనేది కొన్నిటికే పరిమితమా? అన్నిటికీ సంబంధించింది కాదా? అసలు శిల్పం అంటే ఏమిటి? ఇవే ప్రస్తుత వ్యాసంలో చర్చనీయాంశాలు.

రచనలలో విషయాన్ని చెప్పే తీరునే శిల్పం అనొచ్చు. చెప్పే విషయం ఏదైనా, చెప్పేతీరు బాగా లేకపోతే అది పాఠకుల మనసుకెక్కదు. మనసు కెక్కించడానికి ఉపయోగపడేది ఏదైనా శిల్పమే అవుతుంది. చెప్పేతీరు ఆసక్తికరంగా ఉండడానికి అందరు రచయితలూ ఒకే రకమైన శిల్ప చాతుర్యాన్ని ప్రదర్శించరు. ఎవరి శిల్ప నైపుణ్యం వారిదే. ఒకే రచయిత కూడా తన శిల్ప నైపుణ్యాన్ని మార్చుకుంటూ, పెంచుకుంటూ పోవచ్చు. విషయాన్ని బట్టి, సందర్భాన్ని బటి&, పాఠకులను బట్టి కూడా అవసరమైన శిల్ప పద్ధతిని ఎంచుకోవచ్చు. కాబట్టి శిల్పం అనేది ఒక ముద్దకాదు, ఒక మూస కాదు. శిల్పంలో ఎంతవైవిధ్యం అయినా ఉండొచ్చు.

కొన్ని రచనలలో అసలు శిల్పం ఉన్నట్టే కనబడదు. కాని ఆరచనలు పాఠకులకు ఆసక్తికరంగానే ఉండొచ్చు. అదొకరకమైన శిల్పం. ఇంగ్లీషులో "Art lies in onceiling the art" అని ఒకమాట ఉంది. ఇక్కడ art అనే మాట శిల్పం అనే అర్థంలో ప్రయోగించబడింది. అంటే శిల్పాన్ని పైకి కనబడనీయకుండా దాచి ఉంచడంలోనే అసలు శిల్పం ఉందని అర్థం. కొడవటిగంటి కుటుంబరావు సాహిత్యం దీనికి మంచి ఉదాహరణ. ఒక రచన చదివింతర్వాత "ఎంత బాగా చెప్పాడు!" అని అనిపిస్తే అక్కడ శిల్పం పైకి కూడా కనిపిస్తున్నట్టు లెక్క. "ఎంత మంచి విషయం చెప్పాడు!" అని అనిపిస్తే అక్కడ శిల్పం పైకి కనిపించకుండా దాగి ఉన్నట్టు లెక్క. శిల్పం శిల్పం కోసం కాదు, విషయం కోసం. పాఠకుడి మనసును విషయం మీద కేంద్రీకరింజెయ్యడమే శిల్పం ప్రయోజనం. నాటకం చూస్తున్నప్పుడు డైలాగులు బాగున్నాయనో, డైరక్షన్ అద్భుతంగా ఉందనో, నటన ఎక్స్‌లెంట్ అనో అనిపించిందంటే నాటక శిల్పం కొట్టొచ్చినట్టు కనిపించి ప్రేక్షకుల దృష్టిని ఆకర్షించిందనుకోవాలి. అంతేగాని, ఆ అన్ని రకాల నైపుణ్యాలూ విషయాన్ని ప్రేక్షకుల మనసు కెక్కేటట్టు చెయ్యలేకపోయాయనే అర్థం. అయితే అందరూ అన్ని సందర్భాలలో ఇటువంటి శిల్పాన్ని తమ రచనలలో చొప్పించడం అంత తేలికయిన పని కాదు.

రచన అన్నప్పుడు కథ, నవల, కవిత, నాటకం వగైరాలే కాదు, వ్యాసం కూడా ఆ పరిధిలోకి వస్తుంది. కాబట్టి వ్యాసరచనలో కూడా శిల్పం ఉంటుందన్న మాట. తెలుగులో వ్యాస రచన బాగా అభివృద్ధి చెందుతున్న దశలో ముని మాణిక్యం నరసింహారావుగారు "ఇపుడు ఆంధ్రవాఙ్మయ ప్రపంచమున వ్యాస రచనా శిల్పము క్రొత్త క్రొత్తకళలతో తళుకొత్తు చున్నదనుట నిర్వివాదాంశము" అని వ్యాసరచనా శిల్పం అనే మాటను ప్రయోగించాడు.

వ్యాస రచనా శిల్పాన్ని రెండు భాగాలుగా విభజించుకోవచ్చు. మొదటిది వ్యాసరచనలో విషయాన్ని వివరించేతీరు. ఇది మళ్ళీ అనేక రకాలుగా ఉంటుంది. భాష, శైలి, పదబంధాలు, జాతీయాలు, సామెతలు, అలంకారిక ప్రయోగం, వాక్య విన్యాసం మొదలైనవి ఈ కోవలోకి వస్తాయి. వీటిని ప్రయోగించడంలో కూడా మళ్ళీ ఎవరి పద్ధతి వారిదే. ఎవరి శక్తియుక్తులు వారివే. ఇక రెండోది మొత్తం వ్యాసానికి సంబంధించింది. వ్యాసంలోని విషయం చెప్పడానికి వ్యాసకర్త అనుసరించే వ్యూహం, ఎత్తుగడ, నిర్మాణం మొదలైనవి ఇందులో భాగాలు. ఈ విషయాన్ని మరో వ్యాసంలో పరిశీలిద్దాం.

మొదటే చెప్పుకున్నట్టుగా ఇవన్నీ ఉండీ, లేనట్టుగా కనిపిస్తూ, విషయంపైకి దృష్టి మళ్ళించే పద్ధతి ఉత్తమ వ్యాస రచనా శిల్పం అవుతుంది. అది ఎవరికో, ఎక్కడో గాని సాధ్యంకాదు. ఇది నూటికి నూరుపాళ్ళు నెరవేరాలంటే ఆదర్శ ప్రాయమే అవుతుంది. పై లక్షణాలలో ఏకొన్ని ఉన్నా ఆ వ్యాసాలను మనవి గొప్ప వ్యాసాలుగా చెప్పుకుంటున్నాం. ఒక్కొక్క వ్యాసరచయిత కొన్ని కొన్ని లక్షణాలను తనకు నచ్చిన పద్ధతిలో అనుసరించడం వల్ల ఒక్కొక్కరి వ్యాసాలు ఒక్కో పద్ధతిలో ఆసక్తిని కలిగిస్తూ వైవిధ్యంతో కూడి ఉంటున్నాయి. ఒక్కోసారి ఈ లక్షణాలేవీ లేకపోయినా, విషయం క్లిష్టంగా ఉన్నప్పుడు, అది అర్థమయ్యే

---

ఏప్రిల్ 1997లో గాల్డన్ జీసస్ డాస్‌సాన్‌టోస్ అనే మూలజాతి నాయకుడు, బ్రెసిల్లాను సందర్శించినపుడు అతను బస్‌స్టేషన్‌లో నిద్రపోతుంటే ఉన్నత కుటుంబాలకు చెందిన 5గురు కుర్రాళ్ళు, అతనిపై ఆల్కహాల్ చల్లి అగ్గిపెట్టారు. సజీవ దహనం చేశారు. "మేం అతన్ని భిక్షగాడనుకున్నాం" అని వారు తమ పనిని సమర్థించుకున్నారు. ఒక సంవత్సరం తర్వాత వారికి తేలికైన శిక్షపడింది. అయినా అది వారు ముందుగా అనుకొని చేసిన హత్యకాదుగదా! ఫెడరల్ జిల్లాకోర్టు అధికార ప్రతినిధి చెప్పినట్టుగా, ఆ బాలురు, వారు తమ వెంట తెచ్చుకున్నత ఆల్కహాల్‌లో కొంత మాత్రమే వినియోగించారంటే, వారు "చంపాలనే ఉద్దేశ్యంతో కాకుండా, కేవలం సరదా కొరకు అలాచేశారని" రుజువయింది. బ్రెజిల్ ఉన్నత వర్గాల పిల్లలకు భిక్షువులను సజీవంగా దహనం చేయడం అనేది ఒక సాధారణ క్రీడ; కాని ఆ వార్తలు సామాన్యంగా దినపత్రికలకు చేరవు.

వీధిబాలలు, తిరుగుబోతులు, బిచ్చగాళ్ళు, వ్యభిచారులు స్వలింగ సంపర్కులు, జేబుదొంగలు, అప్పుడప్పుడూ దొంగతనాలు చేసేవారు, మాదకద్రవ్యాలు తీసుకునేవారు, తాగుబోతులు 1993లో "సామాజిక శుభ్రత దళాలు" బిచ్చగాళ్ళకు చంపుతున్నారని, ఆ తర్వాత ఆ శవాలను బారన్ క్విల్లా ఫ్రీయూనివర్సిటి వైద్య విద్యార్థులకు ప్రయోగాలకై అమ్ముతున్నారనే వార్త సంచలనాన్ని సృష్టించింది. దీంతో, ఆ బృందం పెద్ద యెత్తున నిరాశన ప్రదర్శన చేసింది. ఆ ప్రదర్శనలో మాట్లాడుతూ, కథారచయిత నికోలస్ బ్యూనానెంచూరా, దేవుడు సృష్టిస్తున్నపుడు ప్రతిసారి, కొంత మిగులు మిగులుతుంది. సూర్యచంద్రులు, కాలం, ప్రపంచం, సముద్రాలు, అడవులు ఆయన సృష్టిస్తున్నపుడు, మిగులును ఆయన అధోలోకానికి విసిరివేసేవారు. కాని, దేముడు, అస్థిరచిత్తుడు కాబట్టి, పురుష, స్త్రీల సృష్టిని మరిచాడు. అందువల్ల, వారికి వారే సృష్టించుకో తప్పలేదు. ఇక, పాతాళలోకంలోని, చెత్తకుండీలో, అట్టడుగున, మొదటి పురుషుడు, మొదటి స్త్రీ, దేముని విసరివేసిన మిగులు నుండి వేరే సృష్టించుకున్నారు. మనం 'చెత్త' లో నుండి పుట్టాము. అందువల్లనే మనకు కొంతకాలం పగలు, కొంతకాలం రాత్రి వుంది. మనకు కాలం, భూమి, నీరు, గాలి ఆ రచయిత ఈ వ్యవస్థ వాస్తవంలో యెలా సృష్టించబడిందో చెప్పాడు.

*

రీతిలో సులభశైలిలో చెపగలిగితే అదే గొప్ప వ్యాసం కావచ్చు. విషయం అర్థం చేసుకోవడం కష్టమైనదనే ఆలోచన పాఠకులలో ఉండి, చదవగానే అర్థమయ్యేట్టయితే, అర్థంగావడమే అక్కడ ఆసక్తి కలిగించే అంశం అవుతుంది. కష్టమైనదాన్ని సులభతరం చెయ్యగలిగిన భాషాశైలి కూడా ఆ వ్యాసంలో గొప్ప శిల్పం అవుతుంది. కాబట్టి వ్యాసరచనా శిల్పం ఇలా ఉంటుంది, ఇలా ఉండాలి అని కచ్చితంగా చెప్పడం కుదరదు. కాకుంటే ఏ వ్యాసకర్త ఏ వ్యాసంలో ఏరకమైన శిల్పాన్ని ప్రయోగించాడో వివరించవచ్చు.

వ్యాస రచనలోని కొన్ని శిల్ప రీతులను పరిశీలిద్దాం. సాధారణంగా పునరుక్తిని దోషంగా చెబుతారు. ఒకే పదాన్ని అనేకసార్లు ప్రయోగించడం పునరుక్తి. అయితే దోషంగా భావించే ఈ పునరుక్తిని కూడా ఒక శిల్ప చాతుర్యంగా ఉపయోగించవచ్చు. "ఉత్తమ వాక్యం ఉత్తమశైలికి ఉత్తమ సోపానం" అని కొలకలూరి ఇనాక్ తన 'తెలుగు వ్యాస పరిణామం' గ్రంథంలో అన్నాడు. ఈ వాక్యంలో 'ఉత్తమ' అనే మాట మూడుసార్లు వచ్చింది. అయితే అది ఇక్కడ దోషంగా అనిపించదు. ఒక వింత వాక్య విన్యాసంగా కనిపిస్తుంది. 'ఆ సమాజంలో బతకాలంటే కావలసినవి మూడు. ఒకటి డబ్బు, రెండు డబ్బు, మూడు డబ్బు' అనే వాక్యంలో కూడా పునరుక్తి ఉంది. డబ్బే ప్రధానం అనుకునే వ్యక్తి ఆ భావాన్ని శక్తివంతంగా చెప్పిన పద్ధతి ఇందులో కనిపిస్తుంది. ఈ టెక్నిక్‌ను అనేక సందర్భాల్లో వాడుకోవచ్చు. 'మంచి వ్యక్తిగా బతకాలంటే కావలసినవి మూడు. ఒకటి నిజాయితీ, రెండు నిజాయితీ, మూడు నిజాయితీ' అని కూడా అనొచ్చు.

మామూలు మాటలతోనే ఒక్కోసారి అనుభూతి ప్రధానంగా, ఆర్ద్రంగా చెప్పొచ్చు. "అక్కడికి నేను మొదటిసారి మా తాతయ్యగారితో వెళ్ళాను. అతనక్కడే, ఉండి పోయాడు. నేను స్నానం చేసి తిరిగి వచ్చాను." ఇవి శ్రీశ్రీ మాటలు. తాతకు శ్మశానంలో అంత్యక్రియలు జరిపి వచ్చిన సందర్భాన్ని శ్రీశ్రీ చెప్పిన తీరు హృదయాన్ని కదిలిస్తుంది. మొదటి వాక్యంలో పాఠకులు విషయాన్ని ఊహించలేరు. ఆ తర్వాతి రెండు చిన్న వాక్యాలలో విషయం అర్థంగావడమే గాక గుండె బరువెక్కుతుంది.

"పిల్లలకోసం సినిమాలు ప్రత్యేకంగా తియ్యాలని అంటుంటారు. మనవాళ్ళు తీస్తున్న సినిమాలన్నీ పిల్లల సినిమాలే గదా!" ఇవి కొడవటి గంటి కుటుంబరావు మాటలు. చదవగానే మొదట షాక్‌కు గురవుతాం. ఆ వెంటనే విషయం అర్థమై మనం ఊహించని కోణం నుండి రచయిత చేసిన ఆలోచనకు ఆశ్చర్యపడతాం. పిల్లలకోసం సినిమాలు తియ్యాలని చాలామంది అనడం మనకు తెలిసిన విషయమే. మరి తీస్తున్న సినిమాలన్నీ పిల్లల సినిమాలే అనడంలో ఆంతర్యం ఏమిటి? పెద్దల సినిమాలకూ, పిల్లల సినిమాలకూ ఉన్న తేడా విషయంలో కుటుంబరావు దృక్పథమే వేరు. మన సినిమాలలో హీరో సర్వశక్తిసంతుడు. అన్ని మంచి లక్షణాలూ ఆయనలోనే ఉంటాయి. విలన్ పరమ దుర్మార్గుడు. అన్ని అవలక్షణాలూ అతనిలోనే ఉంటాయి. చివరకు విలన్ ఓడిపోయి హీరో గెలుస్తాడు. నూటికి తొంభై తొమ్మిది సినిమాలలో ఇదే వరస. మంచి చెడ్డలు స్పష్టంగా వేరువేరుగా ఉండడం, చివరకు మంచి గెలవడం - ఇవి పిల్లల కథల్లో, సినిమాల్లో ఉండవలసిన లక్షణాలు. పైకి మంచిగా ఉంటూ, లోపల్లోపల కుట్రలు పన్నడం లాంటి సంక్లిష్ట మనస్తత్వాల్ని అర్థం చేసుకోవడం పిల్లలకు కష్టం. అందుకని హీరో మంచికి సంకేతంగా, విలన్ చెడ్డకు ప్రతీకగా ఉండాలి. ఈ సమాజంలో నిజాయితీగా బతకాలనుకున్న వాడికి అడుగడుగునా కష్టాలే. సమాజాన్ని దోచుకుంటున్న వాళ్ళు సుఖ భోగాలతో ఉంటారు. అనేక సందర్భాల్లో న్యాయం ఓడిపోతూ ఉంటుంది. ఇలాంటి సన్నివేశాలు పిల్లలకు నిరాశా నిస్పృహల్ని కలిగిస్తాయి. కాబట్టి మంచి, న్యాయం గెలిచితీరాలి. మనవాళ్ళు తీసే సినిమాలన్నీ ఇలాగే ఉంటాయి కాబట్టి ఇవన్నీ పిల్లల సినిమాలే అని కుటుంబరావు చమత్కారం. నిజానికి పిల్లల సినిమాలు ఇలాగే ఉండాలని ఆయన ఉద్దేశం కాదు. ఇవి పెద్దల సినిమాలు మాత్రం కావనేది ఆయన అభిప్రాయం. రెండు వాక్యాలలోనే ఇంత భావాన్ని ఇమడ్చడం, మన మెదళ్ళకు పదును పెట్టడం కుటుంబరావు చెప్పే తీరులోని ప్రత్యేకత.

"రేపు సూర్యుడు పడమట పొడిచి, శ్రీశ్రీకి జ్ఞానపీఠం వారు లక్షరూపాయలు బహూకరించినా, ఆ బహూకృతి కన్నా శ్రీశ్రీయే ఎత్తున ఉంటాడు. ఇందులో సందేహం లేదు. శ్రీశ్రీ కన్నా మిన్న ఏదన్నా ఉంటే అది శ్రీశ్రీ కవిత." ఇవి కూడా కుటుంబరావు మాటలే. చాలా సహజంగా, అలవోకగా చెప్పినట్టున్న ఈ వాక్యాలలో ఎంతో అర్థం ఉంది. శ్రీశ్రీకి జ్ఞానపీఠం అవార్డు రావడమనేది సూర్యుడు పడమటి దిక్కున ఉదయించడమంత అవాస్తవం. ఒకవేళ వచ్చినా అది శ్రీశ్రీ కంటే గొప్పది కాదు. శ్రీశ్రీ కంటే గొప్పది ఒక్కటే, అది శ్రీశ్రీ కవిత్వం. శ్రీశ్రీ కమ్యూనిస్టు కవి కాబట్టి ఆ అవార్డు శ్రీశ్రీకి ఇవ్వరు. సంప్రదాయ కవి కాబట్టి విశ్వనాథ సత్యనారాయణకు ఇచ్చారు. అవకాశవాద కవి కాబట్టి ఆ తర్వాత సినారేకూ ఇచ్చారు. వ్యక్తిగా శ్రీశ్రీలో ఎన్నో బలహీనతలున్నాయి. అందువల్ల శ్రీశ్రీ కంటే శ్రీశ్రీ కవిత్వం చాలా గొప్పది. ఆ మూడు వాక్యాలలో ఇంత అర్థం ఉంది. సూర్యుడు పడమటి దిక్కున పొడవడం అనే ఒక అసాధ్యమైన విషయంతో ప్రారంభమైన వాక్య నిర్మాణం ఇక్కడ గుర్తించదగింది. ఈ వాక్య నిర్మాణాన్ని మార్చి అదే విషయాన్ని చప్పగా చెప్పొచ్చు.

గ్రాంధిక భాషలో రాసినా, అద్భుతమైన వాక్య విన్యాసం ఉన్న వ్యాస రచయిత రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ. సారస్వతా లోకము, వేమన అన్నవి వీరి ప్రసిద్ధ వ్యాస సంకలనాలు. సారస్వతా లోకంలో ఒక వాక్యం చూడండి - "నాచన సోమనాథుని కవిత్వ మంత యుత్తమ జాతికిఁజేరదని చెప్పసాహసించి పలువురు పండితుల మనసు నొప్పించిన యపరాధిని నన్నే మీరీనాడు అతని జయంత్యుత్సవములో అధ్యక్షునిగానెన్నుకొని సాహిత్య ప్రపంచ మందు మీకుఁ గల స్వాతంత్ర్య రసికతను వెల్లడించితిరి." వాక్య నిర్మాణం ఎంత వయ్యారంగా ఉండవచ్చునో ఇదొక ఉదాహరణ. వాక్యం పెద్దదయినా, ఎంత అందంగా, ఎంత స్పష్టంగా ఉందో గమనించండి. చాలామంది పండితులు నాచన సోమన గొప్పదనాన్ని పొగిడారు. చిన్నయసూరి "అలికంబున నక్షిని డాచినట్టి సర్వజ్ఞుని నాచన సోమనాథుస్తుతి యొనరింతున్" అన్నాడు. "ఒకడు నాచన సోమన...." అన్న వ్యాసంలో విశ్వనాథ సత్యనారాయణ సోమన కథా సంవిధానాన్నీ, ఇతర విశేషాలనూ తెలియజేశాడు. అలా పండితుల చేత ప్రశంసలందుకొన్న సోమన గురించి చెబుతూ ఆయన రాసిన ఉత్తరహరిశంశం కావ్యం ఎఱ్ఱన రాసిన హరివంశానికి అనుకరణ అని రాళ్ళపల్లి తేల్చేశాడు. పండితాభిప్రాయానికి భిన్నంగా చెప్పడం సాహసమే. అయినా నాచన సోమన జయంతిసభకు తననే అధ్యక్షుడిగా ఎన్నుకోవడం, ఎన్నుకొన్న వారి 'స్వాతంత్ర్య రసికత' అవుతుందేగాని తన గొప్పదనం కాదట! నిజానికది తన గొప్పదనమనే చెప్పుకోవడం. ఆత్మస్తుతి ఉన్నా, అది లేనట్టు కనిపించేంత మర్యాద పూర్వకమైన వాక్య విన్యాసం.

పానుగంటి లక్ష్మీనరసింహారావు సాక్షి వ్యాసాలలోని శిల్ప రహస్యం అధిక్షేపం - సెటైర్. హాస్యం, వ్యంగ్యం, ఆవేదన అన్నీ కలిసుంటాయి. తెలుగువాడయ్యుండి తెలుగులో మాట్లాడలేనని ఆంగ్లంలో మాట్లాడిన సందర్భాన్ని అధిక్షేప పద్ధతిలో విమర్శనాత్మకంగా చెబుతాడు. 'స్వభాష' అనే వ్యాసంలోనివి ఈ వాక్యాలు: "వీర లాంధ్రమున మాటలాడ లేకపోవుట యేమి? లేకపోవుటయనగా నాకేమో బోధపడలేదు. మ్యావుమని కూయలేని పిల్లి యెచ్చటనైన నుండునా? కిచకిచలాడలేని కోఁతిని మీరెచ్చట నైనఁజూచితిరా? ఈఁతరానికప్ప యేదేశమందైన నుండునా? పుట్టగానే క్యారుమనలేని బిడ్డ చచ్చినదనుటకేమైన సందేహమా? ఆంధ్రదేశమునఁబుట్టిన పక్షులైన ననవరత శ్రవణమున నాంధ్రమున మాటలాడుచుండగా - అయ్యయ్యో! మనుజుఁడే - అంత మనుజుఁడే - ఆంధ్ర మాతాపితలకు ఁబుట్టిన వాఁడే - ఆంధ్రదేశీయ వాయు నీరాహార పారణ మొనర్చిన వాఁడే- అధమాధమ మూరు సంవత్సరముల యీడు వఁఱకైన నాంధ్రమున మాటలాడినవాఁడే - అట్టి మాఁడాంగ్లేయ భాష నభ్యసించినంత మాత్రమున నిప్పుడాంధ్రమున మాటలాడ లేకుండునా? ఆశ్చర్యము. అవిశ్వాసనీయము. అసత్యము. ఆంధ్రమున నాతనిని

మాటలాడకుండాజేసినది అశక్తికాదు. అనిష్టత - అసహ్యత...". ఇదీ పానుగంటి వ్యాస రచనా శైలి. ఈ సాక్షి వ్యాసాలలో శైలీ శిల్పం గమనించదగింది. హాస్య వ్యంగ్యాలతో బాటు, ఆవేదన, ఆవేశం ఆయన భావాలకు ఊపునిస్తాయి. ఒకే భావాన్ని చెప్పడానికి అనేక రకాల పోలికలు తీసుకురావడం, ఒకే అర్థాన్నిచ్చే అనేక పదాలనుపయోగించడం ఇందలి ప్రత్యేకతలు.

ఏవిషయాన్నైనా హాస్య ధోరణిలో రాయగల శక్తి కొందరి సొత్తు. భమిడిపాటి కామేశ్వరరావు వ్యాసాలు ఇందుకుదాహరణ. ఉదాహరణకు రెండు వాక్యాలు:

"ఆయనకి స్థిరాస్తి భార్య, చరాస్తి తనే."

"కావలసినంత బలం వుంది రైలుకి. అన్ని పుట్ల ఇనపసామగ్రి కూడా ఒక్క నరమానవుడు ఎల్లా లచెబితే అల్లా వింది."

మొదటి వాక్యంలో చెప్పదల్చుకున్న విషయం ఆయనకి ఆస్తిపాస్తులేవీ లేవని, ఉన్నది భార్యా, తనేనని, ఆమె ఇంట్లో నుంచి బయటకు రాదని మనుషుల్ని ఆస్తులుగా మార్చి చెప్పడం వల్ల హాస్యం పుట్టింది. రెండో వాక్యంలో ఇలాంటిదేమీ లేదు. రైలును ఇనప పదార్థంగానే, డ్రైవర్‌ను మనిషిగానే చెప్పి చమత్కారాన్ని సాధించాడు. అయితే ఈధోరణి ఎక్కువగా వ్యాసాలలో కంటే కథల్లో, నవలల్లో ఉపయోగపడుతుంది.

వ్యాసాలలో ఒక విషయాన్ని వివరించిం తర్వాత దానికి సమర్థనగా జనరల్ స్టేట్‌మెంట్ల లాంటివాటిని చేర్చడంతో ఆ విషయానికి విలువ పెరుగుతుంది. ఇలాంటి వాక్యాలు రాయడంలో ఆధునిక విమర్శకులలో రాళ్ళపల్లి, విప్లవ విమర్శకులలో త్రిపురనేని మధుసూదనరావు ముఖ్యులు.

"అల్పత్వమునకు రసికుల బ్రతుకులో చోటు లేదు."

"పరదూషణము పండలపాలిటి బ్రహ్మాస్త్రము."

"దక్షత మనము చేతులార సంపాదింపవలసిన వస్తువుగాని పుట్టుకచే వచ్చునది కాదు."

ఇవి రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ 'సారస్వతాలోకము' వ్యాస సంపుటిలోని వాక్యాలు.

"విప్లవం అంటే మార్పు అని అర్థం."

"ప్రజలంటే ఎవరు? ఎవరికి చైతన్యం వుందో వారే ప్రజలు."

"ప్రజల పక్షాన నిలబడి విమర్శకుడు కవిని పరిశీలిస్తాడు. కవి పక్షాన నిలబడి ప్రజలకు కవిహృదయాన్ని పరిచయం చేస్తాడు."

ఇవి త్రిపురనేని మధుసూదనరావు 'కవిత్వం - చైతన్యం' వ్యాసం సంపుటిలోని వాక్యాలు. ఇవి నూటికి నూరుపాళ్ళు పూర్తి సత్యాలు కాకపోవచ్చు. కానీ ఆయా సందర్భాలలో ఇలాంటి వాక్యాలు వ్యాసంలోని విషయానికి బలాన్ని కలిగిస్తాయి.

సాధారణంగా భాషలో ఏప్రయోగాలు సహజమైనవి కావనుకుంటామో, ఒక్కోసారి ఆ ప్రయోగాలు భావప్రకటనా శక్తికి నిదర్శనాలవుతాయి. దీనికి మంచి ఉదాహరణ కర్మణి ప్రయోగం. అంటే కర్మ ప్రధాన వాక్యాలలో 'బడు' క్రియాపదాన్ని ప్రయోగించడం. 'ఇది నాచేత రాయబడింది' లాంటి వాక్యాలు. ఈ 'బడు' ప్రయోగం తెలుగుభాషకు సహజమైనది కాదు. సంస్కృతంలో, ఇంగ్లీషులో ఇది చాలా సహజం. తెలుగు నుడికారాన్ని చంపే వాటిలో ఇదొకటి. దీని గురించి రంగనాయకమ్మ, చేకూరి రామారావు లాంటి వాళ్ళు చాలా చర్చచేశారు. బడు ప్రయోగం చేసేవాళ్ళు బడుద్దాయిలని ఒకరు. బడు ప్రయోగం తెలియని వాళ్ళే బడుద్దాయిలని మరొకరు అనడం వరకూ వెళ్ళాయి ఆ చర్చలు. అయితే ఎలాంటి సందర్భంలోనూ 'బడు' ప్రయోగం పనికి రాదనడం సరైంది కాదనే అనిపిస్తుంది. 1970 జులై 10న వెంపటాపు సత్యాన్ని పోలీసులు బూటకపు ఎన్‌కౌంటర్‌లో చంపినపుడు ఒక రచయిత అన్న మాటలు- "సత్యం చావలేదు, చంపబడ్డాడు." అని. ఇక్కడ 'బడు' ప్రయోగం ఎంత శక్తిమంతంగా [illegible] వివరించనక్కరలేదు. ఈ వాక్యాన్నే - "సత్యం చా[illegible]ము, బ[illegible] ఎన్‌కౌంటర్‌లో చంపేశారు" అని రాస్తే భావ ప్రకటన ఎంత బలహీనపడుతుందో

తెలుస్తుంది.

తెలుగులో 'అట' ప్రయోగం ఒకటుంది. వ్యంగ్యంగా తీవ్ర విమర్శ చేసేటపుడు ఇది బాగా పనికొస్తుంది. కొన్నేళ్ళ క్రితం విద్యుత్ చార్జీలు తగ్గించాలని ఆందోళన చేసినపుడు, ఆందోళనలు శాంతియుతంగా చేసుకోండని ప్రభుత్వ విజ్ఞప్తికి సమాధానంగా ఒక పత్రికలో రాసిన వాక్యాలు - "ఆందోళనల వల్ల శాంతి భద్రతల సమస్య ఉత్పన్నమవుతున్నదట. అందువల్ల ఆందోళనలు విరమించుకోవాలట. శాంతి భద్రతలకు విఘాతం కలగకుండా ఆందోళన చేసుకోవాలట. అంతేగాని ప్రభుత్వం విద్యుత్ చార్జీల భారం తగ్గించదట."

ప్రశ్నల పరంపర కూడా భావాన్ని పాఠకుల మనసుల్లోకి బలంగా ఎక్కించడానికి ఉపయోగపడుతుంది. ఈ వాక్యాలు చూడండి-

"ఏం చేశారని నక్సలైట్లను చంపుతున్నారు? వాళ్ళు అక్రమంగా కోట్లు సంపాదించుకున్నారా? పేదల్ని దోచుకుంటున్నారా? స్త్రీలపై అత్యాచారాలు చేస్తున్నారా? దేశాన్ని విదేశాలకు అమ్మేస్తున్నారా?"

నిజానికి ఈ పనులన్నీ దోపిడీదారులు, పాలక వర్గాలు చేసే పనులు. అలాంటి పనులు నక్సలైట్లు చేస్తున్నారా అని ప్రశ్నించడం వల్ల ఇక్కడ భావావేశం కలుగుతుంది. అంతేగాదు, పాలక వర్గాలు చేసే పనులవల్లనే నక్సలైట్లు పోరాటాలు చెయ్యవలసి వస్తోందని సాధారణ పాఠకుల చేతకూడా ఆమోదింప జేసినట్టవుతుంది.

ఈ విధంగా రచనాశిల్పం అనేది ఎన్ని విధాలుగానైనా ఉంటుంది. వీటన్నిటినీ ఒకే రచయిత ఒకే వ్యాసంలో ప్రయోగించడు. వ్యాసంలోని విషయాన్నిబట్టీ, సందర్భాన్ని బట్టీ, దాని పాఠకులను బట్టీ శిల్పరీతులు మారతాయి. సూటిగా, సులభంగా, బలంగా, ఆకర్షణీయంగా భావ ప్రకటన చెయ్యడానికి వీటిని సందర్భోచితంగా వ్యాసకర్తలు ఉపయోగించుకోవడం అవసరం. ఇవేకాదు, ఇంకా ఎన్నో కరాల టెక్నిక్కులను ఉపయోగించుకోవచ్చు.

బాగా రాయడం అంతతేలికయిన పనికాదు. అంత మాత్రాన అది అసాధ్యమైనదీ కాదు. సాధనవల్ల రచనాస్థాయిని పెంచుకోవచ్చు. వ్యాస రచనా సౌధాన్ని నిర్మించడంలో శ్రమ ఉంది. అయితే ఆ శ్రమలో ఆనందం, తృప్తి ఉంటాయి.

ఇప్పటికే వ్యాస ప్రపంచంలో ఉన్న వ్యాస రచనా శిల్ప రీతులను తెలుసుకుని తన వ్యాసరచనలో ఉపయోగించుకునే వాడు మంచి వ్యాసకర్త. ఈ శిల్పరీతులను స్వయంగా సృష్టించుకో గలిగిన వాడు అంతకంటే గొప్ప వ్యాసకర్త. *

## వివరణ

జనవరి 2008 సంచికలో మహాసభల రిపోర్ట్‌లో కొన్ని పొరపాట్లు దొర్లినందుకు విచారిస్తున్నాం. ఇకముందు అలా జరగకుండా తగు జాగ్రత్తలు తీసుకుంటాం.

- సంపాదకవర్గం

వ్యాసం

❖ ప్రొ. ఘంటా చక్రపాణి

# కులం-శ్రమ-సంస్కృతి - నాగరికత

*(21వ విరసం రాష్ట్ర మహాసభల్లోని ప్రసంగానికి పూర్తి పాఠం)*

కొడవటిగంటి కుటుంబరావుగారు చెప్పినట్టు "జీవితాన్ని ముందుకు నడిపించడానికి ఉపయోగపడే జ్ఞానమే సంస్కృతి". అంటే సంస్కృతి ప్రజలను నడిపించే సాధనం. ప్రజలకు సమాజానికీ మార్గ నిర్దేశం చేయగలిగే జ్ఞానరాశి, దాని ఆధారంగా సమస్త వస్తు సంపదనీ సృష్టించుకున్న మనిషి తాను సృష్టించుకున్న సంస్కృతి వెలుగులో ఒక సుస్థిరమైన సుందరమైన వ్యవస్థకోసం కలలుగంటూ వచ్చాడు!

మానవ పరిణామ క్రమంలో మనిషికి సంస్కృతి తనను తాను సంస్కరించుకునే ఒక సాధన సంపత్తిగా మారిపోయింది. మనిషి జీవిత అనుభవాలనుంచి, పాఠాలను రాని, ఆలోచనల నుంచి తనకూ తన చుట్టూరా వున్న సమాజానికి ఏది అవసరమో దాన్ని సృష్టించుకుంటూ ఈ జ్ఞాన రాశిని ప్రోగుచేసుకుంటూ వచ్చాడు. దాని ఆధారంగా అవసరమైన పనులు, పనిముట్లు, వస్తుసంపదతోపాటు తనుకూ, తన సమాజానికి అవసరమైన ఆటలు, పాటలు - సాహిత్య, సంగీత, కళాకృతులను -మనిషి వికాసానికి, సామాజిక పురోగతికీ అవసరమైన విలువలను, పద్ధతులను ధోరణులను, ప్రక్రియలను సృష్టించుకుంటూ వచ్చాడు. అలా మనిషి మేధస్సులోంచి, ఆలోచనల్లోంచి, అవసరల్లోంచి, శ్రమలోంచి ఈ విశాలప్రపంచము, అందలి సముదాయాలు, వాటి మధ్య సంబంధాలు - అనుబంధాలు, పరస్పర చర్యలు మొత్తం సామాజిక వ్యవస్థ రూపుదిద్దుకోవడానికి దోహదపడ్డాయి. ఈ మొత్తం ప్రక్రియకు సంస్కృతి ఒక పునాదిగా పనిచేసింది. మనిషి, అతని శ్రమ, అతని పని, ఆలోచనల్లోంచి వచ్చిన ఈ సాంస్కృతిక సంపద ఎందుకని అతనికే ఎదురుతిరుగుతున్నది? మనిషిని నడిపించే ఈ జ్ఞానరాశి కొందరిని కదలనీయకుండా ఎందుకని కట్టిపడేస్తున్నది? అంతా కలిసికట్టుగా బతికే సామాజిక వ్యవస్థ నిర్మాణానికి ఉపయోగపడాల్సిన సంస్కృతి ఎందుకని సామాజిక విచ్ఛిన్నకారిగా, సామాజిక విధ్వంసక శక్తిగా ఎలా మారిపోతున్నది. ముఖ్యంగా భారతీయ సంస్కృతి ఎందుకని పరిణామ సిద్ధాంత క్రమానికి భిన్నంగా మనుషుల మధ్య, సమూహాల మధ్య సహజ శ్రమ సంబంధాల మధ్య అంతరాలను, అసమానతలను, ఆధిపత్యధోరణులను, అణచివేతను కొనసాగిస్తున్నది అన్నవి చాలా కాలంగా చర్చల్లో ఉన్న ప్రశ్నలు. ఈ మధ్యకాలంలో 'ఆజానాచ్లేలే' అనే పేరుతో విడుదలైన హిందీ సినిమా ఈ చర్చను మరోసారి ప్రజలముందుకు తెచ్చింది. ఈ సినిమాలోని ఒక పాటలో రచయిత తన సహజమైన ఆధిపత్య సాంస్కృతిక ధోరణిని, కుల స్వభావాన్ని బయటపెట్టుకుంటూ ఒక పాటను రాశారు. ఒక అమ్మాయి తన ఆకర్షనను గురించి చెపుతూ తను రోడ్డుమీదికి వస్తే చెప్పులు చేసుకునే మోచీ(మాదిగ) వాడు కూడా బంగారం చేసే కంసాలివానిగా ఫోజులు కొడతాడని' పాడుతుంది. ఇది సినిమా విడుదలైన రోజే పెద్ద వివాదానికి దారితీసింది. ఈ సినిమా తనమను, తమ శ్రమను కించపరిచేవిధంగా వున్నదని, దాన్ని నిషేధించాలని కోరుతూ దేశవ్యాప్తంగా దళితులు ఆందోళనకు దిగారు. అయితే అది పొరపాటని నిర్మాతలు ప్రకటించి, ఆ చరణాన్ని తొలగించడంతో గొడవ సద్దుమనిగింది.

నిజంగానే ఆ చరణం పాటలో ఉండడం వల్ల అవమానం జరిగిందా? ఆ భావన ప్రజల్లో లేదా అన్నది ఆలోచించాలి. ఒక ఆందోళన ద్వారా ఒక సినిమాలోని ఒక పాటనో, ఒక సన్నివేశాన్నో తొలగించగలం కానీ సమాజంలో, ప్రజల మనస్సుల్లో ఉన్న ఇదే భావనను ఎలా తొలగించగలం అన్నదీ ఆలోచించాలి. ఈ సంఘటన దళితుల ఆత్మగౌరవాన్ని, సంఘటిత శక్తిని చాటి చెప్పిందనడంలో సందేహంలేదు. కానీ ఇదే సంఘటిత చైతన్యం. ఆ భావజాలానికి వ్యతిరేకంగా ప్రజలను సమీకృతిల్ని చేయడంలో విజయం సాధించలేక పోతున్నది. సమాజంలోని మిగితాప్రజలు, అగ్రకులాలు బహిరంగంగా 'అది తప్పే' అంటూనే 'అది నిజమే కదా!' అన్న అభిప్రాయం కూడా వ్యక్తం చేస్తున్నఊఅనరు. బహిరంగ చర్చల సంగతి ఎలా వున్నప్పటికే సినిమా నిషేధించాలన్న చర్చపై ఇంటర్నెట్ బ్లాగుల్లో, సైబర్‌గ్రూపుల్లో, నలుగురు కలిసిన సందర్భాల్లో గుసగుసల్లో సాగిన సంభాషణల్లో 'అది నిజమే'నని, అందులో తప్పే మీలేదని, రచయిత కేవలం సమాజంలో ఉన్న భావనను వ్యక్తం చేశాడని, పాటను తప్పుపట్టడానికి ఏమీ లేదనే ఎక్కువ మంది అభిప్రాయపడ్డారు. ఒక రకంగా ఆలోచిస్తే ఈ రకమైన భావన చాలామందిలో వుంది. ముఖ్యంగా అగ్రకులాల్లో వారి వారి వృత్తి, వ్యాపకాలు, రాజకీయ ఆర్థిక అంతస్తులతో సంబంధం లేకుండా చాలామంది కులం చట్రంలోనే ఆలోచిస్తుంటారు. ఇది బహిర్ధంగంగా తరచూ వ్యక్తం చేస్తుంటారు కూడా.

రిజర్వేషన్ల విషయంలో ప్రభుత్వ నిర్ణయాన్ని వ్యతిరేకించడానికి అగ్రవర్ణ విద్యార్థులు రోడ్లను ఊడుస్తారు. బూట్లు పాలిష్ చేస్తారు ఈ చర్యల ద్వారా ఒక కులాన్ని ఒక వృత్తిని, ఒక శ్రమను అశ్రామిక వర్గ జీవనాన్ని ఎద్దేవా చేస్తుంటారు. వేల మేళ్లుగా ఈ పనులు హీనమైనవి. మనుషులు చేయదగినవికావు అన్న వెక్కిరింపు ఆచర్యల్లో వ్యక్తం అవుతుంటుంది. ఇదొక మానసిక ప్రవృత్తి, ఒక సామాజిక ధోరణి. ఈ సామాజిక ధోరణి తరచుగా సమాజంలోని అంతరాలను, ఆ అంతరాల్లోని సాంస్కృతిక వైరుధ్యాలను బయట పెడుతుంటుంది. చాలా సందర్భాల్లో అగ్రవర్గల ప్రజలు తమ మనోవైకల్యాలను, తమ దురలవాట్లను, తమలో ఉన్న బలహీనతల్ని చెప్పుకోవడానికి కూడా ఇతర నిమ్నకులాలను ఉటంకిస్తుంటారు. ఎదుగూబొదుగూ లేని పనిచేస్తున్నప్పుడో, పని చేయలేక పోయినప్పుడో 'మంగలిపని' అంటూ ఒక వృత్తిని, శ్రమను అపహాస్యం చేస్తుంటారు. అలాగే చాకలి పద్దు, మాలకాకి, మాదిగ పంచాయితీ, గొల్లకిరిమి (మూర్ఖత్వం) అంటుంటారు. తమకు నచ్చలేదని చెప్పడానికి 'చండాలం'గా వుంది అంటుంటారు కానీ 'చండాలం' అనేదొక కులమని, అలా అనడం ఆ కులాన్ని హీనపర్చడం అనీ అనుకోరు.

**కులం: మానసిక ప్రవృత్తి:**

కిందీ కులాలను, ఆ కులాల పనులను, శ్రమను వాటి సంస్కృతిని అవహేళన చేయడం, చిన్న చూపు చూడడం అనేది ఇవాల్టి సామాజిక మనోప్రవృత్తి. కుల సమాజంలో పుట్టి, పెరిగి అవే పునాదుల మీద బతుకుతున్న వాళ్లకు అంతకంటే భిన్నమైన, విశాలమైన మానసిక ధోరణి వుండదని పదే పదే రుజువవుతుంటుంది. హిందూమానసిక ప్రవృత్తి - మెదడు - ఆలోచన - సామాజిక వ్యక్తీకరణ ఎదిగింది అలాంటి విద్వేషాలమధ్యేనని ప్రముఖ సామాజిక, మనోవిజ్ఞాన శాస్త్రవేత్త సుధీర్ కొక్కర్ పేర్కొంటాడు. 'కల్చర్ ఆఫ్ వయిలెన్స్' అనే తన పుస్తకంలో ఆయన హిందూ సమాజపు psycho dynemic behaviour ను అంచనా వేసే ప్రయత్నం చేశాడు. హైదరాబాద్ మతకలహాల నేపథ్యంలో రాసిన ఈ పుస్తకంలో ముస్లింల పట్ల హిందువుల మానసిక ధోరణి ఎలా వుంటుందో విశ్లేషించాడు. సరిగ్గా కిందికులాల పట్ల, వారి పనుల పట్ల, ఉనికిపట్ల కూడా అగ్రవర్ణ మానసిక ధోరణి కూడా అలాగే వుంటుంది. మనుషుల మెదళ్లు కొన్ని వేల సంవత్సరాలుగా అలాగే ఎదిగాయి కాబట్టి ఆ బుర్రలు అలాగే ఆలోచిస్తాయి. ...... సంస్కారమో, రాజకీయ చైతన్యమో, సామాజిక స్పృహకో కొన్నిసార్లు అదుపుచేసినా అనేక సందర్భాల్లో ఇతర కులాలను కించపరిచే మాటలు అలవోకగా అగ్రవర్ణాల ప్రజలు - మేధావులు వాడుతుంటారు. అలాగని అది వాళ్ళు కుట్రపూరితంగానో, కావాలనో concious గా చస్తున్నారని అనలేం. పుట్టిన కుటుంబాలు, పెరిగిన పరిసరాలు, ఎదిగిన వాతావరణం,

నేర్పిన చదువు మనకు అసమానతలు మాత్రమే నేర్పిస్తుంది. ఇంట్లో, పాఠశాలలో, పుస్తకంలో, ఆటల్లో, పాటల్లో అదే విలువ వుంటుంది.

చిన్నప్పుడు అమ్మలో, అమ్మమ్మలో చెప్పే కథల్ని, బడిలో నేర్చుకునే పాఠాల్ని, బయట నలుగురిలో పాడుకునే పాటల్ని గమనించండి. అన్నీ మోతుబరుల చుట్టూ, పూజారుల చుట్టూ, పురాణాల చుట్టూ మాత్రమే తిరుగుతాయి. అవే విలువలు, అదే ధర్మం నేర్పిస్తాయి. మన పిల్లల పాఠ్య పుస్తకాల్లోని కథల్లో దళితుడు అంటే రూపాయి కోసం అబద్ధం ఆడే వాడిగా, బోయవాడంటే అపురూపమైన పక్షిజంటను అన్యాయంగా తన బాణానికి బలిచేసే వాడుగా మాత్రమే చిత్రిస్తారు. కానీ బ్రాహ్మణుడు మాత్రం ప్రతి క్షణం ప్రజాహితం కోరుతూ కథల్లో ప్రత్యక్షం అవుతాడు. ఒక్క పద్యం ఒక్క కథ కూడా శూద్రకులాల వృత్తుల్లో వుండే శ్రమను గౌరవంగా చూడదు.

ఈ రకమైన ధోరణి హిందూ ధర్మం నుంచి వచ్చింది. బ్రాహ్మణత్వం అది తీసుకు వచ్చిన విలువలు, సాహిత్యం సాంప్రదాయం మన మెదళ్ళను, ఆలోచనలను అలా మలిచేసాయి. దాదాపు నాలుగు వేల ఏళ్లుగా ఆయన గార్లుగా, అయ్యవార్లుగా ప్రజల మెదళ్లను మలిచిన బ్రాహ్మణులు నిచ్చెనమెట్ల కుల వ్యవస్థను ప్రతి కులానికి, ప్రతి వృత్తికి, ప్రతి పనికీ వేరు వేరు విలువలు ఆపాదించారు. తాము చేసే పని మాత్రమే విలువైందని, మిగతా అందరిదీ హీనమైందని చెప్పారు. 'దైవకార్యం' నిర్వహించే బ్రాహ్మణుడిని అందరికంటే ఉత్తముడుగా, ఉదాత్తుడుగా చిత్రించారు. దాన్ని స్థిరపరుస్తూ పురాణాలు, ఇతిహాసాలు, వేదాంతాలు తయారుచేశారు. అదే వేదాలు సూచించిన ధర్మమని, అందరూ ఆచరించి తీరాల్సిన జీవన విధానమనీ పేర్కొన్నారు. దీనిపై అనేకమంది అనుమానాలు వ్యక్తం చేశారు. అభ్యంతర పెట్టారు. కొందరు తిరుగుబాట్లు కూడా చేశారు. శంభూకుడిలా, ఏకలవ్యుడిలా, జాబాలిలి వీరంతా చరిత్రలో కనుమరుగైపోయారు. ఇలాంటి అనుమానాలు తలెత్తకుండా బ్రాహ్మణులు పురుష సూక్తం పేరుతో సమాజాన్ని కట్టడిచేసే ప్రయత్నం చేశారు. దోపిడీని పనిని శాశ్వతంగా స్థిరపరిచారు.

'బ్రాహ్మణో ఆసన ముఖం అసీత్
బాహోరాజన్య క్రిత
ఉదరత దస్య యదేవైశ్య,
పాదభ్యం శేద్రో, ఆజాయత్' అన్న పురుష సూక్తం. బ్రహ్మ ముఖం నుంచి వచ్చిన బ్రాహ్మణుడు చేసే పని అన్ని పనుల కంటే ఉన్నతమైందిగా అన్వయించి చెప్పింది. శ్రమ సౌందర్యం స్థానంలో Dignity అంటే Divinity మాత్రమే అని చెప్పింది. దైవం అంటే సృష్టికర్త, ఆ సృష్టికర్త ముఖంలోంచి వచ్చిన బ్రాహ్మణుడు దైవత్వం కలిగిన వాడు. వేదజ్ఞాన పారంగాయుడైన బ్రాహ్మణుడు తన జ్ఞాన బోధ ద్వారా మిగతా ప్రజానీకానికి ముక్తిని ప్రసాదిస్తాడని నమ్మించారు.

బ్రాహ్మణులు దేవాలయం గోడమీద, దేవుడి మీద మాత్రమే కాకుండా బడిమీద, చదువుమీద, భూమి మీద, గ్రామ జీవితం మీద పట్టుసాధించాడు. అక్కడితో ఆగకుండా ప్రజల ప్రతి చర్యనూ కట్టడిచేసే పంచాంగ కర్తగా,జాతక కర్తగా అవతరించాడు. వ్యవసాయం, పంటలు, పుట్టుక, పెళ్ళి, చావు కర్మకాండలు ఇలా మొత్తం గ్రామీణ ప్రజా జీవితం బ్రాహ్మణుల అదుపాజ్ఞలలోకి వచ్చింది. ఇలా మతం నుంచి జ్ఞాన సంపదకు అక్కడి నుంచి భూమి-గ్రామ సంపద మీద వరకు అన్నిటికీ బ్రాహ్మణుడే కేంద్రబిందువై జ్ఞానం విలువైందని, వరమని, పని శ్రమ వెలలేనిదని, ఖర్మ వీధిని, శాపమని నిర్ధారించే ధర్మ శాస్త్రాలను రూపొందించడం జరిగింది.

నిజానికి మనుషులు మనుగడ కోసం సాగించిన పోరాటంలో భాగంగా తమ శ్రమ ద్వారా, పని ద్వారా ఆలోచన ద్వారా, వూహ ద్వారా ఎన్నో అద్భుత విజయాలు సాధించి, అసమాన వస్తు, జ్ఞాన సంపదను సమకూర్చి, తమ నైపుణ్యం నేర్పరితనంతో ఎన్నో పరికరాలు, పనిముట్లు ఆవిష్కరించి ఉత్పత్తికి, సంపదకు కారకులైతే ఆ పనికి, శ్రమకు, ఉత్పత్తికే, ప్రతిభకూ జ్ఞానానికి ప్రయత్నం విలువ లేకుండా, వాళ్ళ శ్రమకు ఏమాత్రం గౌరవం లేకుండా అదొక ఖర్మగా మార్చివేయడం ఆశ్రమకున్న విలువను నిర్వీర్యంచేయడం మాత్రమే. అలా చేయడం వల్ల మొత్తం శ్రామిక కులాలలను, వాళ్ళ ఉత్పత్తి శక్తిని, వాళ్ళు సృష్టిస్తోన్న సమస్త జ్ఞానాన్ని అలాంటి సమస్త వృత్తులనూ - పనికి మాలినవిగా, ఛండాలమైనవిగా, సూతకమైనవిగా మార్చివేసి శ్రామికులను నీచులుగా దిగజార్చే ప్రయత్నం జరిగింది. అదే వేదమై, అదే ధర్మమై, అదే సాంప్రదాయమై చివరికి అదే చరిత్రయి, ఆచారమై సిద్ధాంతమై పోయింది. అందుకే అంబేద్కర్ ఒక సందర్భంలో 'చరిత్రంతా కులతత్వంతో నిండిపోయిన తప్పుడు రాతల సమాహారం అంటాడు. ఇది ఎందుకు జరిగిందంటే కవులు, రచయితలు, గ్రంధకర్తలైన బ్రాహ్మణులు తమ పక్షం నుంచి రాసిన రాతలే ఈ దేశంలో చరిత్రగా మారిపోయాయి. రాజుల గురించి, పాలన గురించి, యుద్ధనీతి గురించి, ధర్మం గురించి, ధర్మపాలనలో బ్రాహ్మణుల ప్రతిభ గురించి తప్ప భారతీయ చరిత్ర రచనలో సామాన్యుడి గురించి, శ్రామికుడి గురించి ఎక్కడా కనిపించదు. ప్రముఖ చరిత్రకారుడు ఆర్.ఎస్.శర్మ కూడా భారతీయ చరిత్ర నిండా బ్రాహ్మణులు, క్షత్రియుల గురించే ఉండడం పట్ల విస్మయం వ్యక్తం చేస్తాడు.

పాశ్చాత్య సమాజాల్లో ఈ పరిస్థితి కనిపించదు. అక్కడి రచనల్లో జీవితంలో శ్రమపట్ల గౌరవం, శ్రామికుడికి మర్యాద కనిపిస్తాయి కాబట్టే వందల సంవత్సరాలు బానిసత్వం, ఫ్యూడల్‌నవ జాలంలో బతికిన యూరప్‌లో అంతకంటే బలమైన సాహిత్య ప్రయోగాలు జరిగాయి. ఫ్యూడల్ ఆదిపత్యాన్ని ధిక్కరిస్తూ, బానిసత్వాన్ని నిరసిస్తూనే కాకుండా పనిని ప్రధాన భూమికగా చేసుకుని, 19వ శతాబ్దంలో అనేక రచనలు ముందుకు వచ్చాయి. పాశ్చాత్య సమాజం ముఖ్యంగా 'పునరుజ్జీవ యుగం' శ్రామికుడిని హీరోను చేసింది. అక్కడి సాహిత్యం మానవతా విలువలకు, శ్రామకు అద్దంపట్టింది. శ్రమను దైవ సమానంగా పేర్కొంటూ work is worship అన్న భావనను, ప్రచారం చేసిన ఘనత ఆ సాహిత్యంలో కనిపిస్తుంది. ఈ కోవలో 1873లో జార్జి ఎలియట్ పేరోతో మేరీ అనా ఇవాన్స్ కార్యపనిచేసే ఒక వడ్రంగి 'వయోలిన్' తయారు చేయడాన్ని ప్రతిసృష్టిగా పేర్కొంటూ Not god himself can make man's best without best man to help him అంటుంది. వృత్తి నైపుణ్యం. ప్రతిభ గలిగిన శ్రామికుడు లేకుండా దేవుడు కూడా సర్వోత్కృష్టమైన దాన్ని సృష్టించలేడు. మనిషే సృష్టికర్త అన్నది ఆ పద్య పారాంశం. ఒక సంగీత కారుడు ఫిడేలు వాయిస్తుంటే ఆ కళాకారుని ప్రతిభకు సభలోని శ్రోతలంతా దాసోహమైపోతారు. కానీ ఆ రాగాలు పలికించిన ఫిడేలును తయారుచేయడంలో వడ్రంగి పడిన శ్రమ, కనపరిచిన ప్రతిభ కర్ర ఎంపికచేసి, చెక్కి, అందమైన ఫిడేలుగా మలిచిన చతురతను ఎవరూ గుర్తించడు' అంటుందామె. ఇంత ప్రతిభవంతుడివి చక్రవర్తివి కావచ్చుకదా అని ఆ పద్యంలో ఆ వడ్రంగిని అడిగితే నేను చక్రవర్తినై చేతులు ముడుచుకు కూర్చోలేను. నా పనిలో నా సహజ జ్ఞానాన్నంతా వాడి, ఆత్మను ఆవిష్కరించి ఈ ఫిడేలు తయారు చేయడంలో ఉన్న ఆనందం నాకు వేరే చోట ఉండదు. నేను పనిని వదిలిపెట్టలేను' అంటాడు. శ్రమ ప్రతిభకు, నైపుణ్యానికి మూలం శ్రమ లేకపోతే శ్రామికుడు లేకపోతే దేవుడు కూడా సృష్టికార్యం చేయలేడు. ఈ సూత్రం చుట్టూ పాశ్చాత్య సాహిత్యంలో వందల, వేల రచనలు వచ్చాయి. కానీ మనదేశంలో అలాంటి పరిస్థితి రాలేదు. శ్రమను సామాజిక అవసరంలో నుంచి, చూస్తే తప్ప మనకు శ్రామికుడి విలువ అర్థంకాదు.

భారతీయ సమాజంలో పూజారికి ఎక్కువ విలువ ఉంది. కానీ వాస్తవంగా చూస్తే పూజారితో పనిలేకుండా జీవితాంతం గడిపేయవచ్చు. కానీ మాదిగ కులస్తుడితో పనిలేకుండా, ఆయన సృష్టించిన చెప్పులు లేకుండా ఎవరికైనా ఒక్క పూటయినా గడవదు. పైగా సమాజంలో అందరికీ అతనితో - అతని చెప్పులతో పని వుంటుంది. అయినప్పటికీ అతను అస్పృశ్యుడు.

అంటరానివాడు, అంటకూడని అంటదగనివాడు ఎందుకయ్యాడు? కేవలం అతను చేస్తున్న పనిని విలువలేనిదిగా మార్చడంవల్ల, ఆ పని అతని ఖర్మకావడం వల్ల, అది గత జన్మ అపచారం మూలంగా ఈ జన్మలో చేసుకుంటున్న పరిహారం మాత్రమే కావడం వల్ల దానికి విలువ, గౌరవం, గుర్తింపు లేకుండా పోయాయి.

శ్రమ- సంస్కృతి:

నిజానికి శ్రామికుడే సృష్టికర్త. తన శ్రమద్వారా, కళద్వారా, నైపుణ్యం ద్వారా సమస్త వస్తు విజ్ఞాన రాశిని సృష్టించినవాడు. భారత దేశానికి చెందినంతవరకు తొలుత ఆర్యేతరులైన స్థానిక తెగలు, తదుపరి శూద్ర, దళిత వర్గాలు ఈ సాంస్కృతిక సంపదను సృష్టించాయి. అడుగడుగునా ఈ తెగలు, సమూహాలు, కులాలు, తమ శ్రమశక్తిని సమీకృతం చేసుకుంటూ నాగరికతకు పునాదులు వేశాయి. ప్రకృతిని శోధించి, పరిసర విజ్ఞానాన్ని మదింపు చేసుకుని, అవసరాలకు అనుగుణమైన రీతిలో సృష్టిని మలిచాయి.

ఇప్పుడు వేదాలే జ్ఞానమని, వేదాలే శాస్త్రమని అనేవాళ్ళు అనేక మంది వున్నారు. సమస్త జ్ఞానం వేదంలో నిక్షిప్తమైవుందని నమ్మించే ప్రయత్నం చేస్తున్నారు. నిజానికి వేదానికి ఆధారం లేదు. ఎవరు రాశారు, ఎప్పుడు రాశారు, ఎక్కడ రాశారు అనేది లేదు. అసలు రాతే లేదు. వేదం అంటేనే విన్నది అని అర్థం. ఎవరు చెప్పారో ఎవరు విన్నారో, ఏమి చెప్పారో ఎవరికీ తెలియదు. పోతే ఎవరికి తోచిన రీతిలో వాళ్ళు వేదాలను విశ్లేషిస్తూ వేద విజ్ఞానం అని అంటున్నారు. వేదం సాధించింది ఏమిటి అంతకు ముందున్న సమాజానికి, వేదాలు వచ్చిన తరువాత సమాజానికి తేడా ఏమిటి అన్నది ఆలోచించినప్పుడు వేదాలు సమాజాన్ని అడ్డుగోడలుగా చీల్చిన కులాల - వర్ణ వ్యవస్థను తెచ్చాయి. ప్రజల్ని వర్గాలుగా వృత్తిని బట్టి, శ్రమను బట్టి విభజించాయి. భౌతికమైన వస్తు ఉత్పత్తి ప్రక్రియకు భౌతికేతర విలువను ఆపాదించాయి. పవిత్ర అపవిత్ర కార్యాలుగా మనుషులు పనిని, శ్రమను విభజించాయి. ఉత్తమ నీచకృత్యాలుగా పనులను వర్గీకరించాయి. ఇలాంటి అసమానతలకు తోడు దేశంలో మతాన్ని వ్యవస్థీకృతం చేశాయి. దేవుడు అనేక మానసిక భావనను శాస్త్రోక్తం చేసి మనిషిని గుడిచుట్టూ తిరిగే గంగిరెద్దుని చేశాయి. గుడిలో పూజారిడిని దేవుడి ప్రతినిధిగా, వారసుడిగా భూసురుడిగా వర్ణించాయి. ఆ రకంగా పూజారి స్థానాన్ని దైవం తరువాతి స్థానంగా స్థిరపరిచాయి.

మరి జ్ఞానం ఎక్కడిది. వేదాల్లో ఏమైనా కొత్తగా సమాజానికి, సామాజిక ఉత్పాదకతకు, ఉత్పత్తికి, సంపదకు దోహదపడే సూత్రమో, ఉపదేశమో ఉన్నాయా అంటే అలాంటి ఆధారాలేవీ లేవు. ఇక్కడ మనం మరోవిషయంల కూడా గమనించాలి. వేదాలతోనే సృష్టి ఆవిర్భవించలేదు. అప్పటికే సృష్టి వుంది. ప్రజలున్నారు. సమూహాలున్నాయి. సంఘజీవనం వుంది, సమాజాలు, పల్లెలు, పట్టణాలు, నగరాలు నాగరికతలు వున్నాయి. అప్పటికే పనులున్నాయి - వృత్తులున్నాయి, కళలున్నాయి, కథలున్నాయి. మనుషులందరికీ పనికివచ్చే సమస్త జ్ఞాన సంపద - సంస్కృతీ వున్నాయి. వేదాల తరువాత ఆవిర్భవించిన బ్రాహ్మణవర్గం ఇప్పుడు జ్ఞానం మాది అంటోంది, విజ్ఞానం మా భిక్ష అంటోంది, విద్య మాది అంటోంది ఒక దశలో ఈ విజ్ఞానం, విద్యగంధం ఎవరికీ అంటకూడదని ప్రయత్నం చేసింది. ఇప్పుడు మనదేశంలో అది ఆర్థిక శాస్త్రమైనా, భౌతిక శాస్త్రమైనా, జీవశాస్త్రమైనా, జంతు శాస్త్రమైనా బ్రాహ్మణులే ఆధిపత్యం చలాయిస్తున్నారు. భట్నాగర్‌లే ఈ విజ్ఞాన శాస్త్రాలను తమ అధీనంలో ఉంచుకుంటున్నారు.

చరిత్రక్రమాన్ని పరిశీలిస్తే భారత దేశం అని ఇప్పుడు అంటున్న ఈ భూభాగంలో బ్రాహ్మణకులం ఏర్పడక ముందు అంటే చాతుర్వర్ణ వ్యవస్థను సృష్టించిన వేదకులం కంటే, ఆర్యులకంటే ముందే సకలశాస్త్రాలు అభివృద్ధిచెందాయి. విజ్ఞానశాస్త్రం పరిఢవిల్లింది. వ్యవసాయం, నీటిపారుదల, భవన నిర్మాణం, గణిత, వైద్య శాస్త్రాలు మహోన్నత స్థాయిలో వెలిగిపోయిన హరప్పా- మొహింజదారో నాగరికత వుందీ. సింధూలోయలో నివసించిన తెగలు, సముదాయాలు సృష్టించిన విజ్ఞానంలో ఇప్పటికే చరిత్రకారులకు, విశ్లేషకులకు ఆశ్చర్యం కలిగించే అంశాలెన్నో ఉన్నాయి.

నిజానికి ఈ నాగరికత వికాస క్రమంలో ఏదశలో కూడా మతం లేదు, బ్రాహ్మణుడు లేడు. కాబట్టి కులం కూడా లేదు. మనుషులు, సమూహాలు ఉమ్మడి సాంఘిక జీవితం తప్ప ఎలాంటి అవాంతరాలు లేవు. నాగరికతల విశ్లేషణలో ప్రధానంగా సామాజిక పరిణామం నాలుగు దశల్లో జరిగిందని చెపుతారు. ఈ నాలుగో దశ కూడా సంపూర్ణం అయిన తరువాత మాత్రమే కుల వ్యవస్థ వచ్చిందని అంటుంటారు. అది వేటాడే దశకానీయండి, చేపలు పట్టే దశ కానీయండి. లేదా అంతకు ముందూ ఆ వెనకా ఉన్న ఆహార సేకరణ దశ కానీయండి లేదా ఆహారోత్పత్తి దశకానీయండి ఎక్కడా పూజారితో పనిలేదు, గుడిలేదు. బ్రాహ్మణవర్గం అసలే లేదు.

ఆహార సేకరణ దశలో కొన్ని వందల వేల సంవత్సరాల పాటు మనుషులు అడవుల్లో సంచరిస్తూ ఆకులు, అలములు, పళ్లు, కాయలు తింటూ బతికిన దశలో చెట్లును, పండ్లను వాటి స్వభావాన్ని, వాటి వాటి గుణాలను పోషక విలువలను కనిపెట్టిన శాస్త్రవేత్తలు సామాన్యులే. పండ్లను ఏరుకుని, తెంపుకుని పరిపక్వం చెందే విధంగా భద్రపరచడం ప్రాసెసింగ్ చేయడం అలాగే చెట్టు బెరడు నుంచి జిగురు, చెట్టు పొదల్లోంచి తేనె తీసే ప్రక్రియ అందులో పాటించవలసిన శాస్త్రీయ పద్ధతులను ఆ కాలం నాటి శ్రామికులు ఆవిష్కరించారు. అదే పని ఇప్పటి తెనుగ, బోయ, ఎరుకల ఇతర కింది కులాలు చేస్తున్నారు. ఒకప్పుడు నాగరికత వికాస దశలో మనిషి మనుగడకు ప్రధాన కారకమైన ఒక వృత్తి ఇవాళ కింది కులంగా నీచమైందిగా, విలువలేనిదిగా మారిపోయింది.

వేట చేపలు పట్టడంలో ఉన్న శాస్త్రీయత, సాంకేతికత కూడా విలువ లేనిదిగా మారడం విషాదం. నిజానికి లెక్కలు, ఎక్కాలు తెలియక ముందే ఒక మనిషి ఆకాశంలో ఎగురుతున్న పక్షినో, నేలమీద పరిగెత్తుతున్న జంతువునో గురిచూసి కొట్టడం సీదాసాదా విషయం కాదు. ఆ పక్షి లేదా జంతువు ఉన్నదూరం, పరుగెత్తుతున్న వేగం అంచనా వేయగలిగే అద్భుత శాస్త్రీయ పరిజ్ఞానం. అందుకు అవసరమైన చురుకైన మెదడు ఉంటే తప్ప అలా లెక్కగట్టడం సాధ్యంకాదు. ఆ వేగాన్ని, దూరాన్ని అంచనా వేసి ఆ దూరాన్ని బాణం చేరాలంటే ఎంతవేగంగా బాణం దూసుకెళ్ళాలి, దానికి ఎంత వేగంగా విల్లుదారాన్ని వెనక్కి లాగాలి అన్న విద్యలో ఉన్న సాంకేతికత అద్భుతం. గణిత శాస్త్రం తెలియక ముందే ఎలాంటి గుణకారాలు, భాగాహారాలు లేకుండా శ్రామికులు తమ జీవిత అవసరంగా ఈ పనులన్నీ చేశారు. అలాగే నీటిలో ఉన్న చేపల్ని పసిగట్టి, వలపన్ని పట్టడం, లేదా ఎరమింగే లోపే గాలంవేసి లాగడం ఇవన్నీ గణిత శాస్త్రంలోని కాలం-వేగం-దూరం నియమాలు, సూత్రాల రూపకల్పనకు తరువాతి కాలంలో దోహదపడివుంటాయి. అయినప్పటికీ విలువిద్య విషయంలో రాముడిని, అర్జునుడిని చెపుతారుగానీ అశేష ప్రతిభా సంపన్నులైన ఈ అమాయక శ్రామికుల సత్తా ప్రస్తావించరు.

వ్యవసాయం, ఆహారోత్పత్తి మొదలైన తరువాత కూడా నేలల స్వబావం, పంటలు, విత్తనాలు, మొలకెత్తే సమయం, ఆ పంటలకు ఎన్ని రోజులకు నీళ్ళు అవసరం, ఎలాంటి సస్య రక్షణ అవసరం వంటివి ఏ వ్యవసాయ పరిశోధనా కేంద్రాలతో పనిలేకుండానే ఈ దేశంలోని దళితులు - పాలేర్లు కనిపెట్టగలిగారు. ఇదేదో వేదంలో వుండేవీలు లేదు. ఎందుకంటే వ్యవసాయం సింధూలోయలో వేదాలు రాశారనుకుంటున్న ఆర్యులకంటే ముందే వుంది. అప్పటికే చెరువులు, కాలువలు, వ్యవసాయ గ్రామాలు నగరాలు ఎన్నో ఈ ప్రాంతంలో విలసిల్లివున్నాయి. కాబట్టి, సైన్స్, టెక్నాలజీ, ఆర్కిటెక్చర్‌తో బ్రాహ్మణులకు సంబంధం లేదన్నది. స్పష్టం అవుతోంది. ఆర్.ఎస్. శర్మ ప్రకారం సున్నాను కూడా ఆర్యులకంటే ముందే కనిపెట్టాం గనుక దానికే వేదబ్రాహ్మణులకే

సంబంధం లేదన్నది రుజువవుతోంది. నిజానికి ప్రాచీనకాలంలో మనుషులు నేర్చుకున్న ప్రతిపని వెనుకా పరిశోధన, శాస్త్రీయత స్పష్టంగా కనిపిస్తుంది. ఉదాహరణకు అత్యంత నీచమైన చండాల వృత్తి అనుకుంటోనన దళితుల పనినే గమనిద్దాం. మొదట మాదిగ పని శుచి, శుభ్రతకు నిదర్శనం. గ్రామంలో నుంచి మలినాలను, చెడువదార్థాలను, మలాన్ని తీసివేసి గ్రామాన్ని సంస్కరించడం వాళ్ళపని. అందులో భాగంగా పశువులు మృతకలేబరాలను తొలగించే పని, ఆ కళేబరాల నుంచి సమాజ అవసరాలకు ఉపయోగపడే వస్తువులను తయారుచేసేతీరు అద్భుతం. చనిపోయిన జంతువు చర్మం ఒలిచి, శుద్ధిచేసే క్రమంలో వివిధ ఆకులు, ప్రకృతిలో లభించే సున్న, తంగేడు చెక్కలు తదితర పదార్థాలతో ద్రావకం తయారుచేసి, దానితో శుద్ధిచేసి, తరువాత లందలో నానబెట్టి, కడిగి, ఆరబెట్టి ఆ ముక్క లక్షణాన్ని, నిర్మాణాన్ని, స్వభావాన్ని బట్టి ఏ భాగం డప్పుకు, ఏ భాగం చెప్పుకు, ఏ భాగం మద్దెలకు, ఏ భాగం ఇతర అవసరాలకు పనికి వస్తుందో గుర్తించి ఆ చర్మ లక్షణానికి అనుగుణమైన వస్తువులను తయారుచేయడాన్ని మించిన విజ్ఞానం, కళ, నైపుణ్యం వేరే ఉంటాయని అనుకోలేం. ఆ జ్ఞానాన్ని ఉపయోగించి చెప్పులు తయారుచేసి, ప్రతిమనిషి కాళ్ళకూ అలంకరింపజేసి కాపాడుతోన్న మాదిగను ఎంతనీచంగా చూస్తున్నాం. ఆజ్ఞానం, ఆ నేర్పు, ఆ విద్యను గుర్తించకపోగా దానికి విలువ లేకుండా చేసి అపహాస్యం చేయడం, అవహేళన చేయడం మన నాగరికతకే తీరని మచ్చ.

ఇటువంటి శ్రామికులు తమ పనిద్వారా సింధూలోయలో అద్భుత సంస్కృతిని సృష్టించారు. వ్యవసాయ వ్యాపారాలకు కొదువ లేకపోగా, అద్భుతశిల్పకళా నైపుణ్యంతోపాటు భవన నిర్మాణ ఆ తవ్వకాల్లో బయటపడ్డాయి. ఇవన్నీ ఆర్యుల రాకకంటే ముందరి సాంస్కృతిక వారసత్వ సంపదకు నిదర్శనాలు.

నిజానికి బ్రాహ్మణులు నాగరికతలు పూర్తిగా వికసితమైన దశలో మాత్రమే కనిపిస్తారు. గ్రామాలు ఏర్పడి, వ్యవసాయం విస్తరించి, ఆ గ్రామాలు ఆర్థికంగా సుసంపన్నం అయిన చాలా కాలానికి బ్రాహ్మణులు రంగ ప్రవేశం చేశారు. ఆర్యుల కాలంలో ఈ జాతికి కల్లుతాగడం, పశువుల్ని ముఖ్యంగా లేత లేత ఆవుల్ని చంపి, ఆ మాంసం తినడం, వేదాలు చదవడం, యాగాలు చేయడం తప్ప ఇంకో పనిలేదు. ఈ భూమిమీద ఉత్పత్తి దోహదమైన పని అనేది లేకుండా జులాయిగా తిరిగిన తెగ ఆకాలంలో బ్రాహ్మణులే. వీళ్ళు ఉత్పాదకతలో ఏరకమైన పాత్రపోషించక పోగా అన్నీ ఉత్పత్తులను వాళ్ళ అదుపులో తెచ్చుకోగలిగారు. అప్పటికే ఆవిర్భూతమై ఉన్న విజ్ఞానాన్ని ఒక క్రమంలో కూర్చి వాళ్ళ ప్రతిభగా ప్రకటించుకున్నారు. గుడిని ఒక కేంద్రప్రదేశంగా మార్చి అప్పటివరకున్న ప్రజల సంస్కృతి, ప్రజల మతం, గ్రామ దేవతలు, స్థానిక పూజా పద్ధతులు, పూజారులను రూపుమాపి హిందూ మత సంస్కృతికి బీజాలు వేశారు. ఎల్లమ్మ, పోచమ్మ, మైసమ్మలాంటి గ్రామ దేవతలు కనుమరుగై లక్ష్మీ సరస్వతి వంటి దేవతలు రాముడు, కృష్ణుడు, శ్రీ మహావిష్ణువులాంటి అవతార పురుషులు ప్రాచుర్యంలోకి వచ్చారు. అప్పటికే స్థానికంగా దొరికే పసర్లు, వేళ్ళు, చెట్లు చేమల నుంచి మందులు తయారుచేసే తెగలను తరిమేసి వారి పద్ధతులను దొంగిలించి వైద్య శాస్త్రం పేరుతో జ్ఞానాన్ని గ్రంథస్థం చేసుకున్నారు. ఇలా దేవాలయం, గ్రామం, విద్య, విజ్ఞానం పై ఆధిపత్యం సాధించిన బ్రాహ్మణ వర్గం, తమ పాలనా వ్యవస్థను పటిష్టపరుచుకుంటూ ఆర్యావర్తం దాటి మధ్యవర్గం, దక్షిణాపథాన్ని విస్తరించారు. ఈ విస్తరణలో భాగంగా ఆయా వృత్తుల ఉత్పత్తి జ్ఞానం పూర్తిగా బ్రాహ్మణులు వశపరచుకోవడం గమనించవచ్చు. గ్రామీణ సమాజాలు ఏర్పడి కులవ్యవస్థ పటిష్టమైన తరువాత కూడా ఉత్పత్తి సాధనాలను కనిపెట్టింది, రూపొందించింది, ఉపయోగించింది కూడా శ్రామిక వర్గమే. అప్పటికే కుల సమాజంలో శూద్రులుగా, వృత్తికారులుగా ఉన్న కమ్మరి, కుమ్మరి, వడ్రంగి తదితర కులాలు గ్రామీణ సంపదకు, ఎంతో దోహదపడ్డాయి. ముఖ్యంగా వ్యవసాయ విస్తరణకు, వ్యవసాయోత్పత్తుల పెరుగుదలకు ఈ వృత్తులు - వృత్తికారులు వాళ్ళు సృష్టించిన సాధన సంపత్తి, పరికరాలు, పనిముట్లు ఎంతో దోహదపడ్డాయి.

వృత్తులు విప్లవాత్మకమైన రీతిలో విస్తరించడం గ్రామీణ ఆర్థిక పరిపుష్టికి దోహదపడింది. లోహ వృత్తులకు తోడు, చేనేత, శిల్పకళా నైపుణ్యం గలిగిన ఉప్పరి, వడ్డెర, కంచరి, మేదరి వంటి వివిధ వృత్తి సముదాయాలు, కులాలు గ్రామాల రూపురేఖల్ని పూర్తిగా మార్చివేశాయి. అలాగే మాల, మాదిగల శ్రమవల్ల గ్రామాల్లో బావులు, చెరువులు తవ్వడం, నీటి వనరులను నిర్వహించడం, రవాణా వ్యవస్థ విస్తరణ వంటివి జరిగాయి. ఇది వస్తు రవాణాకు మారక ఆర్థిక లావాదేవీలకు ఎంతో ఉపయోగపడింది. ఒకరకంగా విజ్ఞానం ఆవిష్కరణలో తొలిశాస్త్రీయ విప్లవానికి పునాదులు వేసింది. ఈ శ్రామిక కులాలే. కమ్మరి లోహవిద్య, కుమ్మరి చాతుర్యం, చాకలి శాస్త్రీయత మనల్ని అబ్బురపరుస్తాయి. ఎలాంటి సబ్బులు, సర్ఫులు లేని కాలంలోనే మట్టిలోని క్షార మృత్తిక లక్షణాలను పసిగట్టి ఆ మట్టితో బట్టల మలినాన్ని శుభ్రం చేయవచ్చని తొలిసారిగా కనిపెట్టింది. చాకలివాళ్ళే అలాగే వైద్యం, సర్జరీ, కట్లుగట్టడం. పసర్లు తయారుచేసే రోగాలు నయం చేయడం ఆయుర్వేదం పేరుతో బ్రాహ్మణులు ఈ విజ్ఞానాన్ని గ్రంధస్థం చేయకముందు నుంచీ వుంది. ముఖ్యంగా మంగలి, పంచాల, బైండ్ల, మందుల వంటి కింది కులాలు ఈ విజ్ఞానంలో నిష్ణాతులు. ఇలా ఒకవైపు ఉత్పత్తిని పెంచడానికి కావలసిన సాధన సంపత్తిని, మరోవైపు మనుగడకు అవసరమైన జ్ఞానసంపదను సమన్వయపరుచుకుంటూ శూద్ర, దళిత కులాలు భారతీయ గ్రామాలను, జనపదాలను, గణరాజ్యాలను సుసంపన్నం చేశాయి.

శ్రామికులు, వృత్తికారులు, నేర్పరితనం గల నేత పనివాళ్ళు, శిల్పులు, పోటీపడి ఈ దేశంలో ఒక కొత్త సృష్టికి పూరుకున్నారు. ఈ పని వీళ్ళ శ్రమ దేశంలో అనూహ్యమైన రీతిలో సంపదకు కారణమైంది. రాజ్యాలు ఏర్పడి, రాచరికం అమలై, రాజుకు, రాజ్యానికి మధ్య బ్రాహ్మణుడు బలమైన శక్తిగా ఎదిగిన కాలం నాటికి అంటే రెండో శతాబ్దం నాటికే వస్తూత్పత్తికి ఈ గ్రామాలు కేంద్రాలైపోయాయి. తమ శ్రమద్వారా ఉత్పత్తిని, తద్వారా గ్రామ సంపదను పెంచుతున్న ఈ వర్గాలపై 2వ శతాబ్దం నాటికి బ్రాహ్మణుల కన్నుపడింది. మను ధర్మశాస్త్రంలోనూ, అలాగే కౌటిల్యుడి అర్థశాస్త్రంలోనూ గ్రామ సంపదను రాజు ఎలా కాజేయవచ్చో బ్రాహ్మణులు సలహాలివ్వడం మొదలుపెట్టారు. వృత్తులమీద, వృత్తికారుల మీద, శ్రమశక్తుల మీద పన్నులు వేయడం మొదలయ్యింది. ఈ పన్నులు బ్రాహ్మణుడు మినహా అన్ని కులాలకు, వృత్తులకూ అమలయ్యే పరిస్థితి ఏర్పడింది. పన్నుల వసూళ్ళ కోసం రాజులకు, తమ పీఠాలు కాపాడుకోవడం కోసం బ్రాహ్మణులకు ఈ ధర్మశాస్త్ర ఆధారిత శాసనాలు ఉపయోగపడ్డాయి. దాదాపు 5-6 శతాబ్దాల నాటికల్లా దేశంలో ఈ పన్నుల మూలంగా, ఉత్పాదకాలు మూలంగా, శూద్రకులాలు, వృత్తులు వాటి శ్రమ మూలంగా దేశం 'స్వర్ణయుగం'గా వినతికెక్కింది. అప్పటికే భారతీయ కళాకారుల నైపుణ్యం దేశ దేశాలకు వ్యాపించింది. పర్షియన్ దేశాలు మొదలు, యూరోపియన్ దేశాల దాకా ఆకర్షణీయమైన భారతీయ కళాఖండాలు ఎందరినో ఆకట్టుకున్నాయి. భారతీయ శూద్రకులాల వృత్తి కళానైపుణ్యం ఆరకంగా దేశానికి ఖండాంతర ఖ్యాతిని తెచ్చిపెట్టింది. ఆ ఆకర్షణ అలెగ్జాండర్ వంటి చక్రవర్తి ఈ దేశంపై దండెత్తే పురికొల్పింది. అలాగే మొఘల్ చక్రవర్తుల పాలనకూ కారణం అయ్యింది.

మొఘల్‌ల పరిపాలనలో కూడా భారతీయ సంస్కృతిని పరిపుష్టం చేసింది. ఈ కళాకారులే. వాళ్ళతో పాటు వ్యవసాయ కులాలు కూడా ప్రధానమైన సమూహాలుగా ఎదిగాయి. అయితే పన్నుల భారంతో వృత్తులు ధ్వంసం కావడం, వ్యవసాయంపై కూడా పన్నులు విధించడం, మొఘల్ సామ్రాజ్యంలో అనేక రైతాంగ పోరాటాలు, తిరుగుబాట్లు జరగడం మనకు చరిత్రలో కనిపిస్తాయి. క్రమంగా ప్రజాస్వామ్య వ్యవస్థ బలోపేతం కావడం కూడా ఈ

కాలంలోనే జరిగింది. బ్రిటిష్ పరిపాలన నాటికి వృత్తికారులు, వ్యవసాయదారులు పతనావస్థలో ఉన్నారనే చెప్పుకోవచ్చు. అప్పటిదాకా అన్ని రకాలుగా గ్రామీణ వ్యవస్థను తమ అజమాయిషీలో ఉంచుకుని, రాజులను తమ అదుపులో పెట్టు కోగలిగిన బ్రాహ్మణుల సహకారంతో ఈ దేశంలో బ్రిటిష్ పాలన పటిష్టపడింది. విద్యావంతులంతా బ్రాహ్మణులే కావడం, ల్యాండ్ రికార్డులు, ఇతర గ్రామస్థాయి పాలనా వ్యవహారాల పత్రాలన్నీ వాళ్ళ చేతిలోనే ఉండి పోవడం మూలంగా బ్రిటీష్ వాళ్ళు బ్రాహ్మణులకు ప్రత్యేక స్థానాన్నిచ్చారు. ఈ వర్గం ఇంగ్లీషు నేర్చుకోవడం, అన్ని రకాల విద్యా అవకాశాలను అనుభవించడంతో ప్రధాన శిష్టవర్గంగా తయారై పాలకులకు అత్యంత సన్నిహితవర్గమై పోయింది. మరోవైపు బ్రిటీష్ పాలన తెచ్చిన సాంకేతిక పరిజ్ఞానం స్థానికంగా కుటీర పరిశ్రమలు నిర్వహిస్తూ వచ్చిన శూద్ర, వృత్తి సమూహాలు పూర్తిగా నిస్సత్తువకు గురయిపోయాయి.

చారిత్రకంగా కులవ్యవస్థ సమాజాన్ని విభజిస్తూ, విడదీస్తూ వచ్చింది. గ్రామస్థాయి నుంచే కులాల మధ్య విభేదాలు, అసమానతలు, వేరు వేరు అస్తిత్వాలా పెరుగుతూ రావడం మూలంగా బ్రిటిష్ పాలకులకు ప్రజలను విభజించి పాలించడం సులభతరమయ్యింది. ఈ నేపధ్యమే దేశంలో జాతీయ భావం లేకుండా, జాతీయ సంస్కృతి లేకుండా చేసింది. నిజానికి స్వాతంత్ర్యోద్యమ కాలంలో కూడా శ్రామిక వర్గానికి, బ్రాహ్మణీయ శిష్టవర్గానికే మధ్య అనేక స్థాయిల్లో విభేదాలు కనిపిస్తాయి. ముఖ్యంగా గాంధీ అంబేద్కర్‌ల మధ్య సాగిన వాదోపవాదాలు, చర్చలు దేశంలో, ప్రజల్లో పెరిగిపోయిన సాంస్కృతిక వైరుధ్యాలకు అద్దం పడతాయి. ఈ దేశంలో శ్రమకు గౌరవం, విలువ లేకుండా చేసిన హిందూ మతం, ఆధిపత్య కులాలు, స్వాతంత్ర్యం అనంతరం కూడా అదేరీతిలో అణచివేతకు గురిచేసే అవకాశం వుందన్న అనుమానాలను అంబేద్కర్ రౌండ్ టేబుల్‌తో సహా పలు సందర్భాల్లో వ్యక్తం చేశాడు. అప్పటికే గోవాల్కర్ నేతృత్వంలో హిందూమతం, జాతీయ వాద భావజాలం పడగ విప్పుతోంది. ఆదశలో అంబేద్కర్ దేశాన్ని కుహనజాతీయవాద చట్టంలో పడిపోకుండా సెక్యులర్‌గా వుంచడానికి విస్తృతంగా ప్రయత్నాలు చేశారు. భారతదేశం ఒక్క జాతి కాదు, అనేక జాతులు, అస్తిత్వాలు, సంస్కృతులు సమాహారం అని పేర్కొన్నాడాయన.

**భారతీయత - సంస్కృతి :**

భారతీయ సంస్కృతి అనేది వుందా? ఇప్పుడు చాలామంది హిందూ ఛాందసవాద రాజకీయ నాయకులు చెపుతున్నట్టు మనం భారతీయులమేనా? అసలు భారతీయ సంస్కృతి, జాతీయ భావన ఎప్పుడు మొదలయ్యింది అన్న విషయాలు కూడా ఆలోచించాలి. 1930లో సైమన్ కమీషన్ భారతదేశంలో జాతీయ సంస్కృతి లేదని ఇది భిన్న సంస్కృతుల దేశమని పేర్కొంది. దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడిన 'భారత జాతీయ కాంగ్రెస్' 'జాతీయ' అనే మాటను వేరే ప్రయోజనం కోసం వాడుకుంది. జాతీయ అంటే జాతీయత సంబంధించింది కాదని, దేశంలో భిన్న సంస్కృతులు న్నాయని, అన్ని ధర్మాలకు సమానమైన హోదా గౌరవం వుండాలనీ పలువురు నేతలు, పండితులు భావించారు. రాజా రాంమోహన్‌రాయ్, రవీంద్రనాధ ఠాగోరువంటి ఆ కాలపు మేధావులు మనలో జాతీయ భావన లేదని, కుల, మత సంస్కృతులు వాటి తాలూకూ భావజాలం జాతీయ వాదం కంటే బలమైందని పేర్కొన్నారు. జాతీయ ఉద్యమకాలంలోనే వీగిపోయిన 'జాతీయ' భావనను ఇవాళ మత తత్వశక్తులు మళ్లీ మన ముందుకు తెస్తున్నాయి. ముందుగా బి.జె.పి, విశ్వహిందూ పరిషత్ వంటి సంస్థలు భారతీయ సంస్కృతి, పేరుతో ప్రచారం చేస్తున్నాయి. ఇక్కడ భారతీయ సంస్కృతి అంటే వేద సంస్కృతి అని గమనించాలి. జాతీయ స్థాయిలో బి.జె.పి అధికారంలో ఉన్నప్పుడు చాలా వరకు ఈ సంస్కృతి వ్యవస్థీకృతం ఏసే ప్రయత్నం చేసింది. భిన్న సంస్కృతులకు, ముఖ్యంగా శ్రామికుల సంస్కృతికి గుర్తింపు, గౌరవం, సమాన స్థాయి, అవకాశాలు ఇవ్వాలని స్పష్టంగా చెప్పిన రాజ్యాంగాన్ని మార్చే ప్రయత్నం చేసింది. అలాగే విద్యారంగ సంస్కరణల పేరుతో పాఠ్యాంశాల్లో మతాన్ని చొప్పించే ప్రయత్నం చే వైదిక సమాజాన్ని ఉన్నతమైందిగా, ధర్మబద్ధమైనదిగా చూపే ప్రయత్నంతో. ముస్లింలను, ముస్లిం పాలకులను హీనంగా చిత్రించే ప్రయత్నం చేసి...

మరోవైపు జాతీయవాదం, భారతీయ సంస్కృతి పేరుతో భా... జనతాపార్టీ ఆర్య సంస్కృతిని ప్రవేశపెడుతున్నది. గుజరాత్ మరణకా... అసలు ఎజెండాను బట్టబయలు చేసింది. దేశం హిందూదేశం కావా... నిజానికి ఒక పెద్దకుట్ర. ఈ జాతీయ భావన, జాతీయ సంస్కృతి మన స్థానిక, వృత్తి సముదాయాలను మింగేసే బహుళ జాతి సంస్కృతిలాంటిదే.

రెండో వైపు నుంచి ప్రపంచీకరణ ఫలితాలు ఇప్పుడిప్పుడే మన నెత్తిమీద ఒక్కొటొక్కడి పడుతున్నాయి. ప్రయివేటీకరణ, ప్రభుత్వ రంగ సంస్థల మూసివేత ఇప్పటికే లక్షలాది మంది పొట్టలు కొట్టింది. మరోవైపు బహుళజాతి కంపెనీలు, విదేశీ వాణిజ్య సంస్థలు ఈ దేశ శ్రమశక్తిని, ఆశ్రామికులు సమకూర్చిన సాంస్కృతిక జీవనాన్ని సమూలంగా ధ్వంసం చేసే దిశగా పావులు కదుపుతున్నాయి. ప్రపంచీకరణ ఫలితాలను మనం ఇప్పుడు ప్రత్యేక ఆర్థిక మండలాల (సెజ్) రూపంలో చూస్తున్నాం. ఇప్పుడు సెజ్‌ల ఏర్పాటుతే భూమి నుంచి రైతునే కాదు కూలీని, వృత్తి కారుడిని కూడా వేరు చేస్తున్నారు. చెరువులు, కుంటలు, చేలు, చెలకాలు అన్ని మాయం చేసి శ్రామిక వర్గాన్ని నిర్వీర్యం చేసే ప్రయత్నం చేస్తున్నారు. ఈ జాతీయ వాదులే ఇప్పుడు అంతర్జాతీయ బహుళ జాతి సంస్థలతో చేతులుకలిపి దేశాన్ని దోచుకునే ప్రయత్నం చేస్తున్నారు. ఇప్పుడు దేశంలో సంపన్న పెట్టుబడిదారీ వర్గం ఒకటి మార్కెట్ పునాదులమీద ఆధారపడి విస్తరిస్తోంది. మరో వైపు ఈ పెట్టుబడిదారీ వర్గంలోంచి ఒక సహభూస్వామిక వర్గం కూడా అవతరిస్తోంది. సెజ్‌ల పేరుతో, పరిశ్రమల పేరుతో వేలాది ఎకరాల ప్రభుత్వ, పేదల వ్యవసాయ భూములను ఆక్రమించుకుంటూ దేశంలో సర్వస్వతంత్ర్య ప్రాదేశిక మండలాలు ఏర్పరచుకుని, రాజ్యానికి, సమాజానికీ ఏమాత్రం జవాబుదారీగా ఉండనవసరం లేని కొత్తతరం ఈ దేశంలో బయలుదేరింది. ఈ వర్గానికి పాలకవర్గాలు అడుగులకు మడుగులొత్తుతున్నాయి. ఈ వర్గం కేవలం పంటలు, పొలాలు సంపదే కాదు. కులవృత్తులను కూడా కుల్లబొడిచే ప్రణాళికలతో ముందుకు వస్తున్నది. రిలయన్స్ సంస్థ ఇప్పటికే సెజ్‌లు, కూరగాయలు అంగళ్ళతో రైతుల నోట్లో మట్టికొట్టింది. ఇప్పుడు పశువులు కొని రైతులకిచ్చి, పాల వ్యాపారం చేస్తోంది. భవిష్యత్తులో సెలూన్‌లు తెరిచి మంగలి వాళ్ళను, లాండ్రీలు తెరిచి చాకలివాళ్ళను తరిమేసే తతంగం సాగుతున్నది.

కొందరు మిత్రులు చాలాకాలంగా ప్రపంచీకరణ మేలుచేస్తుందని, ముఖ్యంగా దళితులకు ప్రపంచీకరణ వల్ల లాభాలున్నాయని వాదిస్తూవచ్చారు. అది తప్పని, ఈ దేశంలో అగ్రవర్ణాలు - వ్యాపార వర్గాలూ ఒకటేనని రుజువవుతున్నది. ఈ వర్గాలు వ్యాపారానికి పరిమితం కాకుండా ఇప్పుడు వ్యవసాయాన్ని, వ్యవసాయ అనుబంధ వృత్తులను, చేతి వృత్తులను, సేవలను కూడా ఆక్రమించుకుంటున్నాయి. అన్ని వ్యాపారంలోకే లాక్కు వస్తున్నాయి.

ఈ నేపధ్యంలో ప్రజాస్వామిక శక్తులు పరిణామాలను ఆలోచించవలసిన అవసరం వుంది. ఉప్పెనలాగా వచ్చిపడుతున్న ప్రపంచీకరణ పర్యవసానాల్లో ప్రజలు ఉక్కిరిబిక్కిరవుతున్నారు. ప్రజల సంస్కృతి పూర్తిగా ధ్వంసమై వ్యాపార సంస్కృతి రాజ్యమేలుతున్నది. ఇటీవలి గుజరాత్ ఎన్నికల పరిణామాలు జాతీయ బహుళజాతి సంస్కృతి ఒకటేనని రుజువు చేశాయి. నిజానికి ఇవి రెండూ సామ్రాజ్యవాద లక్షణాలు కలిగి ఉండేవే. రెండూ పీడితులను, పేదలను, దళితులను, వెనుకబడిన వర్గాలను అణచివేసేవే. ఈ పరిస్థితులపట్ల ప్రజలను అప్రమత్తుల్ని చేయవలసివున్నది. అందుకు విరసం పూనుకోవాలి. ప్రజలను, ప్రజల జీవనాన్ని, కళలను, వృత్తి వ్యాపారాలను కాపాడేవిధంగా విరసం ఒక ఉద్యమ స్ఫూర్తిని రగిలించాలి.

*

నివాళి

❖ చిలికా

# కుయి ప్రజాకవి
# కుయి లిపి సృష్టికర్త
# కామ్రేడ్ దాసురామ్ మాలేకాకు జోహార్లు

*ఫిబ్రవరి 21న అంతర్జాతీయ భాషాదినం సందర్భంగా మాలేకాను స్మరించుకుందాం*

[illegible] హజ కవి. ప్రజల కోసం వందల పాటలు రాసాడు. ఆ పాటల [illegible]ంగా ప్రజల ఆర్తి నిండి వుండేది. అతడు వాగ్గేయకారుడు. తన పాటలకి [illegible]నిచ్చి గానం చేసిన గానకోకిల కూడా కావడంతో అతడిని ఒరిస్సా గద్దర్ అ[illegible] కూడా అంటారు. అతని పాట, మాట సాయుధ పోరాట బాటగా అనేక వేదికలమీద ప్రదర్శనా రూపాన్ని పొంది తానొక విప్లవ ఝుంఝూ మారుతంగా ఎదగడంతో సుబ్బారావు పాణిగ్రాహి వారసుడుగా అందరి చేత గుర్తింపబడ్డాడు. ఒరిస్సా ప్రజల హృదయాలలో చెరిగిపోని ముద్రవేసిన ప్రజాకవి భగత్ చరణ్ పాణిగ్రాహికి సరైయినా వారసుడుగా కూడా ఒరిస్సాలోని అభ్యుదయ కాముకులందరూ గుర్తిస్తారు.

ఫిబ్రవరి 21న భాషా దివస్ జరుపుకుంటున్నాం. మానవ సమాజ పురోగమనానికి భాష చేసిన దోహదం గొప్పది. సామాజిక వికాసంలో భాగంగా వచ్చిన వర్గాలు భాషను ఒక దోపిడి, అణచివేతల సాధనంగా, సరుకుగా కూడా మార్చివేసారు. పాలకులు ఇంగ్లీషు, హిందీలాంటి భాషలకు పెద్ద పీట వేసి స్థానిక భాషల అభివృద్ధిని ఆటంకపరుస్తున్నారు. నిర్లక్ష్యం చేస్తున్నారు. దోపిడి వర్గాల భాషను అధిపత్య భాషను చేసి ఆధిపత్యం చలాయిస్తున్నారు. ఇక ఆదివాసుల భాషను గుర్తించడం, దానికి లిపి సృష్టించడం ప్రోత్సహించడం అసలే లేదు. అటువంటి సందర్భంలో కా॥ దాసురామ్ కుయి భాషకు చేసిన సృజనాత్మక కృషి చాలా గొప్పది. అన్ని భాషలను గౌరవిస్తూ ఈ సందర్భంగా కా. దాసురామ్ కృషిని గురించి తెలుసుకుందాం.

భావ ప్రకటనకు భాష ఒక ముఖ్య సాధనం. మానవుల మెదడు కింది దవడ నుదురు, నాలిక సంపూర్ణంగా అభివృద్ధి చెందిన తరువాతనే సంజ్ఞలతో, ధ్వనులతో తమ భావాలను తెలియజేసేవారు. 50 వేల సంవత్సరాల చరిత్ర కలిగిన భాషకు స్వరపేటిక నుండి వచ్చే 90 రకాల ధ్వనులే ఆధారం. ఈ ధ్వనులే పదజాలాలుగా, మాటలుగా భావాన్ని సృష్టీకరించే భాషగా రూపాంతరం చెందాయి. కామ్రేడ్ దాసురామ్‌కు భాష పుట్టుక పరిమాణం, భాషకు చెందిన మూల పదజాలం, వ్యాకరణం, లిపి, వాటి మధ్య సారూప్యత, అలంకార శాస్త్రాల పుట్టుక - అభివృద్ధి లాంటి భాషా శాస్త్రాల విషయాలు, ఆ సామాజిక చరిత్ర తెలియవు. అతడు ఏడవ తరగతి మాత్రమే చదువుకొన్న వెనకబడిన ఆదిమతెగ (పి.టి.జి) కు చెందిన కుయి బిడ్డడు. జీవితాన్ని చదివాడు. దుర్భర దారిద్ర్యాన్ని అనుభవించాడు. మతం మత్తులో భక్తి పారవశ్యంతో ముక్తి మార్గానికి పాటలు కట్టి పాడి పరవశమై ఇహలోక కష్టాలను అధిగమించాలనుకున్నాడు. కాని అడుగడుగునా తనను చుట్టి ముట్టి వెంటాడి వేటాడిన భయంకరమైన దారిద్ర్యం, ఆకలి, దుఃఖం, అనారోగ్యాలకు గల కారణాలను అన్వేషించాల్సిన వాస్తవ స్థితిలో పోరాడక తప్పదనే విప్లవ సత్యానికి బాట మార్చి తనకున్న జ్ఞానంతో తమ జాతి కష్టాలని కడగండ్లని మాటల తూటాలుగా పేర్చి పాటలల్లి దోపిడీ సర్కార్‌పై సాయుధపోరాటమై విజృంభించాడు. అతడిప్పుడు పెన్నుగన్ను పట్టిన సాయుధ సాంస్కృతిక యోధుడు, సేనాని కూడా.

అందుకే కా.దాసురామ్ మాలేకా అంటే అటు ఆంధ్ర, ఇటు ఒరిస్సా పోలీసులకు కొరకరాని కొయ్యగా మారాడు. అణిచివేతలో ముందంజలోవున్న ఆంధ్రాగ్రేహౌండ్స్ పోలీసులు అతన్ని రాయగడలో అరెస్టు చేసి కొమరాడ, పార్వతీపురం స్టేషన్లు తిప్పి 16 రోజులు తీవ్ర చిత్రహింసలకు గురిచేసి 16 నెలలు విశాఖ జైలులో పెట్టారు. విడుదల అనంతరం ఒరిస్సా పోలీసులు ఆర్. ఉదయగిరి జైలులో పెట్టారు. దాసురామ్ అరెస్టును రాష్ట్రంలోను ఇతరచోట్ల వున్న రచయితలు, కళాకారులు, ప్రజాస్వామికవాదులు ఖండిస్తూ ఉద్యమానికి సంఘీభావం ప్రకటించారు.

జైలు నిర్బంధంలో సర్కార్ స్వభావాన్ని అమూలాగ్రం గ్రహిస్తూ తన అనుభవంతో సర్కార్ ఎక్కడెక్కడ వున్నదీ అని ఆలోచించాడు. తన వూరు, తమ బతుకు, ఆ చీకటి వెతల్లోకి వెళ్ళి వెతుకులాడాడు.

తన మాటల్లోనే ....

గుడిరీకా సర్కార్ కథ చెప్పటానికి లేదు. ఇక్కడ చౌకీదార్ ఒక సర్కార్. అకారణాన్ని సకారణంగా చూపించి హుకుంలు జారీ చేస్తాడు.

"మీ గ్రామంలో బురద ఎందుకు వున్నది. గ్రామ ప్రజలు రెండు వందలు డబ్బులు కట్టండి"

"మీరిద్దరు అన్నదమ్ములు సారాతాగి ఎందుకు గొడవ పడుతున్నారు. స్టేషన్‌కు యాభైరూపాయలు కట్టండి"

ఫారెస్టు గార్డు వస్తాడు అతడు ఒక సర్కార్.

"ఆవులు, పోతులు ఉంచుకుంటున్నారా! అవి అడవికి నష్టం చేస్తాయి. ఆవు, పోతు ఒక్కొంటికి రూపాయి. మేక ఒక్కొంటికి యాభైపైసలు కట్టండి. కట్టకపోతే బంధించి తీసుకువెళతాను."

వార్డు మెంబర్ మూడవ సర్కార్, కుమటి సర్కార్, వడ్డీ షావుకారు సర్కార్, వార్డు మెంబర్ సర్కార్ కోడిని వండి ఇప్ప కల్లు తాగుతాడు. వార్డు మెంబర్ పెద్ద సర్కార్.

"వృద్ధాప్య పింఛన్ తెస్తాను. పైసలు ఇవ్వు. బి.పి.ఎల్. కార్డు కొనాలి., మెహర్ వేయాలి, డబ్బులు ఇవ్వు" చిన్నప్పటి నుండి ఈ సర్కార్‌ల గురించి వింటున్నాడు. సర్కార్ వాళ్ళ కథ చెప్పుకుంటే శీతాకాలం వెచ్చటి దుస్తులు, ఎండకాలం తెల్లటి ఖద్దరు దుస్తులు, వర్షకాలం రైను కోటు వేసుకొని వస్తారు.

వాళ్ళు చీదరిస్తారు.

వాళ్ళు హెచ్చరిస్తారు.

వాళ్ళు దోపిడి చేసి తీసుకెళతారు.

వాళ్ళు బంధించి తీసుకెళతారు.

సర్కారు వాల్లు వస్తే తలుపులు మూసుకుపోతాయి. మాష్టరును అడుగుతారు. "జీతంలో సగం ఇవ్వు. ఇంటికి వెల్లి కూర్చో"

"రోడ్లు వెయ్యనక్కరలేదు. మాకు కొంత ఇవ్వు, బిల్లు తీసుకో. కరెంటు వాల్లకు చెబుతారు. కొద్దిగా స్థంభాలు పాతండి. కరెంటు తీగలు అమ్మి సగం వాటా మాకివ్వండి."

"ఇక్కడ డాక్టర్ వద్దు, కాంపౌండర్ అవసరం లేదు. చెట్ల వ్రేళ్లు, బెరడులు, గుణి గారడిమీద ఆధారపడతారు. నీ జీతంలో మాకు కొంత ఇవ్వు. ఇంట్లో వుండు, అక్కడ ఫీజ తీసుకొని రోగులను చూడు."

"సారా వండద్దు, లైసెన్సు తీసుకొన్న కుమటి, సుండీల దగ్గర కొని తాగండి" అని భయపెట్టి వెళతారు సారా సర్కార్.

ఇలాగే జైలు సర్కార్, రాజ్యం అణిచివేత సాధనమని, అది భౌతికంగానే కాక మానసికంగా హింసించుతుందని, సంస్కృతిని, భాషని అవహేళన చేస్తూ,

దారిద్ర్యాన్ని వేలెత్తి చూపుతూ క్షణ క్షణం బాధల సుడిగుండంలోకి నెట్టేస్తుందని గ్రహించాడు. అక్కడ జైల్లో జైలు అధికారి నీకు భాష లేదా, నీ భాషలో రాసుకో అని తిట్టినప్పుడు తన భాషకు లిపిలేదన్న వాస్తవం కళ్ళకు కట్టిన అతడి హేళన, అధికార భాషల వివక్ష రాజ్యం తాలూకు అణిచివేతలపై ప్రతి క్రియగా తిరస్కారంగానూ, ధిక్కారంతోను తన భాషకు తనే లిపిని సృజించే శిల్పి అయ్యాడు.

భారతదేశం బహు భాషల నిలయం. 1861లో ప్రభుత్వం 1652 భాషలను గుర్తించింది. అందులో నాలుగోవంతు ఆదీవాసీ భాషలే. 1981 వచ్చేసరికి వాటిని 106కు కుదించారు. ఇక భారత రాజ్యాంగం 14 భాషలనే అధికార భాషలుగా గుర్తించింది. ఈ సంఖ్య 1980లో 18కు పెరిగింది. కేంద్ర సాహిత్య అకాడమి ఇంగ్లీష్‌తో కలిపి 21 భాషలను గుర్తించింది. లిపిలేకున్నా, వ్యాకరణం లేకున్నా, యాసవున్నా వాటిని భాషగా గుర్తించటం లేదు. మాతృభాషలో విద్యాబోధన చేయాలని చెప్పుతున్న 'రాజ్యాంగం' సాక్షిగా ఈ దేశంలో వందలాది భాషలు లిపి సృష్టించకుండా ఈ దేశపాలక వర్గాలు అడ్డుకొంటున్నాయి.

పార్టీ కార్యక్రమంలో ప్రజల భాష, లిపి వికాసానికి సాంస్కృతిక రంగంలో కార్యకర్తలు కృషి చేయాలన్న కర్తవ్యానికి కట్టుబడిన కార్యకర్తగా జైలులో వున్న 16 నెలలు అవిశ్రాంతంగా పరిశోధించి కుయి మౌఖిక భాషకు లిపిని (లిఖితాక్షరాలను) కనుగొన్నాడు, ఆవిష్కరించాడు, సృష్టించాడు సృజన శిల్పిఅయ్యాడు.

తక్కువ అక్షరాలతో సులభ గ్రాహ్యమైన తేడాలతో మాతృభాషకు అక్షరాలనిచ్చి మాతృభాషా ఉద్యమ చరిత్రలో మైలు రాయిగా నిలిచాడు.

"స్వయం ప్రతిపత్తి కోసం, వారి భాషలకు సమాన హోదా కోసం ప్రత్యేక రాష్ట్రం కోసం ఇటువంటి ప్రజాస్వామిక డిమాండ్లకోసం - ఆధిపత్యం అణిచివేత వివక్ష, నిర్లక్ష్యాలకు వ్యతిరేకంగా పోరాడుతూ - జాతి పరమైన ఒంటరితనం నుండి వారిని బయటకు తెచ్చి అంతర్జాతీయ సౌభ్రాతృత్వ స్ఫూర్తిని పెంపొందించాలి అన్న మార్క్సిస్టు - లెనినిస్టు వైఖరి కామ్రేడ్ దాసురామ్ మాలేకా నిత్య కార్యాచరణలో ప్రస్ఫుటమయ్యేది.

పీడిత ప్రజల వాస్తవ జీవితాల లోతైన అవగాహనే కా॥ దాసురామ్‌లోని చైతన్యానికి, కార్యాచరణకు తోడ్పడిన బలమైన అంశం. అతను నమ్మిన ఆదర్శాన్నే ఆచరిస్తూ జీవితాన్నుంచి ఎదిగిన నిజమైన విప్లవకారుడుగా సాంస్కృతిక యోధుడుగా నేటి కాలానికి సరిపడే విప్లవ సాంస్కృతిక సేనానిగా, డివిజన్ పార్టీ నాయకుడుగా ఆంధ్ర-ఒరిస్సా ప్రజల హృదయాలలో నిలిచిపోతాడు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో జననాట్యమండలి 500 పాటలు రాసినట్లు లిఖిత చరిత్ర చెప్పుతున్నది. దాసురామ్ ఒక్కడే రాసిన పాటలు దరిదాపుగా ఆ సంఖ్యలో వున్నాయని, కొన్ని మాత్రమే అచ్చులో వచ్చాయని, "నిస్సాన్" "ఇంక్విలాబ్" పత్రికల ద్వారా తెలుస్తుంది. జె.ఎన్.ఎమ్.లాగానే దాసురామ్ సాంస్కృతిక బృందం రాయగడలోను, గజపతి జిల్లాల్లోను, ఆంధ్ర గ్రామాల్లోను భువనేశ్వర్ లాంటి పెద్ద పట్టణాలలోను అనేక ప్రదర్శనలిచ్చింది. ప్రజాపోరాటాల్లో ఐక్యవేదికల్లో ముఖ్యంగా సాహితీ సాంస్కృతి వేదికల్లో దాసూరాం ప్రముఖంగా రాణించాడు.

ఆదివాసుల అనారోగ్యంపట్ల ప్రభుత్వానికి నిర్లక్ష్యం కారణంగా, ఆ ప్రజలపట్ల చూపే వివక్ష కారణంగా 2007 సెప్టెంబర్ 10న, తన స్వగ్రామం గుడారి పంకాలో హైజాకు (కలరాకు) గురియ్యాడు. అకాల మరణం పొందాడు. తన గ్రామంవాళ్ళు ఆతృతపడ్డారు. యువకులు పరుగులు పెట్టి తెచ్చిన మందులు అందకముందే తమ ప్రియతమ నాయకుడి ప్రాణాలు పోవడం చూసి గ్రామస్తులు తట్టుకోలేక కన్నీరు మున్నీరు అయిపోయారు. ప్రజల కలం, గళం, విప్లవ చైతన్యం దాసురాం భౌతికకాయంలో స్తంభించాయి.

కా.దాసురామ్ అకాల మృత్యువార్త విప్లవ ప్రజానీకంలో, సాహితీ సాంస్కృతిక సంస్థల్లో బాధను కలిగించింది. కుయి భాషకు లిపిని సృష్టించి గ్రామ గ్రామాన పాఠశాలలను నెలకొల్పి భాషను కూడా ఉద్యమంగా ముందుకు తీసుకెళుతున్న తరుణంలో కా.దాసురామ్ ద్వారా పేరు ప్రతిష్ఠలు పొందిన కుయి జాతి ప్రజలు తాము ఏమి కోల్పాయామో గుర్తించి ఆవేదన చెందుతున్నారు. దాసురామ్ ఆశయాలను సాంస్కృతిక వేదిక నడుపుతున్న నిస్సాన్ ప్రత్యేక సంచిక తెచ్చింది. అందులో వచ్చిన విరసం కార్యవర్గం సభ్యుడు వరవరరావు సంతాప ప్రకటనలోని రెండు మూడు మాటలు.

"ఒరిస్సా విప్లవ కవి, ప్రజా గాయకుడు, సాంస్కృతిక కార్యకర్త కా.దాసురామ్ మాలేక రహస్య జీవితం గడుపుతూ హైజాకు బారినపడి మృత్యువుకు గురైన వార్త నన్ను అవాక్కును చేసింది. హరప్పా-మొహెంజదారో సంస్కృతులను; కాను, సిద్దూ విప్లవ సాంస్కృతిక వారసత్వాన్ని దాసూరామ్ వర్గపోరాటంగా రూపాంతరీకరించాడు. నక్సల్‌బరీ, శ్రీకాకుళం విప్లవోద్యమాల ప్రేరణ పొంది కా.సుబ్బారావు పాణిగ్రాహి వారసుడుగా నిలిచాడు. విరసం తరఫున, వ్యక్తిగతంగా కా.దాసురామ్ మాలెకాకు వినమ్రంగా శ్రద్ధాంజలి అర్పిస్తున్నాం."

*

## స్వీకారం

1. **పెత్తనం**
   మల్లీశ్వరి కథలు
   వెల : 40/-
   ప్రతులకు : కె.ఎన్. మల్లీశ్వరి, 39-5-11, II లే అవుట్
   మురళీనగర్ - 530 007, విశాఖపట్నం
2. **మా అమ్మ 'నీల'**
   ముచ్చట్లు, జ్ఞాపకాలు, వంటలు
   రచన : రమా మేల్కొటె
   లిఖిత ప్రెస్
   వెల : 25/-
   ప్రతులకు : లిఖిత ప్రెస్, హెచ్.ఐ.జి - 2, బి-12, ఫ్లాట్ : 1
   బాగ్‌లింగంపల్లి, హైదరాబాదు - 44
3. **కవాతు**
   ఇస్లాంవాద కవిత సంకలనం
   సంపాదకులు : షేక్ కరీముల్లా
   వెల : 40/-
   ప్రతులకు : షేక్ కరీముల్లా, 21-36, పెద్ద మసీదు బజారు
   వినుకొండ - 522 647, గుంటూరు జిల్లా
4. **ఖండిత**
   వి. ప్రతిమ కథలు
   వెల : 70/-
   అన్ని పుస్తకాల షాపుల్లో దొరుకుతుంది
5. **జవాబు రేపిన ప్రశ్నలు**
   నాగభూషణాచార్యుల కథలు
   ఆలోచన ప్రచురణ
   వెల : 60/-
   అన్ని పుస్తకాల షాపుల్లో దొరుకుతుంది
6. **మంచులోయ**
   ఒమ్మి రమేష్‌బాబు కథలు
   లిఖిత ప్రెస్
   వెల : 135/-
   ప్రతులకు : వై. నిర్మల
   హెచ్.ఐ.జి. - II, బి-12, ఎఫ్-1
   బాగ్‌లింగంపల్లి, హైదరాబాదు - 500 044

కవిత్వం

## వడ్డెబోయిన శ్రీనివాస్ కవితలు మూడు

### వడ్లగింజ

గుడ్లొల్సుకొని
గడ్డెబంగారిగుత్తైవేలాడ్తాను
నేను
వడ్లగింజను!
మండెకట్టుకొని
గుండెనిండా వేర్ల వేకువతో
ఈ ప్రపంచాన్ని పలకరిస్తాను

నాగలిపాటతో నడిచి
బురద పొలపు కౌగిలిలో కరిగికరిగి
మట్టిచేతుల మోహించి
కలనై అలనై ఊగుతుంటే
కడుపులో
యములు జొరబడుతారు
ఆకు పచ్చతుమ్మెదలా
మలయమారుత ఝుంకారంచేస్తుంటే
వేర్లనంతా దోచుకొని
కొనఊపిరి తలనెక్కి
కొంగ్రపట్టిన ఆశలనెక్కిరిస్తుంటే
కొమ్ములతో కుమ్ముతూ కొనుగోలుశక్తి
వికటాట్టహాసం చేస్తున్నప్పుడు

బస్తాలకొద్దో
బకీట్లకొద్దో
బలవర్ధకాలో
బలివితర్కులో
పురుగుమందులో
పురుగువిందులో
మల్టినేషనల్ కంపెనీ
మట్టిమనిషిని ఒల్చుకుతిన్నాక
అప్పుల తరంగాల మధ్య
పల్లెవెన్నుమీద పాలుబోసుకునే నేను
వరిగొల్సునైయ్యొ
ఉరి గొల్సునైయ్యొ
ఉయాలలూగుతున్నా
రాజకీయం తిని
రాజకీయం తాగే
రాజ్యంరాతి కుర్చి చలించదు

యంత్రం ముద్రించిన ధరనగతో
కంపెనికన్నబిడ్డ
కన్నుమిన్ను తెలియక తిరిగే కాలంలో
గిట్టుబాటు గిల్లికజ్జమనుకున్నా

ఆశలు ఎండిన భవిష్యత్తును మోస్తూ
అశ్రువుల్ని ఆకలికిమింగుతూ
అన్నంపంచేవాడు
ఇవ్వాళ
అసువులు యాచించడానికీ
చేతులు కోల్పోయాడు

అయ్యో!
పెట్టుబోతల్లీ
మట్టిచేరువకు దించినా
మరణరణ మడికట్ల మధ్య
మనిషిచిగురిస్తాడు
ఎలుకలు కొరికేసినా -
చిలుకలాపచ్చబడుతాడు
గుడ్లగూబను
గుండెల్లో దాచుకుంటాడు

నేను
వడ్లగింజనేకావొచ్చు
కాని
మెతుకంటే
చెమటచుక్క కదా!
బతుకంటే
మడికట్టుకదా!
మనిషంటే
మట్టికదా!

### 'అణు' జాలం

రెడీమేడ్
'అణు'రాగం చూసి
విరిగిన సంతకాలు పరుచుకున్న
హృదయపువాకిలి తెరిచావు

జీవితాలు ముక్కలు ముక్కలుగా
మింగి త్రేన్పే
ఒక ఫాస్టుఫుడ్ బహిరంగవేశం చూసి
భ్రమలాలంకారాల

ఒక నరకపు పాన్పుమీద
బాహువుల్లో ముడేశావు

పాయిజన్డు ప్రేమలో పడితే
బహుశా
కళ్ళకు చూపుండదు
కాళ్ళకింద మట్టుండదు
ఒకనొప్పి ఉండదు
మనస్సులో
ఒక ఎడారి విస్తరించి
అంతర్గత ముఖ చిత్రం
'అణు' మోహంలో నిరాకరిస్తావు

శిలువెక్కినా
ఎండిన జలపాతాలకు
శిలలు కొట్టడం వదలని ప్రవృత్తి
నీకు శీఘ్ర ప్రీతి

సార్వభౌమత్వం వెన్నెముక కరిగి
గ్రాపు అడుక్కి సాగిలపడడం
గరికపోచ
అనుభవమవుతుంటే -
ఇప్పుడు
దేశభక్తంటే
దేశాన్ని తాకట్టుపెట్టడం కదా!
ఇప్పుడు
దేశమంటే
మనుషులుకాదు
మార్కెట్టు !
వధించి
ప్రాణాల్తో వదలడం
బహుళ జాతిన్యాయ సూత్రం !
సద్దాములంకాదు కదా -
గొంతు బిగుస్తున్నా
గొప్ప ఆనందమే!
గాట్లు పెడుతున్నా
గారాలు పోవడమే !
రాజ్యమా!
రగిలే
'అణు' మానాల్లేవ్
అందరం
కళ్ళు తెంపుకుంటున్నాం
మెదళ్ళు చిదుపుకుంటున్నాం
చీకట్లోనే
చిర్నవ్వుల చిందులేస్తాం

చుక్కలచారల బూచోడు
చాపలా చుట్టి
సంకలో పెట్టుకోడానికి
తలల్ని తెంచి
తల్వారు గుచ్చుతాం
రాజ్యమా!
మేం సిద్ధం
రెడీ ఒన్... టు... త్రీ... *

## మహమూద్ కవిత

### కొత్త కవనం కోసం ...

ప్రతిదినం ఒక కవితైనా రాయాలి
ప్రతిక్షణం కవితకి దాసోహం అయిపోవాలి.

విశ్వం తన వొంటిపై పాలపుంతలను చెక్కుకున్నట్లు
ఆవేశం - ఆలోచన నిండిన
కవితాక్షరాలు కాగితంపై పరుచుకోవాలి

కన్నీటి తడిస్పర్శ తగిలి
ముక్కలవుతున్న ఉప్పుగది హృదయాలను
కవితావేశంతో రగల్చాలి

ఎన్నాళ్ళయిందో
బహుశా ... దశాబ్దాలైందేమో
ఒక మంచి పద్యం రూపుదిద్దుకొని
మనసును పులకరింపజేసి ...

మనసును పులకరింపజేయడమే కాదు
పోతలో పోసి కరిగించిన ఇనుములా
నర నరంలోని రక్తం సంఘటితమై
దౌడు తీయించే పదాలెక్కడజోడౌతున్నాయనీ ...?
ఏ కలాలు జారవిడుస్తున్నాయనీ ...?

బాగున్నట్టే అనిపించి ... కొద్దిగా కదిలించి
కాసేపటికే వెలిసిపోయే నగ్నదృశ్యాలు అదృశ్య అవహేళనమే ... !
కవిత్వం తుప్పుపట్టవలసిన లోహం కాదు
కలకాలం గుండెల్లో పాతుకుపోవాల్సిన ధ్వజస్థంభం

బహుశా...
పదదేహపు ప్రాంగణానికి
ఎండుటాకుల కరకర శబ్దాలు తప్ప
పూ లతల సుకుమారం తగిలేటట్టు లేదు

గతకవితా పదరురుల పెదవులద్దిన స్పర్శరుచి గుర్తు
ఇప్పుడంతా ఉప్పుసముద్రాల లవణీయం తప్ప
తీపి ప్రయోగాల కరువు

అనుభవాల పాఠాలు చదివి
బరువెక్కని మనసులు ఏం చేయగలవూ?
రాహిత్యం... దృక్పథరాహిత్యం
దృక్పథ పదరాహిత్యం
లక్ష్యంలేని దృష్టి ఏం చూడగలదనీ ... ?
ఎడారుల బిడారుతనం కప్పుకున్న
అంతరంగాల్లోంచి కవిత్వమెలా జనిస్తుందీ ?

గట్టిగా మూయబడ్డ గదుల వ్యక్తిత్వ ఒంటరితనంలో
స్పందనలనూ, కదలికలనూ, చలనాలనూ,
చైతన్యాలనూ అంగీకరించి ఆహ్వానించలేని
మనస్తత్వాల అహంకారాలలో
కవిత్వమెలా చిగురులు తొడుగుతుందీ?

అహంకారం అహంకారాన్నే పుట్టిస్తోంది
వాదన వాదననే రగిల్చి
ఫలితం బూడిదై మిగులుతోంది
సాధనకు సమయమెక్కడిదీ? సంభాషణలకు వీలెక్కడిదీ?

విశాలంగా, విస్తృతంగా పెరుగుతోంది
మాటల మధ్యదూరం
కురుచనైపోతోంది సంభాషణల పర్వం

ఒంటరితనాల బిగికౌగిలిని విదిల్చే
సంఘటిత స్పర్శ అవసరం
ఒంటరి ప్రయాణాలనువొదిలి
సమూహ ప్రవాహాల్లోకి బిందువులమై పారడం అవసరం
అక్షరాలకు అర్థాల వ్యాధినిరోధకతను
నింపే శక్తి అవసరం
దూరాలను దూరం చేసే
అడుగుజాడలకేసి, దారులకేసి, దారాలకేసి
కరచాలనాలను నిర్దిష్టపరిచే సాంగత్యాలకేసి
నడవడం అవసరం

శబ్దాన్ని శబ్దంతో పలకరించి
అక్షరం జనాన్ని జాగృతం చేయాలంటే
జనం నిలబడిన స్థానంకేసి పరుగుపెట్టాలి
అపుడే
కవనం
జన హృదయకెరటమై లెగుస్తుంది..  *

## ఛాయా తరంగా కవిత ఒకటి

# జ్ఞాపకం

ఫ్రెంచ్ నుండి తెలుగు : బాల్‌రెడ్డి

మీరెప్పుడు కీర్తి కొరకు తపించలేదు, కన్నీటిని చాటనూ లేదు
బాధ, వేదన జమిలిగా మిము చుట్టుముట్టి తిప్పలుబెట్టినా
ధిక్కారం మా చిరునామంటు చాటినట్టి ధీరోదాత్తులు
కాలంలో కరిగిపోయినవి పదిన్నొక సంవత్సరాలు
జనంతోటే జీవితమన్నరు స్నేహితులు, సేవకులైనరు
మృత్యువు మీరూపును తుడ్చిన మా కనులోన వెలుగై ఉన్నరు
మా నగరం గోడలు అన్ని మీనవ్వు నెదపై ఎత్తుకున్నవి
మంచువోలే మనసును కోసె భయంగొల్పె నిశ్శబ్ద రాత్రిలో
వెలిసిన మీ పోస్టర్లిప్పుడు కాలం మొఖం మీద నెత్తుటి మరక
ప్రియమైన ప్రణవంలాగా మా పెదాలు పలికన పేర్లు
ఇప్పుడిక్కడ పలికితె ఘోరం గొంతుదాటి వస్తే నేరం
వణుకుతున్న హంతక మూకలు మీ ఆనవాళ్ల గాలిస్తున్నయి
మీరు కసి రగిలిన గొంతులలోన విషాదపు విద్యుత్ గీతం
ఈ లోకపు గమనంలోన మీజీవితమొక మహోదయం
నేల తల్లిరుణం తీర్చడమే అను నిత్యం మీ తపనయనది
కడుపులోని పేగులాగ కాసుకుంద్రు ప్రజలు మిమ్ముల
రక్కసులిట వేటకుదిరిగే నడిజాము రాత్రి వేళలో
నగరపు వీధుల్లో వెలిసిన మీ ఫోటోల పోస్టర్ కింద
మా రేపటి భవిత్యం కొరకు మీ బతుకు ముడుపుకట్టారన్నరు
పగలు వెలుగు క్రీనీడల్లా వీధులన్ని పోలీసుల జాడలే
చిట్ట చివరి చలిరాత్రులలో మీరు గడిపిన తుది గడియల్లో
మొక్కవోని ధైర్యంతోని నిబ్బరంగా మీరన్న మాటలు
కడవరకు పోరినవారికే నవ్యజగతి పంచానందం
చావుకు మిము ఎరజేయాలని గురిజూసే సిపాయిని జూసి
వీడు గూడ మనలో ఒక్కడు, మన జాతిలో భాగమేనన్నారు
వీడ్కోలిక సుఖ దుఃఖాలకు, వీడ్కోలీ సుమవనాలకు
వీడ్కోలీ జీవితానికి వీడ్కోలిక ఈ వెలుగుకు గాలికి
నా జీవన సహభాగమా! ఓ ప్రియతమ బహిర్హృదయమా!!
నా జ్ఞాపకాలు నీ మది నిలుపుకో ఆనందపు జీవితమెంచుకో
అందమైన ప్రతి ఉషస్సులో అణువణువున నెలవై ఉండు
కనుమల శిఖరాగ్రం మీద ఉదయించును అరుణ భానుడు
అందమైన ప్రకృతి ఒడిలో చక్కటి మన పెరటితోటపై
వీచె స్వేచ్ఛ గాలుల కింద విజేతగా పెను నిద్రలో నేను
ఓ నెచ్చెలి, నా ప్రియసుతుడా నే పలికే కడపటి మాటిది
ఫల, పుష్పపు వనాలవోలే ఫలించాలే మీ బతుకులు భవితలో
విద్వేషపు తుపాకి నోళ్ల నిప్పుల జడి కురిసినప్పుడు
ఇరవై ముగ్గురు వాళ్లు ఎదురొడ్డిరి గుండ్లకు గుండెను
ఏ మట్టిన పుట్టినవారో, అయినా వాళ్లు మన సోదరులు
అవునా ఇరువయి ముగ్గురు చావును ముద్దాడిన వారు
అవునవునిరువైముగ్గురు సాహసులు సమర భూమిలో
తల్లి చెరను విడిపించడానికి తమ తనువులు వెలిగించారు.  *

## ప్రొ. జోస్ మారియో సెజాన్ కవిత ఒకటి

### గెరిల్లా

#### ఫ్రెంచ్ నుండి తెలుగు : బాల్‌రెడ్డి

నేను పసిపాప మొఖాన విరిసిన నవ్వును
ఎడబాటు వేళ వధువు చెక్కిట కన్నీటి చుక్కను
రాలిన ఆకుల జాడన చివురులు తొడిగే ఆశను
వలపున పిలిచే వసంత యదు కోకిల మధుగీతిని
సాగే కరిమబ్బులిసిరే తొలకరి స్వాతి చినుకును
మనసొప్పక, విధితప్పక మది విదిల్చే నిట్టూర్పును
నేను అమాయకపు పసిమనస్సు వేసే ఆకలి కేకను
అగాధమెంతో తెలియని అనంత జలసాగరాన్ని
మదిని హృదిని కలిపి నిలిపే ఉద్వేగపు వెల్లువను
వెనుదిరగక రణభూమిన చూపిన సాహస ఫలమును
శ్రమజీవుల ఒడలు కురిసే స్వేదపు సెలయేటి సిరిని
నేను గుసగుసల గుండె గొంతు పెదాల విరిసే పాటను
వెచ్చటి చెమటన పెరిగిన రైతుల పచ్చని పొలాన్ని
వినువీధంచుల తాకే విశ్వాసపు కేతనాన్ని
వడగాడ్పులు, సుడిగాలుల కొరగని నీ నమ్మకాన్ని
నివురున దాగని నిజాన్ని, దిక్కుల దాటే దృక్కును
త్యాగములో మొలచిన జీవన వన ఛాయనీడ
వెలిసిన విశ్వపు జాతి సౌహార్ద్రానుబంధాన్ని
సమభావన పంచి పెంచె సంతోషపు సిరినవ్వును
పెనుదుఃఖం, ఆనందం ఎల్లలు చెరిపెగిసినపుడు
దారపు పురి దండెదైన సంఘం ఏకీకృత శక్తిని
నిశ్చల నిశ్శబ్ద తటిన హృదయపు తంత్రులు మీటే
తుదనేది లేనె లేని మానవతా గీతాన్ని *

## పాల్ ఎల్వార్ కవిత ఒకటి

### మహాప్రస్థానం

వేకువ వస్తున్నది
చీకటి పోతున్నది
ఆకలి, శోకం మాసిన
లోకం రానున్నది వేకువ

నిఖిల లోక మహాజనం
నిద్దుర లేస్తున్నది
మగతవీడుతున్నది
ఒళ్ళు విరిచి కళ్ళు తెరచి
గళం విప్పుతున్నది
పదం పాడుతున్నది
మానవతను సృష్టించే
మరో యుగం సృషించగ
తెన్ను వెదకుతున్నది
గన్ను పట్టనున్నది వేకువ

దుష్ట దోపిడీ వ్యవస్థ
పునాదులే కదల్చగా
విశ్వవ్యాప్తమ వరజనం
బార్లు తీరుతున్నది
కదం పదం భుజం భుజం
కలిసి నడుస్తున్నది
విశ్వ విప్లవం కోసం
విజృంభిస్తున్నది వేకువ

కులం, మతం, రంగు, జాతి
భేదాలను విస్మరించి
ప్రేమ, కరుణ వర్ధిల్లే
మానవ లోకం కోసం
కొత్త కొత్త మార్గాల్లో
కోరి నడుస్తున్నది
పోరాటం బాటల్లో
ఉరుకులు పెడుతున్నది
పరుగులు తీస్తున్నది వేకువ

అర్థం పరమార్థమనే
అల్పబుద్ధి అంతరించి
పర పీడన, శ్రమదోపిడి
గతకాలపు స్మృతికాగా-
అందరు అందరికోసం
ముందడుగై జీవించే
అందమైన వ్యవస్థకై
అర్రులు జాస్తున్నది
తన గమ్యం చేరేందుకు
తహతహపడుతున్నది
శక్తులన్ని కూడగట్టి
సమరం చేస్తున్నది
పురోగమిస్తున్నది వేకువ

ఉన్నతమే బ్రతుకెల్లినకై
ఉత్తమమే సంస్కృతికై
మంచి మంచి కలలుగనే
మహానంద వ్యవస్థకై
వేదన పడుతున్నది
వేగిరపడుతున్నది
విద్రోహులడ్డయినా
ఇడుమలెన్ని ఎదురయినా

వెన్నుజూపనన్నది
తెన్నువీడనన్నది
తెగువ జూపుతున్నది
గన్ను దింపనన్నది వేకువ

భయం భయం బ్రతుకుకన్న
చావేనయమన్నది
పిరికి మురికి చావుకన్న
పోరేనయమన్నది
వీరుడైన మానవునకు
చావేలేదన్నది
మంచి కోసమైన చావు
చావే కాదన్నది
విప్లవమే విముక్తికై
నిజం మారమన్నది
త్యాగాలే విజయానికి
హామీలంటున్నది
ఉప్పెనగా ఉప్పొంగుచు
విరుచుకుపడుతున్నది వేకువ

దాస్యం, దోపిడి మెచ్చే
చెత్త భరిత చెరిపేందుకు
శ్రమ జీవిని కీర్తించే
కొత్త చరిత రాసేందుకు
కత్తి లాంటి కలంబట్టి
కదం తొక్కుతున్నది
పట్టుబట్టి నడుంగట్టి
పయనం చేస్తున్నది
నేడు కాదు రేపయినా
గట్టు చేరనున్నది
ఒట్టువేసి చెబుతున్నా
ఒట్టిమాట కాదిది వేకువ

హింసకు, శ్రమ దోపిడికీ
హేతువైన ధన సభ్యత
ఒళ్ళు కుళ్ళి వయసు మళ్ళి
ముక్కి మూల్గుతున్నది
చికిత్సకేదారి లేక
చిత్తయిపోతున్నది
రొప్పుకుంటు రాజుకుంటు
బ్రతుకు గడుపుతున్నది
చావువేళ దాపురించి
గుటగుటమంటున్నది
గుటుక్కుమన నున్నది వేకువ

సంక్షోభం, సంగ్రామం
సమాధి కానున్నవి
పుడమి తల్లి గుండె పొంగి
పులకించగనున్నది
మమత సమతన రాజ్యానికి
ఊపిరి కానున్నది
శాంతీ, సౌఖ్యం సర్వుల
సంపద కానున్నది
నిరాశకా చోటులేదు
దురాశ కానేకాదిది
భవిష్యత్తు పురోగామి
శక్తులదేనన్నది వేకువ

అందం, ఆనందాలతో
జగతినిండనున్నది
క్రాంతి కాంతి జగమంతా
వెల్లివిరియనున్నది
ఈ భూమే స్వర్గంగా
వెలుగొందగనున్నది
ప్రగతిశీలపు యుగపురుషుల
కలలు పండనున్నవి వేకువ

ఈ దోపిడి భూతానిది
మేడిపండు సౌందర్యం
దీని మిలటరీ యంత్రం
మేకపోత్తు గాంభీర్యం
ఇది జరిపే ఘోర హింస
ఆరనున్న దీపం కథ
ఇన్ని మాటలెందుకులే;
ఇది పేపరు టైగరులే
దీని చావు తథ్యంలే
ఇది చరిత్ర సత్యంలే వేకువ

ఆకలి శోకాలువినా
మనకున్నవి ఏమున్నవి
అధోజగత్ సోదరులం
అసంఖ్యాకులం మనం
ఐక్యత మనుమన దుర్గం
త్యాగం మన సహజాతం
ఒక్కుమ్మడి కదిలామా
ఎదురు దెబ్బ తీశామా-
ఈ భూతం మృతి ఖాయం
శ్రమ దోపిడి మటుమాయం
సమసమాజ జనతంత్రం
జగమంతా పరివ్యాప్తం!
ఎందుకింక సందేహం?
దేనికింక ఆలస్యం?
బిగించండి పిడికిళ్ళు;
పోయేవే సంకెళ్ళు!

*

పుస్తక సమీక్ష ❖ అరుణ

# కథలు కాని వ్యథలు - బేతాళ కథలు

మామూలుగా ఏ విషయాన్నైనా, మార్క్సిస్టు ఆలోచనా విధానం అలవడినవారు, పరిశీలించి అర్థం చేసుకొనే పద్ధతి వేరుగా వుంటుంది. అది వాస్తవాల మీద ఆధారపడి శాస్త్రీయంగా వుంటుంది. ఐతే దురదృష్టవశాత్తూ మార్క్సిస్టులు ప్రతిదాన్ని విమర్శిస్తారనీ జరుగుతున్న అభివృద్ధిని మెచ్చుకోరనీ, అసలు వాళ్ళంతా అదేదోరకమనీ, సమాజమంతా ఒకదారైతే, వాళ్ళ దారి వేరనీ వగైరా వగైరా అభిప్రాయాలు ప్రచారంలో చేయబడ్డాయి. తాత్వికంగానే మార్క్సిజాన్ని వ్యతిరేకిస్తూ పెట్టుబడి దారీ సమాజాన్ని పరిరక్షించుకోవాలనుకునే శక్తులు పనిగట్టుకొని ఈ అభిప్రాయాలు బలంగా ప్రచారం చేయొచ్చు. ఎందుకంటే అసలు మోసాలు ప్రజలకు అర్థం గాకుండా చేయడం వాళ్ళకి చాలా అవసరం కాబట్టి. వారి నీడలోనే నిశ్చింత అనుకునే మేధావులు వాటిని బలపర్చవచ్చు. మనమేం చేయలేం. కానీ బూర్జువా ప్రచార సాధనాల ద్వారా మాత్రమే ప్రపంచాన్ని చూసే మధ్య తరగతి ఉద్యోగులు, విద్యార్థులు చాలామంది సమస్యలకి చాల కారణాలు తెలుసుకోలేక, బోడిగుండుకీ , బొటనవేలికీ సామెతలాగా సరిపెట్టుకుంటూ వుంటారు. అలాంటి వారికి ప్రస్తుతం ఏ సమస్యకైనా, ఏ సంక్షోభానికైనా ప్రపంచ పెట్టుబడీదారీ సమాజం ఎలా కారణమో వివరించే కథలు 'బేతాళకథలు'.

ఇప్పుడు ప్రపంచీకరణ నేపథ్యంలో ప్రతీ సెక్షనూ అభద్రతా భారంతో వణికిపోతున్న పరిస్థితుల్లో జరుగుతున్న ప్రతి ఆర్థిక, సామాజిక, రాజకీయ సంఘటనకైనా, సామ్రాజ్యవాదం, ప్రపంచ పెట్టుబడిదారీ విధానం ఎలా కారణమో చాలా సరళంగా, సూటిగా మార్క్సిస్టు పదాలు లేకుండానే మార్క్సిస్టు ఆలోచనా విధానంతో చేసిన విశ్లేషణలే ఈ 'బేతాళ కథలు'. సమాజంలో జరుగుతున్న అనేక విషయాల మూలల్లోకి వెళ్ళి పాఠకులు ఏమి శ్రమ పడకుండానే వాస్తవాలను సంక్లిష్టమైన రాజకీయ, ఆర్థిక, మత సమస్యలను అర్థం చేసుకునేలా వ్రాశారు కృష్ణారావుగారు.

నీటిమీటర్ల ఏర్పాటు ఆలోచన వెనకైనా, అభివృద్ధి పేరుతో జరుగుతున్న నిర్మాణాల వెనకైనా ప్రపంచ పెట్టుబడి పాత్ర ఏమిటో నిర్మోహమాటంగా వ్రాశారు కృష్ణారావుగారు. చిన్నపాటి జ్వరాలకు కూడా వేలమంది బలవుతుంటే మందుల్లేని ప్రభుత్వం రాజకీయ నాయకుల వైద్యానికి ఎన్నికోట్ల ప్రజాధనం ఖర్చు చేస్తోందో 'ప్రమోద మహాజనం' లో వివరించారు. పెట్టుబడిదారుల కుపయోగపడే విద్యా విధానం వల్ల పిల్లలు ఎలా హింస పడుతున్నారో బుధియాలోను, సమస్యలకు పరిష్కారాలు ఆలోచించకుండా ప్రజలు వాస్తు, జ్యోతిష్య, రత్న శాస్త్రాల వంటి మూఢ విశ్వాశాల్లో కొట్టుమిట్టాడటాన్ని 'రత్నలగోల' లోను వివరించారు. హిట్లర్ వారసత్వాన్ని సామ్రాజ్యవాదం అందిపుచ్చుకున్నట్టే గోబెల్స్ వారసత్వాన్ని ప్రపంచ బ్యాంకు స్వీకరించింది. అంటూ మూడో ప్రపంచ దేశాల రాజకీయాల్లో ప్రపంచ బ్యాంకు ఎలా జోక్యం చేసుకుంటోందో చెప్పారు.

అయ్యప్ప గుడిలో. స్త్రీల ప్రవేశం గురించిన ఆందోళన కొంతమందికి పట్టించుకోనక్కర్లేనిదిగా అన్పించవచ్చు. కానీ, హక్కులు నిరాకరించబడిన వాళ్ళు, చిన్న విషయానికైనా పోరాడటం ఒక ముందడుగే అంటారు రచయిత, 'మగ దేవుడు'లో గురుశిష్య సంబంధమైనా, డాక్టర్ పేషెంట్ సంబంధమైనా మార్కెట్ సంబంధాలేనంటారు.

రాగింగ్ గురిచీ, రిజర్వేషన్ల గురించీ ఇంకా అనేక విషయాల మీద విక్రమార్కుడు బేతాళుడికి సమాధానలు చెబుతాడు. సమాజ పరిణామాలు అర్థమయ్యి, అవకుండా అయోమయంగా వున్నవారికి విక్రమార్కుడి ద్వారా సమాధానాలు చెబుతారు రచయిత. ఈ సంవాద కథల్లో సమస్యల మూలాల్ని వివరించిన విక్రమార్కుడు తన వర్గ స్వభావాన్ని పోగొట్టుకున్నాననడం కొసమెరుపు. కానీ మన పెట్టుబడిదారులు వారంతట వారుగా వర్గ స్వభావాన్ని విడనాడలేరు. దానికి వర్గపోరాటం తప్పదు. సంక్షోభాలన్నిటికీ ప్రపంచ పెట్టుబడి దారీ వ్యవస్థే కారణమని అంటూ దీనిని ఎదుర్కోడానికి ప్రజలను ఏకతాటిపైకి తెచ్చే రాజకీయ శక్తులు ఇంకా రంగం మీదికి రాలేదని, అయినా నిరాశ పడకుండదనీ అంతిమంగా మానవాళి విజయం సాధిస్తుందనీ అంటారు.

అయితే ఏదో అద్భుతం జరిగి మానవాళి జయిస్తుందన్నట్లు కృష్ణారావుగారు వ్రాశారు కానీ ఇప్పటి వరకూ జరిగిన, జరుగుతున్న వర్గ పోరాటాలనూ, సామ్రజ్యవాద వ్యతిరేక పోరాటాలనూ అంచనా వేస్తూ వివర్మనాత్మకంగా వ్రాయలేకపోయారు. సిద్ధాంతంతో పాటు, ఆచరణలను కూడా విశ్లేషించు కుంటే కానీ సరైన దిశా నిర్దేశం చేయడం కష్టం.

సామ్రాజ్య వాదులు ఎప్పుడు ఏం మాట్లాడినా దానికి లాభమనే ప్రయోజనం, ప్రపంచ మానవాళికి నష్టమనే ఫలితము వుంటాయని మాత్రం ఈ కథలు చదివిన సామాన్యులకి అర్థం అవుతుంది. సామాజిక కార్యకర్తలు కూడా తమ పరిజ్ఞానాన్ని పెంచుకోవడానికి చదవాల్సిన పుస్తకం, "ఆధునిక బేతాళ కథలు" సిరీస్‌గా బేతాళకథల్ని అందిచిం రావు కృష్ణారావుగారి కలం మరింతగా పదును తేలాలని ఆశించడం అత్యాశకాదు. *

## రచయితలకు విజ్ఞప్తి

అరుణతారకు రచనలు పంపండి.

కథలు, కవిత్వం, పుస్తక సమీక్షలు, విమర్శా వ్యాసాలు, సామాజిక రాజకీయ సిద్ధాంత వ్యాసాలు, యితర భాషల్లోనుండి తెలుగు పాఠకులకు అవసరమైన అనువాదాలు పంపించండి.

అరుణతారలో అచ్చవుతున్న రచనలపై ఉత్తరాలు రాయండి. రచనలను మెచ్చుకునే ఉత్తరాలకంటే గుణదోషచర్చలు చేయగల ఉత్తరాలు పత్రిక ప్రమాణాలు పెంచుతాయి. పాఠకుల విమర్శనాత్మక ఉత్తరాలు పత్రికా నిర్వహణకూ తోడ్పడుతాయి.

మీ రచనలు అరుణతార సాహిత్య, సిద్ధాంత స్థాయిని పెంచుతాయని నమ్ముతూ -

- సంపాదకవర్గం

పుస్తక సమీక్ష

❖ ఆర్.కె.

# అవగాహన క్రమంలో ఒక అడుగు
# శ్రీకాకుళ గిరిజనోద్యమం

చైనా భారత్‌లలో కమ్యూనిష్టు పార్టీలు ఒకేసారి ఏర్పడకపోయినా, చైనాలో విజయవంతమైన ప్రజాతంత్ర విప్లవం వెలుగులో ఇక్కడ యింకా కొనసాగుతున్న విప్లవానికి సంబంధించిన చర్చలు జరుగుతూనే వున్నాయి. భారత సామాజిక పరివర్తనకు మార్క్సిస్ట్ - లెనినిస్ట్ పార్టీల నాయకత్వం లో ఏర్పడే పరిణామాలు అంతర్జాతీయ పెట్టుబడిని, స్వదేశీ దళారీ దోపిడీని ప్రతిఘటిస్తాయని చెబుతూ, అటువంటి ఉద్యమానికి ఉండాల్సిన ప్రాతిపదికలని తన స్వయ ఉద్యమ జీవితానుభవం నుంచి విచారించే ప్రయత్నం చేశారు వసంతాడ రామలింగాచారి. వెంపటపు సత్యం, కైలాసం, సుబ్బారావు పాణిగ్రహిలతో కలిసి పని చేసిన చారి 1962 నుండి 68 వరకూ శ్రీకాకుళం జిల్లా పార్టీకార్యదర్శిగా ఉన్నారు. చివరిలో 1995 నుంచి చనిపోయేదాకా భారత కమ్యునిస్ట్ పార్టీ పునర్ నిర్మాణ కేంద్రంలో కేంద్ర కమిటీ సభ్యునిగా ఉన్నారు. నక్సల్బరీతో ప్రారంభమై, శ్రీకాకుళంతో ఊపందుకొని, తెలంగాణాతో దిశానిర్దేశం చేసుకొన్న ఉద్యమం ఆటుపోటులకు గురవుతోంది. ఈ ఉద్యమానికి సంబంధించి ఉద్వేగ పూరిత మైన అనుబంధం వున్నంత గా, భావత్మకమైన అవగాహన కొరవడుతోంది. ఈ క్రమంలో పూర్వ తెలంగాణ నుంచి శ్రీకాకుళం పోరాటందాకా అంతర్లీనంగా కొనసాగుతున్న సిద్దాంత రాజకీయ 'లింకు'ని తానర్థం చేసుకొన్న మేరకు రామలింగాచారి వివరించారు.

ఏజెన్సీలో శ్రీకాకుళ గిరిజనోద్యమం ఒకస్థాయికి పెరుగుతున్న క్రమంలో ఎదురైన సమస్యలు - పాలేర్ల సమస్యలు, ఎస్టేట్ మేనేజర్లతో సమస్యలు, షావుకార్ల వడ్డీల దోపిడీ, శిస్తు వసూలు చేసే పద్ధతులు, కూలీ రేట్ల కోసం పోరాటం, అభివృద్ధి పథకాల మాటున గిరిజన బతుకుల దోపిడీ, పోలీస్ క్యాంపులు - తో పాటు పార్లమెంటరీ కార్యచరణలో ఎదురయ్యే పెడధోరణులు రామలింగాచారి వివరించారు. కొండ బారిడీ టీచర్ వెంపటపు సత్యంకి చుట్టుపక్కల గ్రామల్లో గిరిజన సంబంధాల వల్ల భూమికి సంబంధించిన అనేక సమస్యలు ఎలా అవగాహనయిందీ తెలుస్తుంది. సత్యం అమరుడయినాక, ఆయన భార్య గున్నమ్మ ప్రభుత్వ అధికారుల ప్రలోభాలకి లొంగక ఎదురు తిరిగిన వైనంతోపాటు, కైలాసం చనిపోయాక ఆ కుటుంబాన్ని ఆదుకొంటున్నట్లుగా ప్రభుత్వం చేసిన మోసం కూడా రచయిత వివరించారు.

ఈ పుస్తకంలో చాలా సహజంగానే కొన్ని వివాదాస్పద విషయాలున్నాయి. నక్సల్‌బరీ సౌహార్ద కమిటీకి, ఆంధ్రకమిటీకి సంబంధించిన వివాదాలు, 1968 చివరిలో కమ్యూనిస్ట్ విప్లవకారుల కమిటీ రద్దు, రెండవ ఇంటర్నేషనల్ లో కొన్ని అంశాలపై లెనిన్ వైఖరి అన్వయింపు, వర్గపోరాటంలో భాగంగా పార్లమెంటరీ కార్యచరణ మొదలయిన అంశాలపై అంతిమ తీర్పు అసాధ్యం. ఎన్నో జ్ఞాపకాల తుట్టెని కదిల్చిన యీ పుస్తకంలో కొన్ని ఘటనలు పేర్లు యీతరం పాఠకులకు వివరించే ప్రయత్నం ప్రచురుణకర్తలు కూడా చేయలేదు. మధురై డాక్యుమెంట్ దానికి ప్రత్యామ్నాయ డాక్యుమెంట్ అంటే ఏమిటి? పాలకొల్లు ప్లీనం బద్వాన్ ప్లీనం కూడా ఏమిటో అర్థం కావు. అలానే పగిడేరు సంఘటన, భద్రగిరి ఏజెన్సీ ఘటనలు, దుడ్డోభల్లు ఘటనలు చెప్పకుండా పాఠకులకి ఎలా తెలుస్తాయి? టి.ఎన్, డి.వి., డి.బి.యమ్, సి.పి, యస్వీఎల్ అంటే తరిమెల నాగిరెడ్డి, దేవుల పల్లి వెంకటేశ్వరరావు, భావన మోహన్ పట్నాయక్ చంద్ర పుల్లారెడ్డి, నరశింహరావులని జనరల్ పాఠశాలకు ఎలా తెలుస్తుంది? నాగభూషణ్ పట్నాయక్ గురించి ప్రస్తావనగా వచ్చిన నెగిటివ్ వివాహాలు యీ తరం వారికి అర్థం కావు. ఈ పుస్తకం 1970 నుంచి రెండుదశాబ్దాల కాలం క్రియాశీలంగా వున్నవారికి అర్థమైనంతగా ఆ తరువాత వారికి వివరాలతో తెలియడం కష్టం. చింతపల్లి సబ్‌జైలులో చారి ఉన్నప్పుడు, ఒక గిరిజనుడు తుండుగుడ్డతో ఆత్మహత్య చేసుకొంటాడు. జైలుగార్డుల అభ్యర్థన మేరకు ఆ ఆత్మహత్య ఉదందాన్ని మరుగుపరుస్తారు. దానికి చారిగారు యిచ్చిన వివరణ సచివుగా లేదు. గిరిజనులని ఎందరో అధికారులు దోచుకొంటున్నా రోజులలో ఐ.ఎ.ఎస్ ఆఫీసర్ యుగంధర్ సేవలు ప్రత్యేకించి పేర్కొనటం నిజంగా రివార్డు కాదగిన అంశమే. అలానే దళితుల పట్ల సేవదృక్పధం కనబరిచిన శంకరన్ గురించి కూడా ఎవరైనా రాస్తే బావుంటుంది.

కమ్యునిస్ట్ ఉద్యమంలో వెలువడే రచనల్లో పార్టీపరంగా ముఖ్యమైనవి డాక్యుమెంట్లు. ఇవి పార్టీలో అంతర్గత చర్చ కోసం రూపొంది ఒక్కోసారి కొన్ని సవరణలతో పార్టీ జనరల్ సానుభూతి పరులకు అందుబాటు లో కొస్తాయి. ఆ విషయాల పరిధి అంత మేరకే. ఉద్యమం వెలుపల వున్న పాఠశాలకు ఏ పాదసూచికలు, వివరణలు లేని ఈ విషయాలు అర్థంకావు. శ్రీకాకుళంలో గిరిజనోద్యమం ఒకస్థాయిని పెరుగుతున్న క్రమంలో 1967 అక్టోబరు 31న మొటెంఖల్ లో గిరిజన మహాసభ జరిగింది. ఆ సభకు వస్తున్న జనం మీద లేవిడి గ్రామం వద్ద జరిగిన దాడిలో కోరన్న మంగన్నలు చనిపోయారు. చరిత్ర మలుపు తిరిగింది. ఈ పుస్తకం/శీర్షిక చూసి ఆ చరిత్రంత తెలుస్తుందనుకొంటే తీవ్ర ఆశాభంగమే. రామలింగాచారి మరణానంతరం ఈ పుస్తకాన్ని ప్రచురించిన కమిటీవారు తగిన జాగ్రత్తలు తీసుకోకుండా, పునరుక్త విషయాలని ఎడిట్ చేయకుండా యధాతధంగా ప్రచురించినందువల్ల ఆశించిన ప్రయోజనం నెరవేరదు. రానున్న చారిగారి మిగతా రచనల విషయంలో నైన తగు సూచనలు పాటిస్తే చాలా ప్రయోజన కరంగా వుంటుంది. అతిస్వల్ప వెలతో వచ్చిన ఈ ప్రచురణ మిగతా పార్టీలకు కనువిప్పు కాగలదని ఆశిద్దాం.

పుస్తకం - శ్రీకాకుళ గిరిజనోద్యమం

(అనుభవాలు - అవగాహన)

రచన - వసంతాడ రామలింగాచారి. పేజీలు 272 వెల 25/-

ప్రతులకు - ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని ప్రముఖ కేంద్రాలు.

*

# చారిత్రక డాక్యుమెంట్లు డా. భారతి పహెచాన్ కథలు

- షరీఫ్

"పుట్టెడు దుఃఖం దిగమింగి నిభాయించుకోగల హిమ్మత్/తాఖత్ వుంటేనే ఈ కథలు చదవండి" అనేది అక్షర సత్యం. హైద్రాబాద్ పాతబస్తీ ముస్లిం స్త్రీల గుండెల్లో గూడు కట్టిన పుట్టెడు దుఃఖాన్ని తన కథల్లో ఆవిష్కరించింది డా. భారతి. నిజానికి ఇవి కథలు కావు. మన కళ్ళెదుట కదలాడే దృశ్యరూపాలు. ఓ ఒక్కటి కల్పితం కాదు. అన్ని సజీవ పాత్రలే. అన్ని పాత్రలు ఈ పదిహేను సంవత్సరాల కాలంలో మనం విన్నవే, జ్ఞాపకాల్లో కదలాడేవే. రాబోయే తరాలకు హైద్రాబాద్ పాతబస్తీ స్త్రీ జీవితాన్ని పదిల పరిచిన డాక్యుమెంట్లే ఈ కథలు - గాధలు

డా. భారతి పాతబస్తీలో డాక్టరుగా ముస్లిం స్త్రీలకు వైద్యం జేయడమేగాక ఒక మనిషిగా మానవీయ స్పర్శతో వారి పుట్టెడు దుఃఖాన్ని తన దుఃఖంగా మార్చుకోగల్గింది. దానికి నిలువెత్తు సాక్ష్యమే ఈ కథలు.

ముస్లిం మతానికి చెందని ఒక రచయిత్రి ముస్లిం స్త్రీల దీన గాథల్ని, దుఃఖాన్ని కథలుగా బయటి ప్రపంచానికి తెలియజెప్పుట సరైందా? అనే ఇన్సైడర్ - అవుట్సైడర్ ప్రశ్న తలెత్తుతుంది. అది ముందు మాటలో, చివరగా ........ రాసిన మాటల్లో కూడా చర్చకు వచ్చింది. బహుషా రచయిత్రి మనసులో కూడా వుండి వుండవచ్చు.

ఇన్సైడర్ - అవుట్సైడర్ అనే ప్రశ్న రెండు వర్గాలు ఉపయోగించుటకు వీలున్న ప్రశ్న. సాధారణంగా పాలక వర్గాలు తమ జాతి, సంస్కృతి, సంప్రదాయాల పేరుతో బయటి వారి నుండి వాటికి భంగం వాటిల్లుతున్నదని, వాటి వునికి ప్రశ్నార్థకమౌతుందని భయాందోళనలు కల్గించి ప్రజలను అణచివేస్తూ తమ పాలనను సుస్థిరం చేసుకొనుటకు విరివిగా వాడుకుంటారు. వాడుకుంటున్నారు. ఇది హిట్లర్ నాజీజం నుండి జరుగుతూనే వుంది. మన దేశంలో హిందుత్వ సంఘ్ పరివార్ శక్తులు నిత్యం ఏదో ఒక సాకుతో ఇన్సైడర్ - అవుట్సైడర్ వివాదాన్ని ఆశ్రయిస్తూనే వున్నారు. యమ్.ఎఫ్. హుస్సేన్ పెయింటింగ్స్ విషయంలోగానివ్వండి, జోధా అక్బర్ సినిమా విషయంలో ఇదే పద్ధతిని, వివాదాన్ని సంఘ్‌పరివార్ ఆశ్రయించింది.

ప్రజాస్వామిక వాదుల్లో కూడా ముఖ్యంగా ఈ మధ్య కాలంలో స్త్రీ వాద దళిత సాహిత్య చర్చల్లో ఈ వాదం చోటుచేసుకుంది. ఒకరి హక్కులను, స్వేచ్ఛను ప్రశ్నించే విధంగా బయటివాళ్ళ అభిప్రాయాలున్నపుడు ఇన్సైడర్ - అవుట్సైడర్ ప్రశ్న ప్రధానంగా ముందుకు వస్తున్నది. దీనిని లోతుగా చర్చించడం ప్రస్తుతం ఈ చర్చ పరిధి కాదు.

పహెచాన్ లోని 17 కథలలో కేవలం 'ఉనో నహీఁమానే' కథ మాత్రమే ఇన్సైడర్ - అవుట్సైడర్ ప్రశ్న పరిధిలోకి వచ్చే అవకాశం వుంది. అది కూడా ప్రశ్నార్థకమే.

ఉనో నహీఁమానే కథాంశం ప్రధానంగా ఎక్కువ మంది పిల్లల్ని కనడం. తల్లి కూతుళ్ళు ఇద్దరు గర్భంతో డాక్టర్ని కలవడం. తల్లి అవమానంతో, సిగ్గుతో తలదించుకోవడం, పిల్లలు కలుగకుండా ఆపరేషన్ చేయించుకోవడానికి నూరున్నిసా(తల్లి పాత్ర) భర్త మతం, సాంప్రదాయం పేరుతో వ్యతిరేకించడమే గాక తనను వదిలేస్తాడేమోననే భయం, చివరకు కూతురు ప్రోద్భలంతో తల్లికి కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించడం - ఇది కథాంశం. ఇందులో నూరున్నిసా మనోవేదనను మాత్రమే డా. భారతి, కొంత తన చైతన్యాన్ని జతచేసి, కథలో కళ్ళ ముందట కదులుతున్నట్లు చిత్రీకరించింది.

మల్టీగ్రావిడా (ఎక్కువ మంది పిల్లలని కన్నతల్లి) గతంలో అన్ని మతాల్లో వుంది. బహు భార్యత్వం కూడా పురాణాల్లో కోకొల్లలు. ఇప్పటికి అనధికారికంగా అన్ని మతాల ప్రజలలో కొనసాగుతున్నది కూడా. పాలక వర్గాల నిర్లక్ష్యానికి గురైన జాతులలో, తెగలలో, కులాలలో ఇప్పటికి కొంతమేరకు ఎక్కువ పిల్లల్ని కనడం కొనసాగుతూనే వుంది. సంచార జాతులలో ఇది కొంచెం ఎక్కువ. సంచార జాతులలోగాని, కటిక దారిద్ర్యం, వెనుకబాటు తనంలో మగ్గుతున్న ముస్లింలలో మల్టీగ్రావిడా కొంచెం ఎక్కువ. వీరంత పాలకుల తీవ్ర నిర్లక్ష్యానికి గురికావడం, ఆర్థికంగా దుర్భర స్థితిని కలిగి వుండడం ఒక ప్రధాన కారణం. వీరి పిల్లలు 8వ ఏట నుండే మెకానిక్ షాపుల్లో, హోటళ్ళలో వర్కర్స్‌గా, సైకిల్ షాపుల్లో మెకానిక్‌లుగా, ఉదయాన్నే వాడల్లో డబల్ రోటి అమ్మేవాళ్ళుగా కొద్దో గొప్పో సంపాదించి కుటుంబానికి చేదోడు వాదోడుగా వుంటున్నారు. వీరి బాల్యం చిద్రమౌతున్నది. చదువుల అంచులకు వెళ్ళలేకపోవుతున్నారు. డొక్క నింపుకోవడానికి సంపాదించే వారి సంఖ్యను పెంచుకోవడానికి ఎక్కువ పిల్లల్ని కనడం అవసరమనే అనివార్య స్థితికి నెట్టిన ఈ సమాజాన్ని, ప్రభుత్వాలను, పాలకవర్గాలను దోషులుగా నిలబెట్టాలి. అంతేగాని మతాన్ని సా[illegible] ఆ మతాన్నే దోషిగా నిలబెట్టకూడదు? అట్లా నిలబెట్టాలను[illegible]టేనే ఇన్సైడర్-అవుట్సైడర్ ప్రశ్న వస్తుంది. సంఘ్‌పరివార్ అట్లా మతాన్ని బూచిగా, దోషిగా చూపి తన పబ్బం గడుపుకుంటుంది.

డా. భారతి ఈ కథలో నూరున్నిసా ఆవేదనను చిత్రీకరించిన క్రమం సూచయగా ఉనో అంటే భర్త, భర్త మూఢత్వం దోషి అని అర్థమవుతుంది. ఇది డా.భారతికి తెలియకుండానే జరిగిందనుకోవచ్చు. దీనికి కారణం నూరున్నిసా ఆవేదనే కథ ప్రధానాంశం కావడం. ఈ పరిమితుల రీత్యా ఇన్సైడర్ - అవుట్సైడర్ చట్రంలో బిగించాలనుకోవడం కూడా సరైంది కాదు.

కాలి బదరియాఁ, దోఝుక్, సబా-సవేరా, జహాఁనుమాగల్లీ నంబర్‌దో, అబ్బాఁ మైఁ రషీదా హుఁ కథలన్నింటిలో పేర్లు వేరు, ప్రదేశాలు వేరు, కష్టాల తీవ్రతలు వేరు కాని మోసంలో తేడా లేదు. మోసగించే వాళ్ళు ఖాజిలు, అరబ్బు షేకులే. ఈ దారుణానికి ఖాజీలను, షేక్‌లను మాత్రమే నేరస్థులను చేస్తామా?లేదా అన్ని తెలిసి కూడా అరబ్బు షేకులకు తమ బిడ్డలను అమ్ముకుంటున్న తల్లిదండ్రులను నేరస్థులను చేస్తామా? చిద్రమౌతున్న బాల్యం, నిరుద్యోగ రక్కసి కోరల్లో చిక్కుకున్న యువత, రెక్కాడితే గాని డొక్క కూడా నిండని బతుకు, కళ్ళెదుటే కనబడుతుంటే తను నాశనమైన పర్వాలేదు కనీసం కుటుంబానికి కాస్త రెండు మెతుకులైన దొరుకుతాయని తనను సముదాయించుకొని రాజీపడి అరబ్బుషేక్‌లతో పెళ్ళికి ఒప్పుకుంటున్న ప్రతి యువతిని నేరస్థురాలిని చేస్తామా? పైన తెలిపిన కథల్లో ప్రతి యువతి కుటుంబం కోసం, కుటుంబం అనుభవిస్తున్న పేదరికం నుండి కొంత మేరకైన బయటపడగలమనే చిన్న ఆశతో రాజీపడి అంగీకరించినదే. రాజ్యం తన నిర్లక్ష్యాన్ని, తన దోపిడిని మార్చుకోకుండా ఖాజీల మీద నిఘా, చట్టాలు ఈ పరిస్థితిని మార్చగలవా? ఈ దారుణానికి అసలు కారణం పాలకులు, ప్రభుత్వం, రాజ్యం. అంతేగాని ఈ దారుణానికి మతం, అధిక సంతానం ఎంతమాత్రం కారణం కాదు. ఈ విషయాన్ని స్పష్టంగా డా. భారతి పై కథల్లో సూచాయగా చెప్పగలిగారు.

బిచ్‌డా చమన్ కథలో ఫైమినా బేగం గతంలో కన్న పూర్తిగా భిన్నంగా, అదీ గుజరాత్ మారణకాండ తర్వాత, దీనంగా డాక్టరు ముందు నిలబడి నమాజ్‌కు పర్మిషన్ అడగడం నేడు ముస్లిం సమాజం ఎదురొ[illegible] ప్రధాన స్థితికి సజీవ సాక్ష్యం. హిందూమతోన్మాద సంఘ్ పరివార్ శక్తు[illegible] తెచ్చిన స్థితి అనడం కన్న లౌకిక ప్రజాస్వామిక శక్తులు యుద్ధం చేయ[illegible]టమిని అంగీకరించడం వల్ల దాపురించిన స్థితి. ఈ ప్రజాస్వామిక శక్తు[illegible]ంటిష్టమైన నిర్మాణాత్మక వుద్యమాన్ని నిర్మించుటలో వైఫల్యం చెందడం [illegible] దారుణ స్థితి దాపురించింది. ఈ దేశంలో మైనారిటీలు వుండాలంటే హిందువుల మనోభావాలనుకూలంగా వుండాలనే హిందూత్వ ఫాసిస్టు నైజాన్ని ఈ కథలో చూపారు.

పహెచాన్ కథలో గుజరాత్ మారణకాండలో జరిగిన సామూహిక అత్యాచారానికి, సామూహిక హత్యాకాండకు ప్రత్యక్ష సాక్షి, బాధితురాలు జహీరాషేక్. ఆమె నేరస్థులను గుర్తించి కూడా అనేకసార్లు సాక్ష్యాన్ని మార్చుతూ

(తరువాయి 48వ పేజీలో)

విరసం విశేషాలు

# ప్రొద్దుటూరు కథా వర్క్‌షాప్

## ఫిబ్రవరి 9, 10, 11

**రిపోర్టు : వరలక్ష్మి**

అనంతపురం, షాద్‌నగర్ సమావేశాల ఉత్సాహంతో మా వూరిలో మేము కధల వర్క్‌షాప్ నిర్వహిద్దామనుకున్నాం. సాహితీ మిత్రులంతా ముందుకొచ్చారు. అమరావతి వర్క్‌షాప్ మొదలుకొని ప్రతి మూడు నెలలకోసారి సమావేశాలు జరుగుతున్నాయి. వీటిలో కొత్త అనుభవాల్ని పంచుకొంటున్నాం. అలా ఇది నాలుగవ సమావేశం. గత మూడు సమావేశాల అనుభవం నుండి వర్క్‌షాప్ నిర్వహణ పద్ధతిని ఒకసారి సమీక్షించుకొని, ఇంకా మెరుగుపరుచుకోవడానికి అవసరమైన మార్పుల గురించిన చర్చతో సమావేశం మొదలైంది. మొదటి రెండు రోజులు సమావేశానికి రఘోత్తం అధ్యక్షత వహించారు.

గీతాంజలితో మొదలై అందరం అభిప్రాయాల్ని పంచుకున్నాం. "మూడు రోజులు కధలు చదవడం మాట్లాడ్డం మొనాటనస్‌గా తయారవుతోందనిపిస్తోంది. కథా నిర్మాణం గురించి, దృక్పధం గురించి, ప్రభావితం చేసే అంశాల గురించి, కథ మొదలు -ముగింపు, వస్తు ఎంపిక వంటి విషయాల మీద చర్చ జరిగితే బాగుంటుంది. పాశ్చాత్య సాహిత్యం నుండి కూడా కొన్ని కథల్ని ఎంపిక చేసి చదివి చర్చించాలి. సిద్ధాంత అవగాహన కల్గించడం కోసం ఉపన్యాసం ఇప్పించాలి, ఒక ఇతివృత్తం యిచ్చి అందరిచేత కథ రాయిస్తే ఎలా ఉంటుంది. అప్పుడు కథ ఎలా తయారవుతుందో చర్చించొచ్చు కదా!

ఉమాదేవి : "నాకిది మొదటి వర్క్‌షాపు. కథ ఎలా రాయాలి, కథగా ఎలా మలచాలి, నిర్మాణం, ముగింపు, ముఖ్యంగా చదివించేలా ఎలా రాయాలి అనేవి తెలియజేసేలా సమావేశాలు ఉండాలని అనుకుంటున్నాను"

విజయలక్ష్మి : నాకైతే సంతృప్తి కరంగానే సాగుతోంది. నేను రాసిన కథను చర్చించినప్పుడు దానిలో లోపాలు వెంటనే అర్థమవుతున్నాయి. విడిగా ఉపన్యాసాలు, వ్యాసాలు వింటూనే ఉన్నాం. యిప్పుడు కూడా కథ చదివి చర్చించేటప్పుడు, సాయంత్రం పూట కూర్చున్నప్పుడు సిద్ధాంత విషయాలు చాలా వస్తున్నాయి. ఏదైనా కథా సందర్భంలో మాట్లాడితే అన్వయం కుదురుతుంది.

శ్రీనివాస్ : "అమరావతి సమావేశం నాకు సంతృప్తికరంగా అనిపించలేదు. ఉపన్యాసాలు ఏవీ లేవుకదా. అయితే మొదటి సారి కథ రాశాక, కథ మీద చర్చ ద్వారా చాలా విషయాలు వస్తున్నాయి. గీతాంజలి గారు చెప్పినవి దాని వెలుపల ఉన్నవే. వచ్చిన కథలు చర్చించుకొడానికే మనకు టైం సరిపోడం లేదు. నాకైతే ఇప్పుడున్న పామే బాగుంది".

రవి : "కథ చదవి చర్చించడం ప్రయోజనకరమే. అయితే మూడు రోజులూ అదే కావడం కొంచెం బోర్‌గా ఉంటుంది. అభిప్రాయాలు పంచుకొడం వల్ల నేర్చుకునేది చాలా ఉంది. పలుకోణాల్లో విషయాలు చర్చించడం మంచిదే.

ఒక కథ రాశాక అది పూర్తి అయిందా లేదా అనే చర్చజరగాలి. రఘోత్తం, రాజయ్య లాంటి వాళ్ళ కథా నేపథ్యాలు చెప్పాలి. వర్తమానంలో వస్తున్న కథల మీద ఉపన్యాసం ఉంటే బాగుంటుంది. బైటవస్తున్న చాలా కథలు దృక్పధం రాహిత్యంగా ఉంటున్నాయి. అవి ఎట్లా ఉన్నాయి అని మాట్లాడుకోవాలి."

రాము : "నేను గీతాంజలి గారి అభిప్రాయంతో పాక్షికంగా ఏకీభవిస్తున్నా. కథాపఠనానికి ముందు మాములుగా వస్తున్న కథల మీద, రావలసిన కథల మీద ఒక ఉపన్యాసం ఇప్పించాలి. వచ్చిన కథలను కేటిగరీలుగ విభజించి చర్చిస్తే బాగుంటుంది. రచయితల అనుభవాలు, యిబ్బందులు మాట్లాడుకోవాలి. దానికి ఒక సెషన్ కేటాయించాలి. అయితే మొత్తం మీద సంతృప్తికరంగానే ఉంది"

మహమూద్ : దృక్పథం విషయంలో జాగ్రత్త అవసరం. ఎంఎల్ ఎం తగ్గుతోందేమో ఆలోచించాలి. దళిత, ముస్లిం మైనారిటీ కధకు వర్క్‌షాప్‌కు వచ్చేలా చూసుకుంటే బాగుంటుంది. కథలు రాసేవాళ్ళు నేపథ్యం చెబితే బాగుంటుంది. ఇక కథలు చదవడమే పని అంటే అంతకు మించి ఇంక ఏముంటుంది. మొనాటనస్ అంటే తప్పదు మరి".

ఖలందర్ : కథ చదివాక దాని మీద అందరూ విశ్లేషణాత్మకంగా చర్చించడం వల్ల ప్రయోజనమే. రచయితకు కథ రాసే విషయంలో ఎంత స్వేచ్ఛ ఉంటుంది అని కూడా చర్చించాలి.

పావని : "నాకైతే సంతృప్తి కరంగానే ఉంది. రాసిన కథ మీద చర్చ జరగడం వల్ల రాయబోయే కథలో సరిదిద్దుకుంటారు. ఈ పద్ధతి బాగానే ఉంది"

దాదాపు అందరికీ సంతృప్తికరంగానే ఉన్నట్టునిపించింది. నా అభిప్రాయం మాత్రం దృక్పధం విషయంలో మనమేమైనా రాజీపడుతున్నామో అని. నిర్మాణపరమైన విషయాల మీద ఉన్న చర్చ దృక్పథం విషయంలో ఉండటం లేదు. టెక్నికల్ విషయాల వల్ల దృక్పథం లాస్ అయితే మన సభ్యులకు, మన మిత్రులకు మనం ఏం చెప్పాం అనే ప్రశ్న మిగులుతుంది. అదీ గాక ఈ మధ్య వస్తున్న కథల్ని చూస్తే 'మంచి కథ' మోడల్ మారిపోతుందా అని కూడా అనిపిస్తోంది. సమకాలీన కథల్ని చర్చించాలని నేను చెప్పాను.

అందరి అభిప్రాయాల్ని క్రోడీకరిస్తూ రఘోత్తం మాట్లాడారు "గీతాంజలి, వరలక్ష్మి, రవి చెప్పిన లోపాల్ని సవరించుకోవాలంటే టైం పెంచుకోవాలి. అసలు ఈ సమావేశాలు ఎలా మొదలయ్యాయో గుర్తుచేసుకోవాలి. రుక్మిణి పూనికతో అమరావతిలో మొదటి సమావేశం నిర్వహించుకున్నాం. అక్కడ గత వర్క్‌షాప్‌ల గురించి రివ్యూ జరిగింది. కథా రచనలో ఉన్నవాళ్ళను, ఈ తరహా సమావేశాలు అవసరం అయిన వాళ్ళను పిలవాలి. లేకపోతే చాల శ్రమ, డబ్బు, సమయం కూడా వృధా అయిపోతాయి. మనం యిలా పరిమిత వనరుల తోనే వీటిని నిర్వహించాలి. ఉపన్యాసాలు ఉన్న సమావేశాలు చాలా జరుగుతున్నాయి. ఉపన్యాసాలు ఉన్న సభలను, ఈ వర్క్‌షాపులను కలిపి సమగ్రంగా అర్థం చేసుకోవాలి. నిజానికి యిక్కడ ఏవి లేవని అనుకుంటున్నామో అవన్నీ అవసరమే. వాటి కోసం ఈ సమావేశంలోని వాళ్ళే అధ్యయనం చేసి చెప్పడానికి సిద్ధం కావాలి. కొత్తవాళ్ళు తయారవ్వాలి. ఈ వర్క్‌షాప్ చాలా సమిష్టిగా జరుగుతోంది. ఇరవై కధల మీద మూడు రోజుల పాటు మాట్లాడినవన్నీ కలుపుకుంటే అన్నీ వస్తున్నాయని తెలుస్తున్నవి. ఎవరికి ఏం అవసరమో వాళ్ళ కథల ఆధారంగా చెప్తున్నాం. నిజజీవితంలోని సమస్త విలువలను వ్యతిరేకిస్తూ ఉన్నపుడు, మెదడుకు, హృదయానికి, కాళ్ళు చేతులకు సమన్వయం ఉంటే ఆరోగ్యకరమైన కథలు వస్తాయి. సాహిత్యానికి ఇరుసు ఘర్షణే కదా."

ఈ సమావేశానికి కర్రా ఎల్లా రెడ్డి గారు కొత్తగా వచ్చారు. అందరి భావాలు వింటూ చాలా ఆసక్తిగా పాల్గొన్నారు.

"అందరి భావాలు విన్నాను. సమావేశాలు బాగున్నాయనే వాళ్ళు ఎక్కువ వున్నారు. కొత్త కథకుల కోసం ఈ వర్క్‌షాప్స్ ఇలానే జరగాలి. కథ రాసుకొని రావాలి అన్న నిబంధన వల్ల కొత్త కథలు బైటికొస్తాయి. కథ మెరుగుపడుతుంది కూడా. అయితే అధ్యయనం చేయకపోతే ఈ సమాజానికి ఇప్పుడు ఏం రాయాలో తెలియదు".

ఇట్లా ఒక రివ్యు తర్వాత భోజన సమయం మించి పోతుండడంతో ఓ గంట భోజన విరామం తర్వాత కథలు చదవడం మొదలుపెడదామని నిర్ణయించుకొని లేచాం.

మొదటి కథ ఎవరు చదువుతారు అని రఘోత్తం అడిగితే "చదివేస్తే ఓ పనైపోతుంది కదా" అని నేను రాసిన రెండవ కథ తీసుకొని అందరి మధ్యలో నిలబడ్డాను. కదను క్లాస్‌రూం వెలుపల అని తాత్కాలికంగా ఒక టైటిల్ పెట్టానని చెప్పాను. కడప జిల్లా యురేనియం మైనింగ్ నేపథ్యం లో సాగిన కథ. డిగ్రీ చదివే దిలీప్ తన ప్రాజెక్టు వర్క్ లో భాగంగా ఆ యురేనియం మైనింగ్ పరిధిలో ఒక ఊరికి వెళతాడు. అది తన అయ్యవాళ్ళ ఊరు కూడా కావడంతో ఆసక్తిగా అన్నీ తెలుసుకోవడం, తన మిత్రులలో ప్రజాభిప్రాయ

సేకరణకు వెళ్ళడం అక్కడ తనకు ఎదురైన అనుభవాలు ఇతివృత్తం. కథ మీద అందరి స్పందన చాలా ఆసక్తిగా విన్నాను.

ఖలందర్ : కథ రచయిత అనుభవం నుండి వచ్చింది. వస్తువు నాకు తెలుసు కాబట్టి ముగింపు గురించి ఆసక్తిగా ఎదురుచూశాను. సంభాషణలు సహజంగా ఉన్నాయి. పాత్రలు, పాత్రల స్వభావం చిత్రీకరించడంలో సఫలమైనారు. అయితే సబ్జెక్ట్ ఇంకా ఫోర్స్‌గా వచ్చి ఉండాల్సింది. ఏమైనా ఇది చాలా అవసరమైన కథ".

విజయలక్ష్మి : "కథ చాలా బాగుంది కానీ చివర్లో అర్థం కాలేదు చివర్ల బకాసురుడి ప్రస్తావన వచ్చింది. అరెస్టుల నేపథ్యంలో బకాసురుడి కథ ఎలా అన్వయించుకోవాలో అర్థం కాలేదు"

శోభ : "బకాసురుడి ప్రస్తావన అంటే యురేనియం ఫ్యాక్టరీ కోసం మనుషులు బలికాక తప్పదనే నిర్ణయానికి వచ్చినట్టేనా ?"

బాసిత్ : ఇది సమకాలీన కథ యురేనియం లోగుట్టు బాగా వచ్చింది. సంభాషణ క్లిక్ అయ్యాయి. శాస్త్ర సాంకేతిక పదాలు ఉబికి వచ్చాయి. ముగింపు సూచన ప్రాయంగా ఉంది. స్పష్టంగా ఉండి ఉంటే బాగుండేది"

శ్రీనివాస్ : "రిలెవెంట్ సబ్జెక్ట్. అయితే ముగుంపు బలికాక తప్పదు అనే అర్థం ఇస్తుంది. అట్ల కాకుండా స్ట్రగుల్ చేయాలి అంటే బాగుండేది"

ఎల్లారెడ్డి : "రాయలసీమ మాండలికం బాగా కుదిరింది. ప్రభుత్వాన్ని ఎదిరించే శక్తి సామర్థ్యాలు ప్రజలకు లేకపోతే ఈ ముగింపు సరిపోతుంది"

పద్మావతి : అన్యాయమే అయినా ఫ్యాక్టరీ రావడం అనివార్యం అవుతోందనే సూచన కథలో ఉంది"

పావని : "బండి అన్నం పంపిస్తామేమోగాని మనిషిని యాడ పంపుదుము అంటే బలికాబోవడం లేదు అనిపిస్తుంది. ముగింపు బాగుంది".

రాము : కథలో ఎమోషన్స్ బాగా వచ్చాయి. కథ విస్ఫోటనం పబ్లిక్ హియరింగ్ దగ్గరి నుంచి మొదలై ఉంటే ఇంకా బాగుండు. కథలో రెండు వర్గాల ప్రజలున్నారు. ప్రాజెక్టును సపోర్ట్ చేసే పబ్లిక్ కూడా ఉంది. వాళ్ళతో ఇంటరాక్షన్ ఉంటే బాగుండు"

మహమూద్ : కథ చాలా బాగా వచ్చింది. ఇందులో మూడు వర్గాల వాళ్ళున్నారు. యురేనియంను వ్యతిరేకించే వాళ్ళు, ప్రయోజనం పొందేవాళ్ళు, ఏ మాత్రం సంబంధం లేని విద్యార్థులు, ప్రజాభిప్రాయ సేకరణ దగ్గర పిల్లకాయలు పరిగెత్తి వచ్చేవరకే ఉంటే బాగుండేది. చివరి పేజీ పొడిగించబడిందని నాకనిపిస్తాంది"

రవి : "చాలా పాత్రలు, సన్నివేశాలు కలగలసి ఉంది. ఎక్కువ విషయాలు వచ్చాయనిపించింది"

గీతాంజలి : "ఇతివృత్తం బాగుంది. సంభాషణలు బాగా కుదిరాయి. పీడితుల్లో రెండు బృందాల వాళ్ళు - కాంట్రాస్ట్ బాగా తీసుకొచ్చారు. ముగింపు అన్నం పంపిస్తాం, మనుషులను పంపం అనే భావం చాలా బాగుంది. నేను గతంలో రాసిన దానికంటే ఇది బాగా వచ్చింది ఏ మార్పు అక్కర్లేదనిపించింది."

పాణి : "కథ స్ట్రక్చర్ కుదిరినట్టుగా ఉంది. కానీ వస్తువుకు పాత్రలకు మధ్య ఉండవలసిన సంబంధం బలంగా లేదేమో అనిపించింది. పాత్రలు విద్యార్థులు కావడం కాస్త తేడా ఉన్నట్టు అనిపిస్తుంది. అరెస్టయిన వాళ్ళ వైపు నుండి కాకుండా ఏ రకమైన జీవితానుభవం లేని వాళ్ళ వైపు నుండి తీసుకురావడం వల్ల సమస్య వచ్చింది. యింకో కోణంలో రాస్తే కథలో ఉన్న బలం వ్యక్తంకావచ్చు"

రఘోత్తం : "కథకు స్వాధీనతా కోణం అనేది ఒకటి ఉంటుంది. దాన్ని కాకుండా మరొకటి స్వీకరిస్తే అలవికాకుండా పోతుంది. ఇది రచయిత అనుభవంలోకి ఎలా వచ్చిందో చెబితే తేడా ఉంటుంది. కథ మొదలు పెట్టేటప్పుడు ఉద్దేశ్యం అక్కరలేదు. దిలీప్ పాత్ర ఊరికి పోవడం అక్కర లేదు. దీని వల్ల అవసరమైన కథా నిర్మాణం చెయ్యాల్సి వచ్చింది.

కథా రచయిత కేవలం మెదడు తోనే రాయక్కర్లేదు. సర్వేంద్రియాలతో కథా వస్తువుకు సంబంధించి పట్టుకోవలసిన వాటన్నిటినీ పట్టుకొని రాయాలి. అప్పుడు కథ ఏ ఫ్రేంలోకి వస్తుందో తేలిపోతుంది. వాతావరణం, దాన్ని బట్టి మనుషుల మూడ్స్ అవి కథా గమనంపై ప్రభావం చూపే తీరును గుర్తించాలి. కథలు సాధారణంగా వాస్తవ జీవితం లోనే రూపొందుతాయి. ఎక్కువ కల్పన అవసరం లేదు."

ఈ అభిప్రాయాలన్నింటి మీద నేను స్పందిస్తూ ముగింపు నేనే కల్పించానని చెప్పాను. ప్రజాభిప్రాయం అయ్యాక మేమొకసారి ఆ ఊరికి పోయినప్పుడు ఒకాయన బకాసురుడి ప్రస్తావన తెచ్చాడని, దాన్ని తీసుకొని కొంచెం కల్పన జోడించానని చెప్పాను. అయితే ప్రారంభం గురించి మళ్ళీ ఒక సారి ఆలోచిస్తానని చెప్పాను.

గీతాంజలి మాట్లాడుతూ గ్రామం గురించి చెప్పడానికి ఏదోఒక పాత్ర వైపునుండి చెప్పాలి కదా, ఇలా ఎందుకు రాయకూడదు అన్నారు. దిలీప్ ఒకసారి వెళ్ళి వచ్చి మళ్ళీ ప్రజాభిప్రాయసేకరణ టైంలో వెళ్ళడం వల్ల అదంతా ఎక్కువైందనిపించిందని రవి అన్నారు. రఘోత్తం స్పందిస్తూ సంఘటనను కేంద్రం చేసుకొని కథ రాస్తే ప్రారంభం సులువుగా ఉంటుందన్నారు. సామాజిక రుగ్మతలు చాలా సార్లు కోర్టులు పోలీస్ స్టేషన్లు, హాస్పటళ్ళ దగ్గర వ్యక్తం అవుతాయి. కార్మికుల సమస్యలన్నీ కంపెనీహాస్పటల్ దగ్గర వ్యక్తమై వైద్యం చేయలేదని డాక్టర్‌ని కొడతారని తన అనుభవం నుండి చెప్పారు.యిక్కడ కథ మొదలైతే వెనకటివన్నీ బైటకొస్తాయన్నారు.

తర్వాత బాసిత్ 'సైదాబీ తాయమ్మ' అనే కథ చదివారు. అనారోగ్యంగా ఉన్న అత్తమామల బాగోగులు చూడడం, తోడి కొడళ్ళతో స్నేహంగా స్వంత మరుదులతో కలివిడిగా ఉండే ముస్లిం స్త్రీని ఆమె భర్త అంగీకరించలేకపోతాడు. అంతే కాక బుర్ఖాను ధరించనందుకు భర్త ఆమెకు విడాకులిస్తాడు. చంకన బిడ్డతో పుట్టింటికి తిరిగి వెళ్ళిన ఆమె అక్కడే తన కుతుర్ని పెంచి, పెళ్ళి చేసే సందర్భంలో ఆ అమ్మాయి తల్లి లాగా బుర్ఖాను వ్యతిరేకిస్తుందా లేదా అనే ప్రశ్నకు సమాధానంతో కథ ముగుస్తుంది. తర్వాత కథ మీద చర్చ నడిచింది.

ఖలందర్ : బుర్ఖాను వ్యతిరేకించే అమ్మాయి దోహేజ్‌నుకూడా వ్యతిరేకిస్తుంది కదా అనిపించింది. కథ బాగా వచ్చింది. మధ్య మధ్య లో పెళ్ళి పాటలు లాంటివి కథను చిక్కబరచాయి.

రాము : కథ అల్లిక బాగుంది. పెళ్ళి సన్నివేశం బాగా వచ్చింది షాయరీలు బాగున్నాయి. సైదాబీ ఆత్మగౌరవానికి సంబంధించిన కథ ఇది. దాన్ని ఆమె కూతురు కొనసాగిస్తుందా లేదా అనే దాంతో కథ నడిచింది. కూతుర్ని గురించి యింకొంచెం వివరించి ఉంటే బాగుండేది.

పావని : "భర్త వదిలేస్తే ఆమెకు కుట్టు మిషన్ తప్ప వేరే అవకాశం లేదా ? ఇది స్టీరియోటైప్‌గా ఉంది. బాసితే యింతకు ముందు కథలో సమాజాను ఎక్కువగా రాశారు. ఈ కథలో పెళ్ళిని ఎక్కువగా వర్ణించారు. అంత అవసరం లేదేమో"

నాకైతే పెళ్ళి వాతాకరణంలోకి తీసుకెళ్ళినట్టు అనిపించింది. కథలోని ఉత్సాహభరితమైన వాతవరణం ఆమె స్వేచ్ఛను వ్యక్తీకరించడానికే కూతురు బురఖాను వ్యతిరేకిస్తుందన్న సూచన కూడా ఉందని నా అభిప్రాయాన్ని చెప్పాను.

ఎల్లారెడ్డి : "కథలో ఉర్దూ ఎక్కువగా ఉన్నది. అయితే ఉర్దూ పదాలతో సంస్కృతి వ్యక్తీకరణ బాగా వస్తుంది. బురఖా మీద కథలు కవిత్వం చాలా వచ్చాయి. ఇందులో కొత్తదనం ఉంది. కూతురి శుభలేఖ బంధువులకు పంపించడంలో కథ ప్రారంభం అవుతుంది. భర్త బురఖా వేసుకోమని వొత్తిడి చేయడం వల్ల ఆమె విడిపోతుంది. దాన్ని కూతురు కొనసాగిస్తుందనే సూచన ఉంది. అక్కడక్కడా కొంచెం తీసేయవచ్చు. తిరగ రాస్తే కథ బాగా వస్తుంది"

గీతాంజలి : ఇస్లాం లో స్త్రీలకు ఆస్తి హక్కు, 'ఖుల' హక్కులు ఉన్నాయి. ఇస్లాం లోని మంచి అంతే ఆమె ఆచరణలో ఉన్నవి. దక్కనీ ఉర్దూ, తెలంగాణ మాండలికం లో కథలో మంచి భాష ఉన్నది"

శోభ : "కథ చాలా బాగుంది. సాంప్రదాయంలోని చెడును తల్లీ కూతుళ్ళు యిద్దరు వ్యతిరేకిస్తారు. సంభాషణలు కొంచెం తగ్గిస్తే బాగుంటుందే మో".

రఘోత్తం : "భాష విషయంలో రిజిడ్ గా ఉండక్కర్లేదు. పాఠకుల పట్ల డెమాక్రటిగ్‌గా ఉంటుంది. తప్పనిసరైనా చోటే ఉర్దూ పదాలు వాడండి. కథను ఎంత సంక్షిప్తకరిస్తే అంత శక్తి వంతంగా పేలుతుంది. ఈ కథ శుభలేఖ

వచ్చినప్పటి నుండి కాక పెళ్ళి దగ్గరకి చేరుకోవడంతోనే ప్రారంభించవచ్చు కథ ఏ కాలంలో నడిచిందో శ్రద్ధ తీసుకోండి. బాసిత్ మూడు కథల్లోనూ సంఘటనలు ఉన్న వాటిని బాగా వాడుకోలేదని నా అభిప్రాయం"

[illegible] "[illegible]గం" ఒక ప్రైవేట్ స్కూల్ ఉపాధ్యాయిని వృత్తి [illegible] ఒత్తిళ్ళు, లైంగిక వేధింపులు అందులో నుండి [illegible]పాధ్యాయుడి తో కలసి తమ పరిధి లో పరిష్కారం ఆలోచించే కథ ఇది. చిన్న కథ నిర్మాణంలోకి తీసుకురావడానికి రచయిత ప్రయత్నించాడు.

విజయలక్ష్మి : ప్రైవేట్ స్కూళ్ళలో సమస్యలు చాలా ఉన్నాయి. స్త్రీలకు అదనపు ఇబ్బందులు ఉంటాయి. సొంతంగా స్కూల్ పెట్టాలనుకోవడం కన్న అక్కడే పరిష్కారం వెతుక్కోవచ్చు కదా".

బాసిత్ : "స్కూల్ పెట్టడమే పరిష్కారమా. అదికూడా ప్రైవేట్ స్కూల్ అవుతుంది కదా. మళ్ళీ అవే సమస్యలు రిపీట్ అవుతాయి. కదా"

ఎల్లారెడ్డి : "చిన్న కథ రాసినందుకు రచయితకు అభినందనలు. ఇది అతి సాధారణమైన కథ అని నా అభిప్రాయం"

శోభ: "మళ్ళీ స్కూలు పెట్టడం అంటే ప్రైవేటీకరణ భావజాలం సమస్య కాదా?"

ఉమాదేవి : "కరస్పాండెంట్ వేధింపులకు విరుగుడుగా వేరేస్కూలు పెట్టుకోవడం లేదా ఇంకో స్కూల్ లో చేరిపోవడం పరిష్కారమా? కరస్పాండెంట్ వేరేవాళ్ళను వేధిస్తూనే ఉంటాడు. సమస్యకు అక్కడే పరిష్కారం అంటే ఆయనకు బుద్ధిచెప్పేది ఉంటే బాగుండు"

ఇందులో రాజారావు పాత్రను మరీ ఆదర్శీకరించారు. ప్రైవేట్ స్కూల్లో చాలా సమస్యలుంటాయి. వాటన్నింటి వల్ల యింకొ స్కూలు పెట్టుకుంటూ పోతే, వీళ్ళు అట్లాగే తయారవుతారు. అసలు కథలోని రాజారావు, సావిత్రి లాంటి వాళ్ళు స్కూలు పెట్టలేరని నేనన్నాను.

అయితే స్కూలు పెట్టాలని మిడిల్ క్లాస్ లో చాలా సహజంగా ఉండే ఆశ అనీ, దూకిన తర్వాతే సాదక బాదకాలు తెలుస్తాయనీ రాము అభిప్రాయపడ్డాడు.

మహమూద్ అయితే వేరే స్కూలు పెట్టుకోవడం అంటే వాడికి శిక్ష పడకుండా వీళ్ళను వీళ్ళే శిక్షించుకోవడం అని అన్నాడు.

రవి, బాసిత్ 'అవసరం' శీర్షిక సరైందేనా అని చర్చించారు.

కథ మీద పాణి, రఘోత్తం లు మాట్లాడంతోటి ఆ సెషన్ ముగిసింది

పాణి : "ఇది ఏ స్వభావము లేని మాములు కథ. సమస్యని చాలా పైపైన చూశారు. మహిళా సమస్యలైతే చాలా అలవోకగా రిఫ్లెక్ట్ అయినాయి. స్త్రీ సమస్య అనేది స్కూలుపెట్టుకుంటే అయిపోయేది కాదు. అది లోతైనా గాయం, స్కూలు పెడితే ఏమవుతుంది? అధికారం, సంపద అనేవి వాళ్ళ దుష్టగుణానికి కారణం. వాటి గురించి కథ చెప్తుందని పాఠకులు ఆశిస్తారు. అవి కథలోకి రాకపోవడం వల్ల మాములు కథ అయింది." బహుశా రచయిత యిట్లా రాద్దామనే అనుకున్నట్టుంది.

రఘోత్తం : "ప్రతి వాళ్ళు తమకు సాధ్యమైన పద్ధతిలో పరిష్కారం వెతుక్కుంటారు. లొంగిపోయే వాళ్ళుంటారు, ఎదిరించే వాళ్ళూ ఉంటారు. వాళ్ళూ అట్లా కాకపోతారా అనేది వేరే విషయం"

సాయంత్రం కాస్త రిలాక్సేషన్ కోసం పెన్నా ఒడ్డున అలా నడుచుకుంటూ పోయాం. ఎండిపోయిన పెన్నను చూసుకుంటూ పెన్నేటి పాట గుర్తుచేసుకున్నాం. విజయలక్ష్మి అయితే " పారచేతబట్టుకొని వంగి బీరుదనుక, ఇట్టి చెమ్మట కాలువగట్టుదనుక, ఇసుక పాతర లోతుల కేగు దనక, నీకు కన్పించేది యేటి నీటి చుక్క" అని పద్యం చెబుతూ వచ్చింది. విద్వాన్ విశ్వం చెప్పినట్లు "చిటపట వానలకే నోరుదెరచి నురుగు గ్రక్కుకునే" పరిస్థితి అయితే ఇప్పుడు లేదు అనుకుంటూ ఉండగానే చిటపట వాన మొదలైంది. వర్షంలో తడుస్తూ వెనుదిరిగాం.

తర్వాత ఆడెపు లక్ష్మీపతి 'జీవన్మృతులు' కథ చదివి చర్చించాం. కథ చాలా పెద్దది కావడంతో విజయలక్ష్మి, రాము, నేను తలా కొంత పంచుకొని చదివాం. రాము అయితే మధ్య మధ్యలో కరెంట్ పోతూ ఉంటే టార్చ్ వేసుకొని మరీ చదివాడు. చైతన్య స్రవంతి టెక్నిక్ ఒక ప్రవాహంలోకి తీసుకుపోయింది. ఇలా కథ రాయాలంటే ఎంతో సాహసం ఉండాలనిపించింది. ఇదే అభిప్రాయాన్ని నేను చెప్పాను.

గీతాంజలి కథలోని ప్రధాన పాత్ర సైకాలజీని వివరించారు. మనిషిలో ఉండే చేతన, అంతశ్చేతన, అచేతన అవస్థల గురించి ఒక సైక్రియాటిస్ట్‌గా చెప్పుకుంటూ పోయారు. ఇది తనకు చాలా ఇష్టమైన టెక్నిక్ అని అన్నారు.

కథా నిర్మాణం గురించి కంటే రచయిత దృక్పథం మీద ఆసక్తి కరమైన చర్చ జరిగింది.

రఘోత్తం : "బైటవస్తున్న కథలపట్ల కొన్ని సందేహాలున్నాయి. మంచి కథ లేదా చెడ్డ కథ అని పేరుపడ్డ కథల మీద మన అభిప్రాయాలు తప్పక చెప్పవలసి ఉన్నది.

విజయలక్ష్మి : అదుపు లేని ఆలోచనలన్నీ, బైటికి చెప్పడానికి ఇబ్బంది కలిగించే ఆలోచనలన్నీ చదువుకోవడం కష్టంగా ఉంటుంది.

కథలో టెక్నిక్ కంటే కూడా అందులోని 'విషయం' గురించి చర్చ జరగవలసి ఉందని పాణి స్థూలంగా కథ నేపథ్యాన్ని వివరించారు.

పాణి : కథ నేపథ్యం, నూతన ఆర్థిక విధానాలు ప్రారంభమైన కొత్తలో పైకి ఎగబాకే స్థితి లో ఉన్న మధ్య తరగతి "తాను ఏదో కోల్పోతున్నట్టు భ్రమకలిగించేలా వాపోవడం, దానికి సమర్థన కూడగట్టుకోవడం యిందులో ప్రధాన అంశం. ప్రధానప్రాత పశ్చాత్తాపం చూచి చాలా మంది పాఠకులు కన్విన్స్‌కావచ్చు. అలాంటి ఫలితం ఆశించి కథ నడిచింది. కాని అతని పశ్చాత్తాపంలో నిజాయితి లేదు. అంత దొంగ ఏడుపు. భావజాలపరంగా చాలా విమర్శనాత్మకంగా చూడా వలసిన కథ ఇది. అల్లం రాజయ్య "మధ్యవర్తులు" కథ గుర్తుచేసుకుంటే చాలా విశ్లేషించవచ్చు.

రఘోత్తం : కథ ఏమిటంటే - ప్రధాన పాత్ర మార్నింగ్ వాక్ కోసం నిద్రలేస్తాడు. తన షూస్ వెతుక్కుంటుండగా ఒక ఉత్తరం కనపడుతుంది. తల్లి అనారోగ్యం గురించి అందులో ఉంటుంది. ఇది మంచి కథ అని కొందరు అన్నారు. చెడ్డ కథ అని కొందరు అన్నారు. ఇది 'దొంగ' కథ. పాలితుడు, పాలకుడుగా మారే క్రమంలో పడే ఆపసోపాలే ఇందులో ఉన్నాయి. దీనికి బహుమతి నిర్ణయించిన వాళ్లలో కారా ,అబ్బూరి ఛాయాదేవి వంటి వాళ్ళు ఉన్నారు. కథంతా యాంటీ ఫిలాసఫీ !

మానవుడైన వాడు ఎవడైనా ఆ ఉత్తరం చూసిన తర్వాత తల్లిని చూడ్డానికి వెళ్ళాలి. పైగా అమానవీకరించుకోవడం కోసం ఎన్ని అవస్థలు రాస్తారు ! మూడు గంటల ప్రయాణం చేయలేక, తన మీద సానుభూతి కోరుకునే దొంగ ఏడుపు ఇందులో వుంది. పెద్ద వాళ్ళు కూడా దీని పట్ల మోహితులు ఎందుకయ్యారు ? కథని ఫిలసాఫికల్ బ్యాక్ గ్రౌండ్‌లో చూడాలి. ఉత్తరం చూడగానే తల్లి దగ్గరికి పాయిరావచ్చు. అది కథ అవుతుంది గాని పోకపోవడానికి కారణాలు వెదికి కథ చేద్దామని ప్రయత్నించారు. అమానవీకరణ చెందడం కథ ఎట్లవుతుంది ? జీవితం కుళ్ళిపోతుందని ఏడవడం సాహిత్యం కాదు. జీవితం ఎట్లా ఉండాలో దానికి ఏం చేయాలో చెప్పేది సాహిత్యం. టెక్నికల్ విషయాలు చర్చ కాదు. కావాలంటే మనం ఇంత కంటే గంభీరంగా రాయొచ్చు.

పాణి : కథ లోని పాత్ర అన్నీ కోల్పోయిన వాడు కాదు. కోల్పోయనని చెప్పడం భూటకత్వం. ఇప్పుడు మధ్య తరగతి కుటుంబరావు కాలం నాటిది కాదు. అన్ని సౌకర్యాలు అనుభవిస్తూ ఏదో కోల్పోయమని ఏడుస్తుంటారు. ప్రస్తుతం సాహిత్యం లో అది డామినేట్ చేస్తోంది. కథ సందర్భంలో లోతయిన భావజాల చర్చ జరిగింది. ఈ చర్చతో మొదటి రోజు సమావేశం ముగిసింది. రెండో రోజుకు ఇంకొంతమంది మిత్రులు కలిశారు. మరుసటిరోజు ఉదయం విజయలక్ష్మి కథతో సమావేశం మొదలైంది. చాలా కాలం తర్వాత తనను ప్రేమించి వ్యక్తిగత కారణాలు, కొన్ని బలహీనతల వల్ల వేరే అమ్మాయిని పెళ్ళిచేసుకున్న అబ్బాయి ఎదురుపడడం, పశ్చాత్తాపాన్ని వ్యక్తం చేయడానికి

ప్రయత్నించడం, దానికి ఆమె ప్రతిస్పందన స్థూలంగా ఇది కథ.

పన్నెండేళ్ళ తర్వాత అతను ఆమెను కన్విన్స్ చేద్దామనుకోవడం అసంబద్ధంగా అనిపించింది. ఇద్దరి జీవితాలు అప్పటికే సెటిల్ అయిపోయాయి కదా - ఇది నా అభిప్రాయం

ఉమ : పాత్రలు బైటికి అనుకునేవి, లోపల అనుకునేవి ఏమిటో స్పష్టంగా లేదు.

శోభ : తండ్రి చెప్పాడని వేరే అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాడు. ఇన్నాళ్ళ తర్వాత ఆమెకు సంజాయిషీ చెప్పుకోవాల్సిన అవసరం ఏముంటుంది ?

ఉదయమిత్ర : "కథ విన్నట్టుగా ఉంది. చాలా సార్లు చదివిన సబ్జెక్ట్. సినిమాల్లో కూడా కనిపిస్తూ ఉంటుంది. కథలో భావుకత బాగుంది. అయితే నాక్కూడా అన్నేళ్ళ తర్వాత ఆమెను కన్విన్స్ చేయాల్సిన అవసరం ఏముంటుంది అనిపించింది".

ప్రశాంత్ : కథంతా ఒకటే మూడ్ ఉంది. దానికి తగిన సన్నివేశాలు లేవు. చాలా విషయాలు వాచ్యంగా వచ్చాయి. వేర్వేరు సన్నివేశాలుగా నడిస్తే బాగుంటుం దేమో !

బాసిత్ : ఎన్నేళ్లయినా జ్ఞాపకాలు ఉంటాయి. పశ్చాత్తాపం ఉంటుంది. దాన్ని వ్యక్తీకరించు కోవాలని ఉంటుంది. ఆమె జీవితం తెలిసి ఉంటే కథ ఇంకా బాగుండేది.

గీతాంజలి : కథని ఒకే సనివేశంలో చెప్పడం బాగుంది. కుటుంబ సంబంధాలు కొన్ని వాక్యాల్లోనే అయిన బాగా వివరించారు. కథలో ఆమెకు పెళ్ళి అయిందా లేదా అనేది తెలీలేదు. అదే కీలకమైనది.

ఎల్లారెడ్డి : ఆడవాళ్ళ మనస్తత్వాలు, మగవాళ్ల మనస్తత్వాలు వేరుగా ఉంటాయి. మళ్ళీ ప్రేమించిందా, పెళ్ళి చేసుకున్నదా అనేది అప్రస్తుతం. చాలా ప్రేమలు మగవాడి పిరికి తనం వల్లనే విఫలమవుతాయి. చిన్న కథ లక్షనాలు ఉండటం ఆరకంగా ఇది మంచి కథ

మహమూద్ : మగవాడికి ఉండే సవాలక్ష చపలత్వాల్లో అది ఒకటి. ఇలాంటి కథలు చాలా వస్తుంటాయి. రావాల్సిందే. కథ ముగింపు ఆమె తన ఆత్మాభిమానం నిలబెట్టుకోడం నాకు నచ్చింది.

రవి : ఒకే సన్నివేశంలో కథ నడవడం బాగుంది. వాడి మనస్తత్వాన్ని ఇంకా ఎక్కువ చిత్రీకరించాలి.

పాణి : నిర్మాణం వైపు నుండి కథలోకి వెళ్ళి చూస్తామా లేక కథలో ఏముందో? అని అక్కడి నుండి నిర్మాణం లోకి పోదామా. లోపల్నుండి చూసి దానికి అనువైన నిర్మాణం గురించి ఆలోచించాలి. ఇలాంటి కథలు ఎన్ని వచ్చినాయింకా రావాలనుకుంటున్నమంటే ఈ సబ్జెక్టులో ఇంకా ఏదో మిగిలిపోయి ఉందన్నమాట. కథలో ఆ అబ్బాయి ఆ అమ్మాయి వెంటపడలేదు. తారసపడింది కాబట్టి ఆమెతో సంభాషణ నడపడానికి ప్రయత్నిస్తాడు. నిజాయితి ఉన్నప్పుడు చెడుగా చిత్రీకరించాల్సిన పని లేదు. పశ్చాత్తాపం తో వస్తాడు. ఆమె రిసీవ్ చేసుకుంటుందా ? లేద అనేది ఆమె స్థితిని బట్టి ఉంటుంది. ఇది చాలా సంక్లిష్టమైన వ్యవహారం. చాలా భావోద్వేగాలతోకూడిన పరిస్థితి ఆడవాళ్ళకు మరి ఎక్కువగా ఉంటుంది. సొసైటీలో ఉన్న పరిస్థితి వల్ల. చిన్న కథలో ఉన్న పరిమితి వల్ల, ఇవన్నీ రాలేదు. దీనిగా యిదీ ఒక కథే.

రఘోత్తం : అక్కడి ఆకథ ఒకే, మనసుకు అనిపించింది రాశారు. కళ్ళకు కనిపించడం కూడా ఉంటుంది కదా. వాతావరణం చిత్రించండి. వాస్తవాన్ని కూడా ఉన్నతీకరించాలి. అతనెంచుకున్న దారి పట్ల కోప్పడటం ఎందుకు. నీ మనసుకు తోచినట్టు నువ్వు చేశావు, నాకు తోచినట్టు నేను చేశాను అని ఆమె అనొచ్చు. పాత్రను ఇంకా ఎడ్యుకేట్ చేయొచ్చు. పాఠకుల్ని కూడా ఒకడుగు ముందుకు వేయించవచ్చు.

తర్వాత ఉమాదేవి కచ్చీరు బండ కథ చదివారు. ఒక కుటుంబ తగాదా పంచాయితీ దగ్గర కథ మొదలవుతుంది. ఆస్తి కోసం అన్నదమ్ముల మధ్య జరిగిన గొడవ నేపథ్యంలో తమ ప్రాంతం వలస దోపిడికి గురౌతున్నదని దానికి పరిష్కారం ప్రత్యేక రాష్ట్రమేనని తెలంగాణ రాష్ట్ర ఉద్యమానికి లింక్ చేశారు.

ఎల్లారెడ్డి : టైటిల్ బాగుంది. మాండలికం బాగా తీసుకొచ్చారు. సమక కథ.

గీతాంజలి : కథ పూర్తిగా రాలేదు. కుటుంబ సంబంధాలు, ఆస్తి కోసం అక్కడి నుండి రాజకీయాల దగ్గరికి పోతుంది. ఇది రచయిత చైతన్యం. కాదు.

బాసిత్ : రాజకీయాలు చెప్పే చైతన్యం పాత్రకుందా?

ప్రశాంత్ : కథ మంచి సన్నివేశం దగ్గర మొదలై ఉపన్యాసంగా ముగిసిపోయింది. మాండలికం సంభాషణలకే పరిమితం చేసి ఉంటే బాగుండేది.

ఉదయమిత్ర : కథలో మాండలికం బాగుంది. ప్రతిదానికీ పరిష్కారం తెలంగాణ అనడం సరైంది కాదు. పొయెటిక్ జస్టిస్ అన్నట్టు మొదలైన చోటే కథ ఎండ్ కావాలి.

రాము : కథాంశం సరిగ్గా కుదరలేదు. కొత్తగా రాస్తున్నారు కాబట్టి 'తెలంగాణ', 'విప్లవం' లాంటివి దొర్లుకుంటూ వస్తాయి.

శోభ : కథ ప్రారంభం బాగా వచ్చింది. కుటుంబ సమస్యకు తెలంగాణ సమస్యకు అన్వయం కుదర్లేదు.

శ్రీనివాస్ : తక్కువ నిడివిలో చెప్పారు. తెలంగాణ గ్రామీణ వాతావరణం కథలో వచ్చి ఉంటే బాగుండేది.

మహమూద్ : కథలో భూమికి సంబంధించిన అంశం ఇమిడి వుంది. దోపిడి చేయగా మిగిలిన కొద్ది భూమి కోసం కుటుంబంలో ఘర్షణ - ఈ పాయింట్ బాగుంది. కాని అది కథ కాలేదు.

రవి : కథ ప్రారంభం బాగుంది. కుటుంబంలో వున్న సమస్యను, భూమి సమస్యను తీసుకుపోయి కోస్తా వలసవాదుల దోపిడీలో కలపడం బాగాలేదు. అట్లా కాకుండా రచ్చబండ దగ్గర చర్చ జరుగుతుంది. ఆ సందర్భంలో ఆమె మనసులో ఉండేది మెరుపులాగా వచ్చి ఉంటే బాగుండేది.

పద్మనాభరెడ్డి : కుటుంబ వాతావరణం బాగానే ఉంది. కథలో సమన్వయ లోపం ఉంది. కుటుంబ సమస్యని సామాజిక సమస్యగా పరివర్తనం చేయాల్సి ఉండగా ఒక్కసారిగా జంప్ చేసింది. చేహోవ్ ఒక మాటన్నారు. కథలో గోడ మీద తుపాకీ ఉంది అని చెబితే అది ఎక్కడో ఒక చోట పేలాలి.

పాణి : ఇది కథగా రూపొందే ప్రాసెస్ గురించి చర్చించాలి. భాష అవగాహన స్పష్టంగా వున్నాయి. దృక్పథం కూడా ఉంది. సొంత సమస్యను సామాజిక దృశ్యంలో భాగం చెయ్యాలి. అయితే అది కథగా మారాల్సి వుంది. కథ రాయడానికి కావాల్సిన శక్తి ఉంది. దాన్ని ఆమె వాడుకోవాలి.

ఈ సమావేశంలో ఒక చిన్న ప్రయోగం లాంటిది ఎల్లారెడ్డి గారి మౌఖిక కథ. 'విముక్తి' అని పేరు పెట్టిన కథని ఆయన మౌఖికంగా చెప్పారు. దీని మీద కూడా మంచి చర్చ జరిగింది.

తర్వాత కథ మహమూద్ ఎడారి ఓడ. పొట్టకూటి కోసం సౌది వెళ్ళిన ఇద్దరు సాధారణ ముస్లిం యువకుల కథ. నిబద్ధతగా బరువు బాధ్యతలను మోసే గౌస్, జులాయిగా తిరిగే ఇంతియాజ్, వాళ్ళిద్దరి మధ్య ఒక సౌది వనిత రావడం, ఘర్షణకు దారి తీస్తుంది. గౌస్ జీవితము విషాధాంతంగా బలైపోవడంతో కథ ముగుస్తుంది.

బాసిత్ : సౌది వాతావరణం బాగా తీసుకొచ్చారు. కథ గొప్ప విషాదాన్ని ఆవిష్కరించింది.

విజయలక్ష్మి : కథ నాకు నచ్చలేదు. ఏం చెప్పాలని రాశారో అర్థం కాలేదు.

పరిమళ్ : కథని వ్యక్తిగత బలహీనతల కేంద్రంగా రాశారు. వ్యవస్థ పాత్ర ఏం లేదు. అది వెలితి.

రాము: కథ టైటిల్ చాలా బాగుంది. ముగింపు అలా ఉంటుందని అస్సలు ఊహించలేదు. గౌస్ని అనవసరంగా చంపేశారేమో అనిపించింది. అయితే ఎడారి జీవితంలోని సంక్షోభాన్ని బాగా చిత్రించారు.

శోభ : కథలో తప్పుడు మార్గంలో వెళ్ళిన వ్యక్తికి శిక్ష పడకుండా ఒక మంచి మిత్రుడు చనిపోతాడు. దాని పట్ల అతనికి పశ్చాత్తాపం కూడా లేదు. మంచి

పనిష్మెంట్ పడితే ఎలా ?

ముగింపు గురించి నాకూ అసంతృప్తి ఉంది. మిత్రుడి మరణం తర్వాత హూజ్ ఏమయ్యాడు. అది ముగింపుకు తీసుకొస్తే బాగుంటుందేమో ! ్ ముందే మేం ఈ విషయాన్ని చర్చించాంకూడా.

ాక్కూడా ముగింపు నచ్చలేదు. గల్ఫ్ దేశాలకు పోయిన వాళ్ళు కష్టపడి ు గాని ఇట్లా వేరే స్త్రీలతో సంబంధాలు పెట్టుకొని డబ్బు ాలనుకోవడం అసహజంగా ఉంది.

హమిద్ : ముగింపు ఎట్లుంటుందో అని ఎదురు చుశాను. చంపి శవాన్ని మాయం చేయడం సౌదీలో సాధ్యమవుతుందా. అక్రమమార్గంలో సంపాదించాలనుకున్న వ్యక్తి ఏమవుతాడో చెప్తే బాగుండేది.

రపి ు గౌస్ పాత్ర పట్ల సానుభూతి ఉంది. సౌదీలో ఉండే కష్టాలు కథల ఎమిలేవు. అక్రమ సంబంధం ద్వారా డబ్బు సంపాదించుకోవడం మాత్రమే ో వచ్చింది. అది ఎక్కడైనా ఉంటుంది. మహమూద్ లాంటి రచయిత ఒక ాజిక సమస్య గురించి చెప్తాడని ఆశిస్తాం. క్రైమ్ స్టోరీ చెప్పడానికి ఎడారి ఓడ రాయాలా ?

ఎల్లారెడ్డి : కథలో వేగం ఉంది. బాగా చదివిస్తుంది. భాష కూడా బాగా కుదిరింది ఇంతియాజ్‌కు ఏమైనా జరిగితే అప్పుడు తగిన శాస్తి జరిగిందని పాఠకులు ఫీలవుతారు. అలా ఉంటే బాగుండేది.

శ్రీనివాస్ : రచయిత ఏం చెప్పదలచుకున్నాడో అర్థం కాలేదు. ఏదో సంఘటన జరిగి ఉంటుంది. దాన్ని యధాతథంగా కథలో పెట్టినట్లు అనిపిస్తుంది.

గీతాంజలి : గల్ఫ్ కథలు బాగా వస్తున్నాయి. ఇంకా చాలా రావాల్సిన అవసరం ఉంది. కథలో వ్యక్తిగత లోపం వల్ల మరణం జరిగింది. ఇక్కడి నుండి గల్ఫ్ పోయిన వాళ్ళు చాలా కష్టాలు పడుతున్నారు. చాలా మంది రాశారు కూడా. ఇప్పుడు కొత్త పరిస్థితులు ఏర్పడ్డాయి. వాటి గురించి రాస్తే కొత్త కథ అవుతుంది. కథనం నాకునచ్చింది.

పద్మనాభరెడ్డి : గల్ఫ్ వాతావరణం రాలేదు. ఇండియాలో జరిగినట్లుగానే ఉంది. ప్రయోజనం దృష్టితో చూస్తే అసంతృప్తిగానే ఉంది. అసంపూర్తి కథ అనిపిస్తుంది. కథని అక్కడ ముగిస్తే ప్రయోజనం ఉండదు.

పాణి : సౌది కథలు రావడం చాలా అవసరం. అయితే ఈ కథలో సౌది లేకపోవడం వెలితి. స్థల కాలాలు అక్కడి నుండి ఉత్పత్తయ్యే వైరుధ్యాలు రాలేదు. మనిషి సహజత్వాలు యాదృశ్చిక ఘటనలు కథా వస్తువు కాదు ఈ కథ ఒక అసహజమైన ఘటన దగ్గర మొదలై యాధృశ్చిక ఘటనతో ముగుస్తుంది."

రఘోత్తం : ఇది వాస్తవవాద కథ కథని హత్య దగ్గర మొదలుపెట్టి ముందుకు పోవచ్చేమో చూడండి.

అభిప్రాయాలన్నీ విన్నాక రచయిత ప్రతిస్పందిస్తూ తాను జరిగింది జరిగినట్టు రాశానని, తన ప్రత్యక్ష అనుభవాలు సౌది లో చాలా ఉన్నాయని అవన్నీ రాయాలను కుంటున్నానని చెప్పాడు. ఈ కథ వరకు అయితే ఇలాంటి అసహజ మరణాలు అక్కడ ఎక్కువగా జరగుతాయని అది మాత్రమే చెప్పాలనుకున్నానని అన్నాడు.

కాసేపు భోజన విరామం తర్వాత పరిమళ్ "నదిపక్కనే ఉన్నా" కథ చదివారు. ఇది షాద్ నగర్ సమావేశంలో చదివిన కథే. అక్కడ వచ్చిన అభిప్రాయాల నుండి కథను కొన్ని మార్పులు చేసి తిరగరాశారు. కథ ఎక్కువ సంక్షిప్తతకు గురైందని ఇంతకు ముందు వచ్చిన అంశాలు లేకపోవడంలో కొంత మిస్ అయినట్టు అనిపించిందనే అభిప్రాయాలు వచ్చాయి. పాణి మాట్లాడుతు కథా లక్షణాలు బాగా వచ్చాయని చెప్తూ కథని పంచాయితీ దగ్గర మొదలుపెట్టి అక్కడే ముగించి బ్యాక్‌గ్రౌండ్‌లో ఘర్షణని చిత్రీకరించడానికి ప్రయత్నించమని సలహ ఇచ్చారు.

తర్వాతి కథ శ్రీనివాస్ చదివారు. ఒక ప్రజాసంఘంలోని కార్యకర్త రాజ్యం ప్రైవేటు హంతక ముఠాచే హత్య గావింపబడే సంఘటన కేంద్రంగా నడిచిన కథ ఇది. నిబద్దతతో ప్రజల కోసం పని చేసే క్రమంలో మానవీయ విలువల కోసం ఆరాటం, కుటుంబంలో మానవసంబంధాలు కథలో తీసుకోచ్చే ప్రయత్నం చేశారు. కథకు పేరు పెట్టలేదు. మహమూద్‌తో చర్చ మొదలైన కథా నిర్మాణం గురించి మంచి చర్చ జరిగింది.

మహమూద్ : టెక్నికల్ గా ఇది కరెక్ట్‌కాదు. కథ రిపోర్టు లాగా ఉంది. డైలాగ్ రూపంలో కథ ఉండాలి. ఇలా రాయడం వల్ల శిల్పం విషయంలో మనమీదున్న అపప్రధ ఇంకా పెరుగుతుంది.

భాస్కర్ : ఇది రిపోర్ట్ మాదిరే వుంది. మన్నెం ప్రసాద్‌ను కళ్ళ ముందు నిలిపాడు.

గీతాంజలి : శ్రీనివాస్‌గారు సీరియస్ సబ్జెక్టు తీసుకున్నారు. అయితే నిర్మాణ లోపం బాగా ఉంది. సంభాషణల్లో చెప్పి ఉంటే బాగుండేది. కులచైతన్యమే కాదు వర్గ చైతన్యం కావాలని, భూమి మీద హక్కు రావాలనే అవగాహన కథతో రావడం చాలా మంచి విషయం.

ప్రశాంత్ : కథని ఇట్లా చెప్పడం అలవిగాని పని. ఆయన చనిపోయిన దగ్గర్నుండి మొదలై మనవైపు నుండి చెబితే బాగుంటుందేమో ఆలోచించండి.

ఉదయమిత్ర : కథ ఓపెనింగ్ బాగా వచ్చింది. అయితే తర్వాత రిపోర్ట్‌గా మారిపోయింది. రాజారాం పాత్ర ఎదుగుదలను అతని ఆచరణ నుండి చిత్రించి వుంటే బాగుండేది. ప్రకృతి, వాతావరణ చిత్రణ ఉన్నా కూడా డ్రైగా ఉంది.

రాము : ఇది మన్నెం ప్రసాద్ కథ అని అర్థమయింది. మధ్యలో ఉపన్యాసాలు ఎక్కువగా వున్నాయి. కథని హత్య దగ్గర ప్రారంభించి ప్రయత్నించండి.

ఉజ్వల్: కథ సంఘటన దగ్గర మొదలై ఆశావహంగా ముగించి వుండాల్సింది.

రాఘవాచారి : నాకు ఒకసారి సంఘటనంతా మళ్ళీ కళ్ళ ముందు కొచ్చింది. జరుగుతున్న దాన్ని రికార్డు చేయాలని అనుకోవడం వల్ల ఇలా వచ్చింది. అయినా నడుస్తున్న చరిత్ర రికార్డు కావాలి. కథగా రాయకపోయినా దాన్ని ప్రచురించి జనంలోకి తీసుకు పోవాల్సిన అవసరం ఉంది. అయితే పత్రికల్లోకి రాని విషయాలు కాక ప్రజలు మాట్లాడుకునేవి చెప్పాలి. నెత్తురు వెనకున్న రహస్యం చెప్పాలి. ఇక్కడ ఇంకో విషయం కూడా చెప్పుకోవాలి. పోలీసుల చర్య స్టేషన్లోనే తయారవ్వదు. రాజ్యంలో పై నుండి కిందికి వస్తుంది.

శోభ : కథని హత్య జరిగిన దగ్గర నుండి ఆయన ఎందుకు హత్య చేయబడ్డాడు అని గతంలోకి పోయి చేప్తే బాగుంటుంది.

విజయలక్ష్మి : నేను గమనిస్తూండేది, చావు చుట్టూ వున్న అన్ని కథలకు ఒకే సూచన వస్తోంది, చావు దగ్గర మొదలు కావాలి అని. అది కూడా రొటీన్ అయిపోతుంది కదా?

పాణి : శ్రీనివాస్, తాను మాత్రమే రాయగలిగిన కథను ఎంపిక చేసుకున్నారు. ఇది రాయవలసిన కథ. థీమ్ చిన్నది కాదు. కథలో మనకు కనిపించే హత్య రూపం వెనక చాలా ఉంది. అందులో శ్రీనివాస్‌కు తెలియంది ఏమీ లేదు. కథ ఎందుకు ఇంత డల్‌గా వచ్చిందా? అనిపించింది. ఇలాంటి కథలుండడం వల్ల మనం చేయాల్సింది ఏమిటంటే, ఒక సామాజిక చరిత్రకు కల్పన రూపం ఇవ్వడం. యథాతథంగా రాయడం వల్ల రిపోర్ట్ అయిపోతుంది.

రఘోత్తం : మనం సంఘర్షనని చిత్రించేది మానేసి ఒక వైపు నుండే చూస్తాం. ఉదాహరణకు పత్తి రైతు కథని ఆత్మహత్యతోనే ముగించాలా? వాళ్ళ భార్యా బిడ్డలు ఎలా బతుకుతారు, ఆ సంఘర్షణ ఒక మంచి కథ అవుతుంది. ఇంకొక విషయం - భయంకరమైన ముగింపు ఇస్తే అది ఎటువంటి సైకలాజికల్ ఎఫెక్ట్ ఇస్తుంది? కథలో రెండు పక్షాలను చిత్రించాలనే స్పృహ ఉంటే సంఘటన సమగ్రంగా వస్తుంది.

సీరియస్‌గా జరుగుతున్న చర్చ మధ్యన వడ్డెబోయిన శ్రీనివాస్ కథ 'ఓటమోత్సవం' కొంత రిలీఫ్‌గా అనిపించింది. ఈ కథను బాసిత్ చదివారు. హాస్యం, వ్యంగ్యం కలగలసి ప్రయోగాత్మకంగా రాసిన కథ ఇది. ఎలక్షన్లలో ఓడిపోయిన ఒక రాజకీయ నాయకుడు ఓటమోత్సవం పేరుతో బహిరంగ సభపెడ్తాడు. సవాలక్ష జిమ్మిక్కులతో ఐదేళ్ళ తర్వాత మళ్ళీ వచ్చే ఎలక్షన్ల కోసం ప్రజలకు గాలాలేస్తాడు. కథ చదువుతున్నంత సేపు మేం చాలా మందిమి నవ్వు ఆపుకోలేకపోయాం.

ఉదయమిత్ర : కథ మంచి రిలీఫ్ నిచ్చింది. మన కథల్లో తగినంత హాస్యరసం కూడా ఉండాలి. ఇది చాలా మంచి కథ.

ఉజ్వల్ : హాస్యం మరీ ఎక్కువయిందేమో అనిపించింది. దాని వల్ల నిండుదనం లోపించినట్లైంది.

పరిమళ్ : ఎన్నికల వ్యవస్థను పరిహసించిన వ్యంగ్య కథనం ఇది అయితే దాన్ని అతిగా వాడుకున్నట్టు అనిపించింది.

రాఘవాచారి : రచయిత ముందర ప్రజలున్నారని గుర్తు పెట్టుకోనట్టుగా రాశాడు. ప్రజలు నీకుక్కకే ఓటు అనే స్థితిలో ఏమీ లేరు. రూలింగ్ క్లాస్ మీద జోకులుండాలిగాని ప్రజలపై ఇటువంటి జోకులేయడం మంచిదికాదు. నిజానికి ప్రజల తెలివితేటల మీద పాలకుల తెలివితేటలు అభాసుపాలైన సందర్భాలున్నాయి.

శోభ : తెలంగాణ మాండలికం బాగా వచ్చింది. ఇది రాజకీయ వాతావరణం మీదనే వ్యంగ్యం అని నా అభిప్రాయం. ప్రజలు ఇప్పుడు తాత్కాలిక ప్రయోజనాల కోసమే ఓట్లేస్తారు కదా!

విజయలక్ష్మి : హాస్యం బాగా వచ్చింది గాని రాఘవాచారి గారు చెప్పిన సమస్య వుందని నా అభిప్రాయం కూడా.

ఖలంధర్ : ఇది మంచి వ్యంగ్య కథ. అయితే రాజకీయ నాయకుల ప్రవర్తన వరకు ఇది సరిపోతుంది. ప్రజల పట్ల తేలికపాటి అభిప్రాయాలు వ్యక్తమయినట్లు, నాక్కూడా అనిపించింది. అలా కాకుండా నాయకుడి అభిప్రాయాలతో విభేదించినట్లు కూడా రాయెచ్చు. ప్రజలందరి అభిప్రాయాలు ఒకటే ఉండవు కదా.

నా కనిపించిందేమిటంటే హాస్యం కథ రాయాలని అనుకొని రూపం మీదనే శ్రద్ధ పెట్టడం వల్ల ఇట్లాంటి లోపాలు వస్తాయేమో అని. అయితే రాము మాత్రం ఈ సెటైర్ మొత్తం ప్రజల మీద కాకుండ వ్యవస్థ మీద ఉంది అన్నాడు. అయితే కథలో వ్యంగ్యాన్ని ఎలా వాడుకోవాలి అనే విషయం మీద రఘోత్తం, పాణి కొన్ని అభిప్రాయాలు చెప్పారు.

రఘోత్తం : అసహజ సన్నివేశాన్ని ఆశ్రయించుకొని వ్యంగ్య రూపాన్ని కుమ్మరిస్తే ఇలాంటి కథలొస్తాయి. ప్రజల్ని విమర్శించడం అని కొంత మంది అన్నారు. అయితే ప్రజల్ని విమర్శించడం, ప్రజాదృక్పథాన్ని విమర్శించడం ఒకటి కాదు. రచయిత ప్రజా దృక్పథం మీదనే రాశాడు. కాని సహజ సన్నివేశాన్ని తీసుకుని వుంటే సరిపోయేది. మనం కార్మికవర్గ దృక్పథంతో కార్మికుల్ని విమర్శించవచ్చు.

పాణి : అసలు వ్యంగ్యానికీ హేతువుకూ పొసగదేమో. అసహజత్వాన్ని పరిహరించి సహజత్వం లోకి పోతే సమస్య ఉండదు.

ఆ రోజు సాయంకాలం ఒక అనువాద కథ చదువుకున్నాం. రుషికేష్ పాండే రాసిన ఒరియా కథ అది. 'నేనూ మీలాంటి వాడినే' అనే పేరుతో తెలుగులో వచ్చింది. గీతాంజలి గారు కథ చదివారు. ఒక మరుగుజ్జు పాత్ర కేంద్రంగా నడిచిన కథ అది. దాని మీద కూడా ఆసక్తికరమైన చర్చ జరిగింది. కాస్త చీకటి పడ్డ వేళ పాణి 'నిర్ణయాలు' కథ చదివారు. అది షాద్‌నగర్‌లో చదివిన కథే. కొన్ని చిన్న చిన్న మార్పులతో తిరగరాసుకొచ్చారు. ఎందుకో దీని మీద పెద్దగా చర్చ నడవలేదు. కొంతమంది చాలా బాగుందని, ఇంకొందరు కథలో ఇంటలెక్చువల్ పరిభాష ఉండటం వల్ల అందుకోలేకపోయామని అన్నారు. దీనికి రఘోత్తం స్పందిస్తూ వీలైనంత ఎక్కువ మందికి చేరే విధంగా ఇంటిలెక్చువల్ స్థైప్ నుండి దిగవచ్చు కదా అన్నారు.

చివరగా వెంకటకృష్ణ కథ 'వేపకాయంత నిజం' తో ఆ రోజు సమావేశం ముగిసింది. వెంకటకృష్ణ వర్క్‌షాప్‌కు రాలేకపోతున్నానంటూ ఆయన కథని పాణీతో పంపించారు. గ్రామంలో మద్దయ్య అనే ఒక బి.సి.యువకుడు దళిత చైతన్యంతో ఎదిగే క్రమంలో బి.సిలను ఐక్యం చెయ్యాలనుకోవడం, అగ్రకులాలతో ఘర్షణ కథలోని ఇతివృత్తం. ఈ కథని నేనే చదివాను.

శోభ : కథ వాస్తవాన్ని ప్రతిబింబించింది. ఈరోజు ఎస్సీ, ఎస్టీ, బిసి రిజర్వేషన్లు ఉన్నా అధికారం అగ్రకులాలకు దక్కుతుంది. కింది కులాల వాళ్ళు ఎంత ప్రయత్నం చేసినా వాళ్ళని పైకి రానివ్వరు.

ఉజ్వల్ : కథ బాగుంది. బి.సి ఉద్యమం తలెత్తేటప్పుడు ఎదురయ్యే ఇబ్బందులు బాగా రాశారు.

ఉదయమిత్ర : ఇది రాజకీయ కథ. కథ కొంచెం డ్రైగా ఉన్నట్లనిపించింది. 'వేపకాయంత నిజం' టైటిల్ ఎందుకు పెట్టారో అర్థం కాలేదు. టైటిల్ కుదర్లేదేమో!

ప్రశాంత్ : నాకేమనిపించిందంటే సీరియస్ సబ్జెక్టని తేలికగా చెప్పాడేమో! తీసుకున్న సబ్జెక్టులో చాలా కాంప్లెక్సిటీ ఉంది. కథ దాన్ని ఎలివేట్ చెయ్యలేకపోయింది.

బాసిత్ : అల్టిమేట్‌గా అధికారం ఎవరి చేతుల్లో ఉంటుంది అనే విషయం కథలో బాగా చెప్పారు. వాస్తవికతను చిత్రించడంలో కూడా ఎంతో సహజత్వం ఉంది. కథ నాకు బాగా నచ్చింది.

గీతాంజలి : ఇతివృత్తం చెప్పడానికి మంచి సంభాషణలను ఎన్నుకున్నారు. నిచ్చెన మెట్ల వ్యవస్థలో అధికారం ఎట్లా కేంద్రీకృతం అయి ఉంటుందో ఈ కథ ద్వారా చెప్పారు.

శ్రీనివాస్ : కథ బాగానే ఉంది గాని, వాతావరణ చిత్రణ లేదు.

రమణ : 'వేపకాయంత వెర్రి' అని సామెతుంది. 'వేపకాయంత నిజం' అనడం కరెక్ట్ కాదేమో! కథలో సీరియస్‌నెస్ కూడా లేదనిపించింది.

రాము : ఇది రాజకీయ కథ కావడం వల్లనేమో సామాజిక సంబంధాలు సరిగ్గా రాలేదు.

మహమూద్ : పైకి దళిత చైతన్యం చిత్రించిన కథ అనిపించినా వాస్తవానికి వర్గ స్పృహతో రాసిన కథ. కింది కులాలన్నీ ఐక్యం కావాలని చెప్పడం అదే. కథ సగం వరకు కథకుడు చెప్పుకుంటూ వచ్చాడు. అందువల్ల ఫ్లో బాగా రాలేదు. తర్వాత సంభాషణ మొదలైనప్పటి నుండి మంచి బిగువు వచ్చింది. మొదటి పేజీలు సవరించుకుంటే సరిపోతుంది.

ప్రశాంత్ : కథని ఇట్లా రాస్తే బాగుంటుందేమో! ఒక బోయామె సర్పంచ్ అవుతుంది. అక్కడ ఘర్షణ మొదలవుతుంది. ఆమెని కథలో ఎస్టాబ్లిష్ చేస్తే బాగుంటుంది.

రవి : ఇది చాలా విస్తృతి ఉండే కథ. మద్దయ్య ఎదిగిన ప్రాసెస్ నేరుగా కథలోకొస్తే బాగుంటుందేమో! ముగింపు ఆ మేరకు బాగుంది. ఒక ధైర్యాన్ని ప్రకటించినట్లైంది. ఇది చాలా అవసరమైన కథ.

పాణి : కథ అధికారం కేంద్రంగా నడిచింది. ఎమ్మార్పీయస్ వచ్చినప్పటి నుండి పల్లెల్లో పోలరైజేషన్ పెరిగింది. కథలో కూడా మద్దయ్య మద్దయ్య యాదవ్‌గా మారిన క్రమంలో చాలా సంఘర్షణ ఉంటుంది. అది పై కులాల వాళ్ళకు భయం గొలుపుతుంది. అయితే బి.సి కథ రాస్తున్నపుడు కొన్ని వైరుధ్యాలు పట్టించుకోకతప్పదు. ఉదాహరణకు బోయ, గొల్ల కాంట్రడిక్షన్ - అది కేంద్రం కావాల్సింది.

ఇక మిగిలింది ఒక్క రోజే. చదవాల్సిన కథలు, ప్రయాణ హడావుడి వీటిని దృష్టిలో పెట్టుకొని చివరిరోజు ఉదయం ఓ గంట తొందరగా మొదలుపెట్టాలనుకున్నాం. అనుకున్నట్టే ఉదయం ఎనిమిది కంతా కూర్చున్నాం. చివరిరోజు సమావేశం విజయలక్ష్మి అధ్యక్షతన జరిగింది. ఉజ్వల్ బీజా కథతో ఆ రోజు సమావేశం మొదలైంది.

లంబాడా పిల్లవాడు 'బీజా' కేంద్రంగా నడిచే కథ ఇది. బీజాని బళ్ళో చేర్పించి తల్లిదండ్రులు వలస వెళ్ళవలసి వచ్చినపుడు అతన్ని బంధువులకు అప్పజెబుతారు. ఎన్నేళ్ళైనా తిరిగి రాని తల్లిదండ్రుల కోసం ఎదురు చూస్తూ తన చుట్టూ ఎన్నో ఆకలి చావుల్ని చూస్తూ పెరిగే క్రమంలో గిరిజన హక్కుల కోసం జరిగే పోరాటంలో భాగమవుతాడు బీజా. మహబూబ్ నగర్‌లోని గిరిజన జీవితాన్ని రికార్డు చేయాలని ఈ కథ రాసినట్లు రచయిత చెప్పాడు. కథ మీద చర్చ ఇలా నడిచింది.

ప్రశాంత్ : బీజా తల్లిదండ్రులు వలసపోయిన తర్వాత నడిచిందంతా కథ కాదు.

మొదట కొన్ని పేజీలు బాగా వచ్చినా తర్వాత రచయిత జోక్యం చేసుకొని వాచ్యం చేశాడు. పిల్లవాడి పాత్ర దగ్గర మొదలైె కథ మధ్యలో దారి తప్పింది. అతని మీద ఫోకస్ మారిపోయి అనేక విషయాలు వచ్చేశాయి. అంతేగాక పిల్లవాడి స్థాయికి మించిన మాటలున్నాయి. అట్లా కాకుండా పిల్లవాడి చదువు కోసం తల్లిదండ్రుల ఇబ్బందులు అక్కడ ఘర్షణ లేదా తల్లిదండ్రుల పోయిన తర్వాత కథ మొదలైనా బాగుండేది.

నేనేం చెప్పానంటే కథ మీద రచయిత కంట్రోలు తప్పిందని. సమస్య ఎక్కడొచ్చిందంటే తెలిసిన వన్నీ కథలోకి తీసుకురావాలని ఆరాటపడటంలో అట్లా కాకుండా ఏది కథ అవుతుందో ఆలోచించుకొని దాన్నే రాసి ఉంటే బాగుండేది.

గీతాంజలి : దీన్ని నవలికగా మార్చవచ్చేమో! కథ అయితే చాలా సంక్షిప్తం చేయాలి.

బాసిత్ : కథలో మంచి ఎక్స్‌ప్రెషన్స్ ఉన్నాయి. అయితే కథ రెండు మూడు భాగాలుగా విడిపోయింది. లింక్ తెగిపోయింది.

నరేశ్ : మంచి వస్తువు తీసుకున్నారు. భాష, స్థానికత బాగున్నాయి. అయితే కథ మొదలైన చోటు నుండి ఎక్కడికో వెళిపోయింది. కథని రెవల్యూషనైజ్ చేయాలని రచయిత ప్రయత్నించినట్టు అనిపించింది. బీజా ఉద్యమంలోకి పోవడం చూపించాడు. వలస సమస్య ఎక్కువగా ఉన్నచోట యిలాంటి ముగింపు ఎలా ఉంటుంది? ఆలోచించాలి.

శోభ : వలస పోవడం ఒక్కటే తీసుకుని రాసుంటే బాగుండేది. చాలా అంశాలు చర్చించాలని తాపత్రయ పడ్డాడు.

పరిమళ్ : శైలి బాగుంది. అయితే బీజా అంత చైతన్య స్థాయి ఉందా అనిపించింది.

ఉదయమిత్ర : బీజా పాత్ర మధ్యలో అదృశ్యమైపోయిందన్న అభిప్రాయం వచ్చింది. నేనలా అనుకోవడం లేదు, ఆ పిల్లవాడు కథ అంతా ఉన్నాడు. అదృశ్యం గానే అయినా ఉన్నాడు. ఆ పాత్ర చైతన్యానికి జీవితమే ఆధారము. అయినా కూడా రచయిత కంట్రోల్ తప్పాడు.

రాఘవాచారి : మహబూబ్ నగర్ తాండాలు చూస్తే ఈ కథలో కంటే దయనీయమైన పరిస్థితి ఉంది. ఈ కథని ఇరవైయేళ్ళ క్రితం రాసుకున్నాడు. ప్రారంభం అక్కడ వుంది. కథలో పోలీసుల ఇంటర్వెన్షన్ కల్పించబడ్డట్టుగా ఉంది. నిర్మాణపరమైన సమస్య వుంది. కథలో చాలా జంప్స్ వున్నాయి. అవన్నీ తీసేస్తే మంచి కథ అవుతుంది.

విజయలక్ష్మి : కథాంశం, నిర్మాణం పట్ల శ్రద్ధ తీసుకోక పోవడం వల్లనే సమస్యంతా. బలమైన సబ్జెక్టయినా పాత్రల చుట్టూ తిరక్కుండా వ్యాఖ్యానం వల్ల కథ దెబ్బతింది.

ఫాణి : ఈ ఇతివృత్తం మీద రాసినందుకు ముందు రచయితకు అభినందనలు గుర్తింపు లేని మనుషుల మీద రాయడం గొప్ప విషయం. అయితే మనకు తెలిసిన జీవితమంతా సాహిత్యం కాదు. సాహిత్యం కాదగ్గది ఏమిటి అని ఎంచుకోవడం పెద్ద ప్రయాస ఉన్నది ఉన్నట్టు రాయడం సాహిత్యం కాదు. ఉన్న దాంట్లోంచి తెలియనిది, అర్థం చేసుకోలేనిది సాహిత్యంలోకి తీసుకురావాలి. కథాంశం ఏమిటి అనే విషయంలో పర్టికులర్‌గా ఉండాలి. దీన్ని ఎట్లా రీ ఆర్గనైజ్ చేయాలి ఆలోచించండి. పోలీసుల జోక్యం వల్ల హింస, హింస వల్ల బీభత్సం, విధ్వంసం ఆధారంగా సెన్సిబులిటిస్‌ని పెంచాలి. మీడియా మన సెన్సిబులిటీస్‌ని నాశనం చేస్తుంది. అలా కాకుండా కరుణ కలిగేటట్లు రాయాలి. కథలో కంఠస్వరానికి ఏ పాత్రను ఎంచుకున్నాము అనేదాన్ని బట్టి ఉంటుంది. ఈ కథలో పిల్లవాడి పాత్రను ఎంచుకున్నారు లంబాడా జీవితాన్ని మొత్తం చెప్పాలనుకున్నారు. ఇంకో విషయం - నవలగా మార్చాలి అనే అభిప్రాయం కూడా వచ్చింది. పేజీలు పెరిగితే నవల కాదు. నవలకూ ఒక స్ట్రక్చర్ ఉంటుంది.

రఘోత్తం : పాలమూరు కథల విషయంలో కూడా కరువు ప్రాంతం అక్కడి నుండి కథలు రావడం మంచి విషయం. ఇప్పటికిది కథగా ఓ.కే. కొన్ని స్వల్ప మార్పులు అవసరం. అక్కడక్కడా అతివాద పోకడలున్నాయి.

తర్వాత ఉదయమిత్ర 'అడవిరాజ్యాన' కథ చదివారు.

నాన్‌లోకల్ టీచర్‌గా ఒక మారుమూల ప్రాంతంలో ఒక స్త్రీ పడే బాధల్ని రాశారు. అక్కడి హెడ్‌మాస్టరు, కొంత మంది లోకల్ టీచర్లు మానసికంగా వేదిస్తూ ఉంటారు. నిస్సహాయ పరిస్థితిలో ఒకసారి ఆమె తన భర్తను పిలిపించుకుంటుంది. అతను వచ్చేటపుడు నది దాటాలని ప్రయత్నించి చనిపోవడంతో కథ ముగుస్తుంది.

శోభ : ముగింపు బాగా లేదు. అంత విషాదాంతం కావాలా?

శ్రీనివాస్ : కథ ద్వారా రచయిత ఏం చెప్పదలచుకున్నారో అర్థం కాలేదు. లోకల్ నాన్‌లోకల్ సమస్యకు చివర్లో ఇచ్చిన ముగింపునకు సంబంధమే లేదు.

నరేశ్: కథలో ఆదిలాబాద్ అడవి గురించి ఉండాలి. అడవి రాజ్యాన అని టైటిల్ కూడా పెట్టారు. అది అగుపడ లేదు.

పరిమళ్ : నాన్ లోకల్ అందునా స్త్రీ ఎదుర్కొనే ఇబ్బందులు కథలో వచ్చాయి. కథ బాగుంది.

బాసిత్ : ఎవరు కోరుకున్న ఇబ్బందులివి? ముగింపు కూడా అంత విషాదకరంగా ఉండటం అనవసరం. అది కూడా నదిలోకి దూకి ప్రాణాలు పొగొట్టుకోవడం అసంబద్ధంగా ఉంది.

గీతాంజలి : ఏం చెప్పదలచుకున్నారో అర్థం కాలేదు ఈ ముగింపు దానికి సంకేతం

మహమూద్ : కథలో కొత్త అంశమేమీ లేదు. ముగుంపు చాలా ఇబ్బంది కరంగా ఉంది. వస్తువును ఎంచుకోవడం లోనే జాగ్రత్త వహిస్తే బాగుండు. చూసిందల్లా సాహిత్యం కాదుకదా.

అయితే ఏది కథాంశం అనేదాన్ని సీరియస్‌గా ఆలోచించాలి అని నేనున్నాను.

విజయలక్ష్మి : విని రాసిందానివల్ల వచ్చిన ఇబ్బంది ఇది. చాలా పైపైన చూసినట్లు ఉంటుంది. కథలో ఫోకస్ పాయింట్ కూడా సరిగా లేదు.

పద్మనాభరెడ్డి : కథలో మొదలు, చివరి బాగుంది. అయితే సమస్యను చిత్రించడానికి ఎనుకున్న వర్ణనలు కథాంశాన్ని మింగివేశాయి. అడవి, పులి, వాగు మొదలైన వర్ణనలు ఉండవలసిన మోతదు కంటే ఎక్కువగా ఉన్నాయి. భర్త పాత్ర చనిపోవడం అనేది చాలా అసంబద్ధంగా ఉంది. తెలిసి తెలిసి నదిలో దూకడం - అతన్ని రమ్మనడం, అతను నదిలో దూకడం, బలవంతంగా లాక్కొచ్చి చంపేసినట్లుంది. అయితే శైలి బాగుంది.

రాఘవాచారి : కథాంశం ఎంపిక లో జాగ్రత్త ఉండాలి. కథ ప్రయోజనం ఏమిటి, చెప్పదలచుకున్నది ఏమిటి అనే దాంట్లో స్పష్టత ఉండాలి. ఇక్కడ కథంశామే ప్రశ్నార్థకం.

రఘోత్తం : ఇందులో వ్యక్తం కాని విశేషం ఏమిటంటే విద్యాశాఖ పోస్టింగ్ ఇచ్చే టప్పుడు ఎంత అమానవీయంగా ఉంటుంది అనేది. అది సరిగ్గా చెప్పాలంటే దీన్ని విషాదం దగ్గర ప్రారంభించాలి. అంటే కథ ఎక్కడ ముగిసిందో అక్కడ. ఉదాహరణకు భర్త శవం నదిలో తేలడంలో ప్రారంభించవచ్చు. చాలా మంది ఆరంభించాల్సిన చోటే ముగిస్తున్నారు.

తర్వాత కథ గీతాంజలి గారి అల్సర్ ఇతి వృత్తం కుటుంబంలో భార్యా, భర్త మధ్య వైరుధ్యాలు, ఘర్షణ కలిసి చేసుకోవాల్సిన పనిలో స్త్రీ యే మొత్తం భారాన్ని మోయాల్సి రావడం, సమాజంలో అభ్యుదయవాదులు గా ఉన్న భర్తలూ ఇందుకు మినహాయింపు కాకపోవడం అనే విషయం ప్రధానంగా కథ నడుస్తుంది. భార్య దూరమైపోతే ఆ ఒత్తిడంతా తల్లి మీద పడి అనారోగ్యంతో ఆమె మరణించడంతో కథ ముగుస్తుంది. కథ మీద, కథలోని ఇతివృత్తం మీద మంచి చర్చ జరిగింది.

రాఘవాచారి : అసమసమాజం కొనసాగినంత కాలం ఈ అసమానతలు ఉంటాయి. కథలో ప్రధాన పాత్ర తనను అర్థం చేసుకోవడం లేదనే ఉంది గాని

ఆమె ఎవర్ని అర్థం చేసుకుంటొంది, తన ముసలి అత్తగారి పట్ల కన్సర్న్ ఏమిటి అనే ప్రశ్నఉంది.

విజయలక్ష్మి : ఈ వస్తువు ఎప్పుడూ చర్చనీయాంశమే. మహిళా సంఘంగా ఎప్పుడూ దీన్ని చర్చిస్తుంటాము. భర్త తో వంట పని చేయించడం లో ఆచరణాత్మకంగా ఉండాలి. డిమాండ్ చేసి సాధించుకునేది. పెద్ద గుదిబండ అన్నప్పుడే విడిపోవాలి. కథ విషయాన్నికొస్తే అంతా వాచ్యంగా సాగింది. దృశ్యీకరణం లేదు. అలాగని మోనోలాగ్ కూడా కుదిరినట్టు లేదు.

పద్మనాభరెడ్డి : ఇది కథ అనిపించలేదు. స్వగతంగాని, ఏకపాత్రాభినయం గాని అవొచ్చు.

రాము : నరేషన్‌కు సంబంధించి నాది ఒక సూచన. కథ తెచ్చిపెట్టుకున్న మాండలికంలో నడిచింది కథలో పొసగని ప్రస్తావనలు. ఉదాహరణకు పనిపిల్ల కథ, మహేంద్ర దొంగ అనడం లాంటివి ఉన్నాయి. అట్లే బుష్ సద్దాంను లొంగిపొమ్మని అంటున్నాడు అనడం. ఆవైరుధ్యాన్ని భార్య భర్తలకు అప్లై చేయవచ్చా ? కుటుంబంలో చాలా గొడవలుంటాయి, ప్రేమలూ ఉంటాయి. దాన్ని ఒక వైపే చూస్తున్నామా ?

ప్రశాంత్ : కథా లక్షణాలు చాలా తక్కువ ఇది చాలా కాంప్లికేటెడ్ విషయం. ఇటువంటి దాన్ని తీసుకొని కేవలం నిందార్థంలో, నిరాశాజనకంగా రాశారు.

గీతాంజలి గారి కథల్లో నేను గమనించిందేమిటంటే చాలా కథల్లో ఒక పాత్ర కేంద్రంగా కథనం సాగుతుంది. కొంత వైవిధ్యం గల రూపం తీసుకుంటే బాగుంటుందేమో అని నేను చెప్పాను.

బాసిత్ : స్త్రీ శ్రమ పట్ల యిలాంటి దృక్పథం ఉన్నంత కాలం ఘర్షణ తప్పదు. ఈ కథ నడిచిన పద్ధతి బాగాలేదు. నాక్కూడా కొన్ని అనవసరమైన పోలికలు తెచ్చారేమో అనిపించింది.

ఉదయమిత్ర : మేధావులు ఇళ్ళలో ఎట్ల ఉంటారో అనేది మనకు తెలీదు. దాని మీద ఫోకస్ చేశారు. కథ అనడం కంటే మానవసంబంధాల చర్చ అంటే బాగుంటుంది. కథలో సంఘటన లేదు. చర్చ ఉన్నది రచయిత్రి కాకుండా ఒక మాములు స్త్రీ పాత్రని కేంద్రంగా చేసుకొని చెప్పినట్లైతే బాగుండు.

పరిమళ్ : అతని ద్వంద్వ ప్రవృత్తికి కారణాలు చెప్పింటే బాగుండు.

శ్రీనివాస్ : మొదటి నుండి ఎవరిదో కథ చెప్పినట్లే ఉంది. సంభాషణ సన్నివేశాలు రావాలి. కలిసి ఉండే స్థితి లేనప్పుడు విడిపోవడం మంచిదే. ముగింపు పొడిగించాల్సిన అవసరం లేదు.

శోభ : సమస్య నంతా పాత్ర ఏకరవు పెడుతుంది. చర్చించదు. పురుషాధిక్యతవల్లనే ఆ పని చేయలేక పోతున్నదా ?

రఘోత్తం : 'వాద' కథల్లో ఉండే పరిమితి ఇది. దీన్ని సంవాద కథగా రాయగలిగితే మంచిది. మనం పరిణితి చెందలేము. రెండు వైపుల చూసే డెమాక్రెటిక్ దృష్టి కూడా కలుగుతుంది.

తర్వాత ప్రశాంత్ కథ చదివారు. ప్రశాంథ్ రాసిన మూడో జైలు కథ ఇది. దీనికి పేరు పెట్టలేదు. లంపెన్ ప్రొలెటేరియట్ అనబడే వర్గం నుండి జైలు వాతావరణం లో న్యాయవ్యవస్థ మీద సమాజం మీద విమర్శ కథలో ప్రధానాంశం.

రఘోత్తం : సీరియస్ కథలు రాసేవాళ్ళు ఒక సారి ప్రశాంత్ కథల్ని చూడాలి, హాస్యం, వ్యంగ్యం కలగలిసిన ధోరణి సమాజంలో ఉంటుంది. దాన్ని పట్టుకోవాలి.

రాఘవాచారి : పాత్రలు మాట్లాడుతున్నప్పుడు జీవిత సంఘర్షణ అంతా వచ్చింది. దీంతో రచయిత జోక్యం అవసరం లేకపోయింది. ఉత్తరాంధ్ర మాండలికంతో రాయటం చాలా బాగుంది.

ఉదయమిత్ర : ఒక కెమెరా తీసుకొని జైల్లోకి పోయి జీవితాల్ని చిత్రీకరించినట్టు అనిపించింది. జైళ్ళ మీద రావిశాస్త్రి విమర్శ గుర్తుచేసింది.

గీతాంజలి : జైలు లోపల, బైట కూడా ఉండే విధ్వంసాన్ని బాగా చిత్రించారు. హాస్యం, వ్యంగ్యం కలసి విషాదాన్ని చిత్రించింది.

చివరగా పద్మావతి తన తొలి కథ 'నీలిమ' ను చదివింది పద్మావతి ప్రొద్దుటూరులొని డిగ్రీ కాలేజ్ విద్యార్థిని. కథ రాయడం లో నేకాక ఇటు వంటి సమావేశాల్లో పాల్గొనడం కూడా కొత్త. సమాజంలో భర్త నుండి విడిపొయిన స్త్రీ పట్ల ఉండే చిన్న చూపు ను ఇతివృత్తంగా చేసుకొని కథ రాసింది. మొదటి కథ అయినా మంచి భాష, నడక, వ్యక్తీకరణ ఉన్నదని అందరూ మెచ్చుకున్నారు. కథ చదివిన వెంటనే అభినందలతో అందరూ చప్పట్లు కొట్టారు.

పద్మావతి కథతో కథా పఠనం అయిపొయిందనకున్నాం. అయితే మూడు రోజులూ నిర్వహణ బాధ్యతల్లో బిజీగా ఉండి రవి తన కథ చదవలేకపోయాడు. అప్పటికే సాయంకాలం అవడంతో చాలా మంది ఊర్లకు వెళ్ళిపోవాలి గనుక మూడు రోజుల సమావేశం మీద అందరం సమీక్షించుకొని, తొందరగా వెళ్ళిపోవాల్సిన వాళ్ళు వెళ్ళిపోగా మిగిలిన వారి సమక్షంలో రవి తన కథని చదివాడు. కథ ఇతివృత్తం భర్త చేత నిరాదరణకు గురైన స్త్రీ పరాయి పురుషుడితో సంబంధంలోకి రావడం, అందువల్ల ఎదురయ్యే అవమానాలు, చివరగా ఆమె నిలదొక్కుకొని పిల్లల్ని పెంచి ప్రయోజకుల్ని చేయడం. కథకు పేరు పెట్టలేదు. చివరి సమావేశంలో దాదాహయత్ పాల్గొన్నారు.

పద్మనాభరెడ్డి : క్యారెక్టరైజేషన్ గురించి కొన్ని అనుమానాలున్నాయి. వాస్తవికతకు భిన్నంగా ఉన్నట్టుంది. సమాజానికి ఆమోదనీయంగా పాత్రల్ని మలచాలి.

దాదాహయత్ : కథలో పాయింట్ లేదు. రెండు మూడు కథలు కలగలిసినట్లయింది. కథ శంకర్‌ది కాదు. ఖైరూన్‌ది. ఆమె వైపు నుండి రాయకుండా శంకర్ వైపు నుండి రాయడం వల్ల సమస్య వచ్చింది. ఆమె రక్షణ కోసం అగ్రకులస్తుణ్ణి ఆశ్రయించినట్టయింది. అది అవసరం లేదు. దీని వల్ల కథ పెరిగింది. రవికి కథ రాయడం బాగా తెలుసు. కొంత సవరణ చేస్తే బాగా వస్తుంది.

కథలోకి చాలా అంశాలు వచ్చేశాయి. మొదటి సన్నివేశంలో కథకు సంబంధం లేదు అని నేనన్నాను.

మహమూద్ : కథ మొదట్లో మాండలికం ఉంది. తర్వాత పోయింది. సంభాషణలు కూడా లూజ్‌గా వున్నాయి. ఖైరూన్ పట్ల రచయితకు అభిమానం ఉంది. కాని అది శంకర్ కథ అయిపోయింది.

రాము : కథని శంకర్ వైపు నుండి కూడా రాయొచ్చు. కాని ఈ పాత్ర సరిగ్గా ఎస్టాబ్లిష్ కాలేదు.

పాణి : దీన్ని ఎన్ని వైపుల నుండి చూడచ్చో ఆలోచించాలి. ఇటువంటి సంబంధాలు ఎమోషన్‌తో జరిగేవి కాదు. ఒకటి సామాజిక సంరక్షణ, రెండు ఆంతరంగిక విషయాలు - ఇవి కారణాలు కావొచ్చు.

రఘోత్తం : కథ చాలా బాగుంది. మామూలు మనుషులు మామూలు జీవితాలు. అది అట్లాగే ఉంటుంది.

ఇక వర్క్‌షాప్ సమీక్షలో చాలా అభిప్రాయాలొచ్చాయి. స్థానిక రచయిత కుప్పిరెడ్డి పద్మనాభరెడ్డి గారు యువ రచయితలతో పరిచయం చాలా ఆనందాన్నిచ్చిందన్నారు. అట్లాగే వర్క్‌షాప్‌లో మొదటిసారి పాల్గొన్న కర్రా ఎల్లారెడ్డిగారు మీ ప్రయత్నానికి నా వంతు సహకారాన్నిందిస్తానని చెప్పారు. స్థానిక సాహితీ మిత్రులు కూడా ఈ వర్క్‌షాప్ గొప్ప అనుభవాన్నిచ్చిందని, నిజానికి ఈ వాతావరణం చూస్తుంటే ఒక కొత్త లోకంలోకి వచ్చినట్లుందని అన్నారు. ఇక అందరి అభిప్రాయాల్ని క్రోడీకరిస్తే

కథల్ని విని మొత్తంగా పాలో కావడం కష్టంగా ఉంది. వినడంలోనే అసౌకర్యం ఉంది. కాబట్టి రచయితలు తమ కథల జిరాక్స్ ప్రతుల్ని ముందుగానే ఇచ్చి చదివించాలి.

కొన్ని కథల మీద మొహమాటం కొద్ది చర్చ జరగడం లేదు.

విమర్శకుల్ని పిలిపించి ఉపన్యాసం ఇప్పిస్తే బాగుంటుంది.

విమర్శ రచయితని ప్రోత్సహించే విధంగా ఉండాలి.

సమయ పాలన ఉండాలి.

సమకాలీన కథల్ని చర్చించాలి.

చివరగా పాణి కథల్ని చూసే దృష్టి కోణం ఎలా ఉండాలి అనే విషయం

మీద మాట్లాడారు. మన చర్చా పద్దతిలో లోపం ఉందని, ఒక దాన్ని ఎట్లా వైవిధ్యంగా చూడాలో, ఏ దృష్టిలో చూడాలో ఇంకా అలవడాలి విశ్లేషించే పద్ధతి ఏమైనా మెరుగుపడిందా అని ఆలోచించాలని అన్నారు. చర్చ కూడా బాగుంది, బాలేదు అని మాత్రమే అనకుండా కథా నిర్మాణం లోకి వెళ్ళి, దృక్పథం కేంద్రంగా జరగాలని అన్నారు. వాటితో పాటు ముఖ్యంగా మూడు అంశాల మీద శ్రద్ధ తీసుకోవలన్నారు. అవి సమయపాలన, లోతైన చర్చ జరగడం, సభ్యుల భాగస్వామ్యాన్ని పెంచుకోవడం.

మొత్తం మీద ఈ మూడు రోజులు ఎంత తొందరగా గడిచిపోయాయో అనిపించింది. కొత్త స్నేహాల్ని, కొత్త అనుభవాల్ని, కొత్త శక్తిని ఇస్తున్న ఈ సమావేశాలు ఇలాగే రెగ్యులర్‌గా జరగాలని అందరూ కోరుకున్నారు. మూడు నెలల తర్వాత మళ్ళీ కలుద్దాం అంటూ మిత్రులందరూ వీడ్కోలు తీసుకున్నారు. చివరిగా ఇంకో విషయం కూడా చెప్పాలి. ఈ వర్క్‌షాప్ సందర్భంగా కొంత మంది మిత్రులు మా ఇంట్లో కలిశారు. ఆ హడావుడీ అంతా చూసి మా అమ్మ 'నేనూ వింటాను మీ కథల్ని' అంటూ ఓ రోజు మాతో పాటు వచ్చింది. తర్వాత 'నీ కెట్లా అనిపించింది' అని నేనడిగితే, 'రోజు మనింటి బైట అరుగు మీద మేం చెప్పుకునే ముచ్చట్ల మాదిరే ఉన్నాయి అంది. ఇదే విషయం పాణికి చెబితే అయితే మనం జనంలోనే ఉన్నామన్న మాట అన్నాడు.

## హైదరాబాద్ సిటీ విరసం

దేశవ్యాప్తంగా అమలవుతున్న ప్రత్యేక ఆర్థిక మండలాలు (సెజ్‌లు) ఆంధ్రప్రదేశ్‌లో కూడా శరవేగంగా అమలవుతున్నాయి. ఇవి బీద రైతాంగాన్ని కూకటివేళ్ళతో సహా భూమినించి పెకిలించివేస్తున్నాయి. రైతుని ఉత్పత్తి నుంచి దూరంచేస్తూ దినసరికూలీగా, కార్మికునిగా, బిచ్చగాడిగా మారుస్తోంది. రాజ్యం దళారీ పాత్రను పోషిస్తోంది. బీద రైతాంగం నుంచి అస్సైన్డ్, పట్టాభూముల్ని ఏపిఐఐసి (ఆంధ్రప్రదేశ్ ఇండస్ట్రియల్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ కార్పోరేషన్) ద్వారా బడాకంపెనీలకు కట్టబెడుతూ దేశ సార్వభౌమత్వాన్ని దెబ్బతీసే విధంగా రాజ్యం వ్యవహరిస్తోంది. మళ్ళీ విదేశీపాలనకు శ్రీకారం చుడుతోంది. హెచ్చర్ డ్రగ్స్, లోకేశ్వర్, స్పర్శ్, సెంటర్ బయోటెక్ లాంటి బడా కంపెనీలకు, గ్రీన్ పార్కులు, తోటలు, రిసార్ట్స్‌లకు వేలంవేసి అమ్మేసుకుంటోంది. ఈ స్వదేశీ, విదేశీ కంపెనీలు ఏవైతే కాలుష్యంతో పర్యావరణాన్ని నాశనం చేస్తాయని అమెరికా, యూరోప్‌లలో నిషేధించారో ఆ కంపెనీలు భారత్‌లోకి మన ప్రభుత్వం అనుమతిస్తుంది. పెద్ద పెద్ద ఫార్మాసూటికల్ కంపెనీలను నిర్మించి మిగతా వేల ఎకరాల భూమిని రియల్ ఎస్టేట్ ఎమ్యూజింగ్ పార్కులు, విదేశీ విద్యా సంస్థలు, ఆధునిక సినిమా థియేటర్లకు అమ్మేస్తుంది. ఈ భూ వ్యాపారంలో బీద రైతాంగం సమిధలై విలవిల్లాడుతుంది. ఈ సందర్భంగా ఫిబ్రవరి 15న విరసం సిటీ యూనిట్, భూమి బచావో ఆందోళన్ కమిటీ కలిసి సంయుక్తంగా సెజ్‌ల ప్రాంతాన్ని సందర్శించారు. మెదక్‌జిల్లా లింగరాజుపాలెం, ముక్కురెడ్డిపాలెంలలోని 200 ఎకరాల భూమిని రాష్ట్ర ప్రభుత్వం ఏపిఐఐసి ద్వారా బలవంతంగా దోచుకుని సెంటర్ బయోటెక్, లోకేశ్వర్, స్పర్శ్‌లాంటి ఫార్మాసూటికల్ కంపెనీలకు వేలం వేసి అమ్ముకుంది. బీదరైతాంగం నుంచి ఎకరా రు.18 వేలకు తీసుకుంది. కంపెనీలకు 20, 30 లక్షలకు ఒక ఎకరా ప్రభుత్వం అమ్ముకుంటోంది. దీంట్లో ముఖ్యమంత్రి కార్యాలయం నుంచి జిల్లా కలెక్టర్, ఆర్‌డివో, ఎమ్ఆర్వో, సర్పంచ్, పంచాయితీ అధికారులకు లంచం వుంటుంది. రైతులకు వచ్చేసరికి 2, 3 వేలు కూడా మిగలక భూమి, డబ్బూ పోయి రైతులు నిరాశ్రయులౌతున్నారు. చాలామంది వేరే గ్రామాలు, పట్నాలకు వలసపోయారు. లింగరాజుపేటలో మాత్రం ముప్పిరెడ్డిపాలెం, ఉత్తరాజుపల్లె గ్రామాలకు భిన్నంగా ప్రజలు సెజ్‌లకు వ్యతిరేకంగా ఉద్యమిస్తున్నారు. వాళ్ళకు వాళ్ళ ఊరి సర్పంచ్ అండ వుంది. ఆయన భూమి కూడా పోతుంది కాబట్టి. ఇక్కడ రైతులు జాయింట్ కలెక్టర్ కార్యాలయం ముందు 30 గం॥లపాటు దిగ్బంధనం కార్యక్రమం చేశారు. అక్కడే పాటలతో, నినాదాలతో తమ వ్యతిరేకతను తెలిపారు. కాంగ్రెస్ దళారీలు తీవ్రంగా గ్రామస్తులను భూముల అమ్మకాన్ని సిద్ధం చేయ ప్రయత్నిస్తున్నారు. కొంతమంది లొంగి స్వచ్ఛందంగా భూములు ఇస్తున్నట్లు పారిశ్రామీకీకరణ వలన గ్రామ అభివృద్ధి చెందుతున్నదని, తమకు ఉద్యోగాలు వస్తాయని, స్వచ్ఛందంగా భూములిచ్చారు. లింగరాజుపేటలో అలా ఇవ్వలేదు. ప్రజలు పోరుబాటలో వున్నారు. విరసం సిటీ యూనిట్ అక్కడి ప్రజల్ని కలిసి పోరును ముందుకు సాగనివ్వమని, దళారీ ప్రభుత్వానికి ఏ మాత్రం లొంగొద్దని మద్దతు ఇచ్చింది. వాళ్ళల్లో ఆత్మవిశ్వాసాన్ని పెంచే దిశగా వారితో మాట్లాడించింది.

ఈ కార్యక్రమంలో భాగంగా ఫిబ్రవరి16న "సెజ్‌లకు, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడుదాం" అంటూ సుందరయ్య మినీ హాలులో బహిరంగ సభ పెట్టింది. విరసం సిటీ కన్వీనర్ గీతాంజలి అధ్యక్షతన జరిగిన కార్యక్రమంలో ప్రొఫెసర్ ఘంటా చక్రపాణి, జర్నలిస్టు ఎన్. వేణుగోపాల్, భూమి బచావో ఆందోళన్ కన్వీనర్ కొప్పెర ప్రసాద్ తదితరులు పాల్గొని సెజ్‌ల వలన జరిగే నష్టాలను, ప్రజావ్యతిరేక ప్రభుత్వ విధానాలను, సామ్రాజ్యవాద విధానాలను ఎండగడుతూ తమ ఉపన్యాసాలను కొనసాగించారు.

*

---

*(39వ పేజీ తరువాయి)*

చెప్పడం కూడా గుజరాత్‌లో ముస్లింలపై నేటికి అమలవుతున్న ఫాసిస్టు హిందూ మతోన్మాదుల పాశవిక పాలన. ఈ క్రూరమైన "మోడి" పాలన హిందూత్వపాలనకు ప్రత్యక్ష రూపం. ఇప్పటికి ముస్లిం యువకులను ఉద్యోగాల్లో పెట్టుకోరాదనే మౌఖిక ఆదేశం అమలవుతుంది. గుజరాత్‌లో ముస్లింలు వుండాలనుకుంటే 'మోడి' కి ఓటెయ్యాల్సిన దుస్థితికి నేటికి గుజరాత్‌లో వుంది. జహీర మనస్సును అర్థం చేసుకున్న డా.భారతి, జహీర రూపంలో జహీర సాక్ష్యాన్ని ఎలా చంపారో స్పష్టంగా తెలియపర్చింది.

గ్లోబలైజేషన్ జీవితంలోని ప్రతి అంశాన్ని తాకి చిన్నాభిన్నం చేస్తూంది. నీతి, నియమాలు మానవీయత అన్ని మంటల్లో కలిసిపోతాయి. వావి వరసలు, 'మనిషి' నామరూపాలు కరువైపోతాయి. దీని పరాకాష్టే కూతుళ్ళపై తండ్రుల అత్యాచారాలు ఇవ్వాళ ప్రతిరోజు మనం పేపర్లలో చదువుతున్నాం, వింటున్నాం కూడా. పత్థర్ కథలో ఆస్రా అనుభవించిన హింస కన్నీళ్ళు పెట్టిస్తుంది. సైతాన్ కథలో అఫ్జల్ పశ్చాత్తాపం కొంతవరకు సరైనదే ఐన అక్తర్ బేగం గాయాన్ని మాన్పలేకపోయింది. మాన్పలేదు కూడా. పత్థర్, సైతాన్, గాయబిలద్దాఫ్ కథలు సమాజంలోని సంక్షోభాన్ని నైతికవిలువల పతనాన్ని, మనలో గూడు కట్టుకున్న డొల్ల తనాన్ని బయటపెట్టే పదునైన కథలు.

పుట్టెడు దుఃఖాన్ని దిగమింగి, ఆవేదనను నిభాయించుకున్న డా. భారతి ఒక్కసారిగా కట్టలు తెంచుకున్న ప్రవాహం వలె నేను, అమీనా, మాట్లాడుతున్నా..... కథలో మాట్లాడింది. మాట్లాడింది అనడం కంటే సమాజాన్ని, మనలను నిలదీసి ప్రశ్నించింది. ఎన్.జి.వోల స్వభావాన్ని బట్టబయలుజేసింది. మన చుట్టూ ఉన్న సమాజాన్ని చీల్చి చెండాడింది. యాధృచ్చికంగా స్పందించి ఆ తర్వాత మరిచిపోయే మధ్యతరగతి స్వభావాన్ని "నేను అమీనాను గుర్తున్నానా?" అనే ప్రశ్నతో చెల్లుమనిపించింది. మన వేలు పట్టుకుని పాతబస్తీ గల్లిగల్లీ తిప్పుతూ అక్కడ పేద ముస్లిం స్త్రీలపై జరుగుతున్న హింసను, అరబ్బుషేక్‌ల మోసాలకు బలౌతున్న పేద ముస్లిం యువతుల దీన స్థితిని మన కళ్ళకు కట్టేలా పరిచయం చేస్తుంది.

తనకు అర్థమైన మేరకు తక్షణ పరిష్కార మార్గాలు చూపించింది. ఇంత పరకాయ ప్రవేశం చేసిన డా.భారతిలో నిజాయితి ఉంది. నిబద్ధత వుంది. సమస్యతో మమేకం అయ్యింది. ఆ నిజాయితి, నిబద్ధత అభినందనీయం అందుకే నేను శిల్పం, రూపం, కథ నియమాల జోలికి పోదల్చుకోలేదు.

[పెహెచాన్ (ముస్లిం స్త్రీల అస్తిత్వ పోరాటకథలు). రచన : డా. భారతి (గీతాంజలి), ప్రచురణ : మట్టి ముద్రణలు వెల రూ. 75/-] *



మనము ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M142 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | nazma |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | Blan |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |